

THE LARGEST CIRCULATED TELUGU WEEKLY

సపరివార పత్రిక

స్వాతి

FOUNDER PROPRIETOR EDITOR : VEMURI BALARAM




పాఠక దేవుళ్ళకు నమస్కారం

ఎడిటర్

వేమూరి బలరామ్


ESTABLISHED 1984 | సంపుటి 34 | 29.12.2017 | సంచిక 26

అనిల్ బిల్డింగ్స్ సూర్యారావుపేట పోస్ట్ బాక్స్ 339 విజయవాడ 520 002


Be just before you are generous

## » సీరియల్స్



## » కథలు





ముఖచిత్రం
కషిష్ హోరా

## » స్పెషల్ ఫీచర్స్



## » శీర్షికలు



# సంకల్ప సిద్ధి

దేశంలోని ఓ ప్రాంతంలో ఒకప్పుడు అనావృష్టి సంభవించింది.చాలా దూరంలోని ఏటినుండి తమ పొలాలలోకి నీరు పారటానికి రైతులు కాలువలను తవ్వే పని మొదలెట్టారు.

ఒక రైతు మాత్రం దృఢనిశ్చయుడై వున్నాడు. తన పొలంలోకి ఏటి నీరు పారేంతవరకు అంటే కాలువ ఏటిని కలిసేవరకు తను కాలువని తవ్వటం ఆపనని మనసులో శపథం చేసుకున్నాడు. అతడు తవ్వడం మొదలుపెట్టాడు.

కూతురు స్నానంవేళకు వచ్చి "నూనె పట్టించుకుని స్నానం చెయ్యి" అంది. "ఇప్పుడు రాను" అన్నాడు.మధ్యాహ్నం భార్య పొలానికి వచ్చి ముందు పని ఆపి భోజనం చెయ్యమంది. అతడు వినిపించుకోకుండా పగలంతా శ్రమించి సాయంకాలానికి తాను తవ్విన కాలువను ఏటితో కలిపాడు.

అతడప్పుడు ఇంటికెళ్ళి భార్యను పిలిచి "ఇప్పుడు వంట ఏర్పాటు చెయ్యి. భోజనం చేస్తా" అన్నాడు. స్నానం, భోజనంచేసి తృప్తిగా నిద్రపోయాడు. ఆ రైతు కనబరిచిన దృఢసంకల్పం అతని తీవ్ర వైరాగ్యానికి ఒక ఉదాహరణ.

అదే ప్రాంతపు మరొక రైతు తన పొలంలోకి నీరు పారటానికై ఒక కాలువను తవ్వుతున్నాడు. అతడి భార్యకూడా పొలానికి వచ్చి "ఇప్పటికే చాలా ఆలస్యమైంది. ఇంటికిరా" అనేసరికి పలుగు, పార పక్కనపెట్టి వెంట వెళ్ళాడు.

ఆ రైతు తన పొలానికి నీరు పారించుకోవడంలో ఎప్పటికీ సాఫల్యం చెందలేదు. దృఢసంకల్పం కొరవడి ఈ రైతు తన పొలానికి ఎలా నీరు పారించుకోలేకపోయాడో అలాగే తీవ్ర వ్యాకులత లేకుండా మనిషి భగవత్సాక్షాత్కారం పొందలేడు.

శ్రీ రామకృష్ణ పరమహంస


చందాను www.swatipublications.com వెబ్‌సైట్ ద్వారా చెల్లించవచ్చు
E-mail: advtswati@gmail.com swativja@eth.net

విడిప్రతి ₹20 12 నెలలకు ₹1076
విదేశాలకు సంవత్సరచందా (ఎయిర్ మెయిల్) ₹6666 (100 డాలర్లు)

Editor : VEMURI BALARAM Swati Publications Anil Buildings Suryaraopet Vijayawada 520 002 Printed and Published by the owner VEMURI BALARAM

Printed at Anil Swati Press Autonagar Vijayawada Cover at Kala Jyothi Process Pvt.Ltd., Hyderabad

Tel.: (0866) 243 1862 243 4017 Advt. 243 1233 Mktg. 243 3938 Fax: 0866-243 0433



## అత్యధిక సర్క్యులేషన్‌గల ఏకైక తెలుగు వారపత్రిక




15.12.2017

వచ్చేవారం స్పెషల్

మొదటి అడుగులు

ఆరోగ్యమే మహాభాగ్యమనే సూక్తిని ఎన్నడూ విస్మరించరాదు.

శరీరమనే బండిలో అతిబరువు వేయకుండా జాగ్రత్తగా నడిపించుకు పోవాలని అంటూ సంపాదకీయంలో వివరణ చాలా బాగుంది.

'ఆచార్య ఆత్రేయ మధురగీతాలు' శ్రోతలకు మంచి గిఫ్ట్‌ని ఇస్తున్నారు.

జి.వి.మురళీమోహన్ ముచ్చుమిల్లి

'సత్యాన్వేషణ' శీర్షిక బాగుంది. శ్రీమద్రామాయణకాలంలో జరిగిన అంశాలు లిఖితపూర్వకంగా ఉన్నట్టు చదివి ఆశ్చర్యపోయాం.

'పెద్దల మాట', 'నవగ్రహాల నడకలు' తదితర అంశాలు నచ్చాయి.

'చందమామరావే' శీర్షికలో కథల ప్రయోజనం కథ సూపర్బ్‌గా ఉంది.

వి.రాజ్యలక్ష్మి కర్నూలు

అవ్వ ఇదేమి చోద్యం! పెళ్ళిచూపుల్లో అమ్మాయికి వంట వచ్చా అని అడగడం నేరమైపోయిందేమిటి? నేటి ఆధునిక అమ్మాయిల వంటరానితనం మీద 'ఆ ఒక్కటి అడక్కు' అనే హాస్య భరితమైన కథ సెటైరే సుమా!

'సత్యాన్వేషణ' శీర్షిక బాగుంది.

పి.వరసయ్య హైదరాబాద్

ప్రకాశానందగిరి స్వామి బోధించిన 'ఓవర్‌లోడ్' ఆలోచింపజేసింది. ఆహార నియమాలు ఖచ్చితంగా పాటించి తీరాల్సిందే అన్న విషయం అందరికీ అర్థం అయ్యేరీతిలో తెలియజేశారు.

'సంపన్నుల సంపద మార్గాలు' స్పెషల్ ఫీచర్ ఇంట్రెస్టింగ్‌గా ఉంది.

'కాఖాగాఫూ' కథ ఆద్యంతం కొత్తదనాన్ని సంతరించుకుంది.

బి.ఎ.ఎస్.ప్రసాద్ చాగల్లు

'సత్యాన్వేషణ' శీర్షికలో ఆధ్యాత్మిక విషయాలుగురించి తెలుసుకున్నాం.

'మనిషిలో మనిషి', 'అఆఇఈ', 'వసంతసేనా చారుదత్తం', 'జై భారత్' సీరియల్స్ అన్నీ వారాన్ని ఎదురు చూసేలా ఉంటున్నాయి.

'డూప్' బహుమతి పొందిన కథ ఆద్యంతం హృద్యంగా సాగింది.

శ్రీమతి కళభూషణ్ కర్నూలు

'అనిల్' శీర్షిక చాలా బాగుంది. ఆసియా ఖండం అవగాహనసహితంగా మ్యాప్ ఉండడం గమనార్హం.

'సత్యాన్వేషణ' శీర్షిక బాగుంది.

సీరియల్స్ వేటికవే విభిన్న పంథాలో ఆకట్టుకుంటున్నాయి.

ఎన్.ఎస్.చంద్రబోస్ విశాఖపట్నం

# ఇది మంచి సమయం



21.12.2017 శ్రీ హేవళంబి నామ సంవత్సరం, దక్షిణాయనం, హేమంతఋతువు, పుష్యమాసం, శుక్లపక్షం. 22.12.2017 నుండి ఉత్తరాయణం, శిశిర ఋతువు.

**21.12.2017 గురువారం**
తిథి: తదియ సా. 7.58 వరకు
నక్షత్రం: ఉత్తరాషాఢ సా. 4.18 వరకు
వర్జ్యం:రా.8.47 నుండి 10.35 వరకు
దుర్ముహూర్తం : ప. 10.03-10.47 వరకు. మ. 2.29-3.13 వరకు
రాహుకాలం: మ. 1.17 నుండి 2.39 వరకు
మంచి సమయం: ప. 11.00 నుండి 11.45 వరకు
సూర్యోదయం: 6.29కి
సూర్యాస్తమయం: 5.32కి

**22.12.2017 శుక్రవారం**
తిథి: చవితి రా. 10.23 వరకు
నక్షత్రం: శ్రవణం సా. 7.11 వరకు
వర్జ్యం: రా.11.36 నుండి 1.22 వరకు
దుర్ముహూర్తం: ప.8.32 నుండి 9.17 వరకు. మ. 12.14-12.59 వరకు
రాహుకాలం: ప. 10.31 నుండి 11.54 వరకు
మంచి సమయం: ప. 10.30 నుండి 11.30 వరకు
సూర్యోదయం: 6.30కి
సూర్యాస్తమయం: 5.33కి

**23.12.2017 శనివారం**
తిథి: పంచమి రా. 12.25 వరకు
నక్షత్రం: ధనిష్ఠ రా. 9.43 వరకు
వర్జ్యం:రా.11.36 నుండి 1.22 వరకు
దుర్ముహూర్తం: ఉ. 6.18 నుండి 7.48 వరకు
రాహుకాలం: ఉ. 9.06-10.29 వరకు
మంచి సమయం: ఉ. 4.50 నుండి 5.56 వరకు
సూర్యోదయం: 6.30కి
సూర్యాస్తమయం: 5.33కి

**24.12.2017 ఆదివారం**
తిథి: షష్ఠి రా. 1.55 వరకు
నక్షత్రం: శతభిషం రా.11.46 వరకు
వర్జ్యం: ఉ. 5.32 నుండి 7.16 వరకు
దుర్ముహూర్తం : సా.3.57-4.41 వరకు
రాహుకాలం: సా. 4.03-5.26 వరకు
మంచి సమయం: ప. 10.35 నుండి 11.30 వరకు
సూర్యోదయం: 6.31కి
సూర్యాస్తమయం: 5.34కి

**25.12.2017 సోమవారం**
తిథి: సప్తమి రా. 2.43 వరకు
నక్షత్రం:పూర్వాభాద్ర రా.1.09 వరకు
వర్జ్యం: ఉ. 6.32 నుండి 8.14 వరకు
దుర్ముహూర్తం : మ. 12.35 నుండి 12.59 వరకు. మ. 2.29-3.13 వరకు
రాహుకాలం: ఉ. 7.43-9.06 వరకు
మంచి సమయం: ప. 11.40 నుండి 11.30 వరకు
సూర్యోదయం: 6.31కి
సూర్యాస్తమయం: 5.34కి
క్రిస్టమస్

**26.12.2017 మంగళవారం**
తిథి: అష్టమి రా. 2.44 వరకు
నక్షత్రం: ఉత్తరాభాద్ర రా.1.47 వరకు
వర్జ్యం : ప. 11.01-12.39 వరకు
దుర్ముహూర్తం: ప. 8.33 నుండి 9.18 వరకు. రా. 10.36-11.21 వరకు
రాహుకాలం : మ.2.40 నుండి 4.04 వరకు
మంచి సమయం: లేదు
సూర్యోదయం: 6.32కి
సూర్యాస్తమయం: 5.35కి

**27.12.2017 బుధవారం**
తిథి : నవమి రా. 1.55 వరకు
నక్షత్రం:రేవతి రా. 1.37 వరకు
వర్జ్యం : మ. 1.42-3.17 వరకు
దుర్ముహూర్తం : ప. 11.32 నుండి 12.16 వరకు
రాహుకాలం: ప.11.54-1.17 వరకు
మంచి సమయం: ఉ. 5.40 నుండి 6.20 వరకు.ప.9.50-10.30 వరకు
సూర్యోదయం: 6.32కి
సూర్యాస్తమయం: 5.35కి

* మీ ఆరోగ్యం మీ అదుపులో వుంటుంది.

ఆరోగ్యానికి ఒకే చిరునామా

NH నాగార్జున హాస్పిటల్

CELEBRATING 25th ANNIVERSARY

# ఆరోగ్య రజతోత్సవం

పాతికేళ్ళక్రితం ప్రవాస వైద్యుల సత్సంకల్పానికి ప్రతిరూపం విజయవాడలోని 'నాగార్జున హాస్పిటల్'.
ఆరోగ్య సంరక్షణ ప్రమాణాలు, పేషెంట్ల భద్రతకు జాతీయస్థాయిలో
గుర్తింపు సాధించిన తొలి హాస్పిటల్ 'నాగార్జున'.

అత్యున్నత ప్రమాణాలతో, ఉత్తమోత్తమ విలువలతో, విశ్వసనీయతే పునాదిగా
తెలుగు ప్రజల వైద్యసేవలో సంతృప్తికరంగా పాతికేళ్ళు గడిచాయి.
ఈ ఇరవైఐదు సంవత్సరాల ప్రయాణంలో మరువలేని అనుభవాలు, విజయాలు,
రాజీలేని వైద్యసేవలు 'నాగార్జున' ప్రత్యేకతగా నిలిచాయి.

సమాజంలో ఎన్నో మార్పులు వచ్చినా మారలేదు మన ఆరోగ్య బంధం.

పలు ముఖ్య వైద్యవిభాగాలలో అనుభవజ్ఞులైన నిపుణుల ఆధ్వర్యంలో
మల్టీస్పెషాలిటీ సేవలందిస్తున్న 'నాగార్జున హాస్పిటల్' ఈ రజతోత్సవవేళ మీ అందరికీ
హృదయపూర్వక శుభాకాంక్షలు, ధన్యవాదాలు తెలియజేస్తోంది.




ఆధునిక ట్రూబీమ్ టెక్నాలజీతో క్యాన్సర్ చికిత్సలకు మార్గదర్శిగా
నాగార్జున క్యాన్సర్ సెంటర్‌తో పునరంకితం అవుతున్నాం.

Mark of Excellence



First Accredited Hospital in Central Andhra & Rayalaseema

NH నాగార్జున హాస్పిటల్
కానూరు, విజయవాడ-7

0866-2554701-705 Helpline : 9963414242

Mark of Excellence



First Accredited Hospital in Central Andhra & Rayalaseema



నాగార్జున క్యాన్సర్ సెంటర్
కానూరు, విజయవాడ-7

Toll Free No. : 1800 123 0066

# అర్థంలేని ఆత్మహత్యలు

ప్రకృతిలోని ఏ ప్రాణీ తన ప్రాణాలను తానే తీసుకోవాలన్న ఆలోచన చేయదు. చీమ, దోమవంటి బహుచిన్నజీవులుకూడా తన ప్రాణాన్ని ప్రేమిస్తాయి. అందుకే మనిషి చంపాలని చూసినా అవి అతివేగంగా, చాకచక్యంగా తప్పించుకునే పోరాటం చేస్తాయి. ఎంతో హీనమైన జీవితం అనుకునే పంది, పామువంటివి కూడా ఆత్మహత్య ఆలోచన చేయవు. ఎన్ని కష్టాలు ఎదురైనా జీవిత పోరాటాన్ని సాగిస్తాయి.

వీటన్నిటికీ భిన్నంగా అన్ని జన్మల్లోకీ ఉత్తమమైన జన్మ అని చెప్పుకునే మానవజన్మలో ఆత్మహత్యల ఆలోచన అత్యధికంగా వుండటం, అమలవటం ఆశ్చర్యం కలిగిస్తుంది.

తమ ప్రాణాన్ని తామే తీసుకునేంత పిరికితనం మనిషిలో ఎందుకు ఏర్పడుతోందనేది ప్రశ్న. జీవులన్నింటిలోకీ ఉన్నతమైన మెదడు వున్నది మనిషికి.

పలురకాలుగా ఆలోచించగలిగిన శక్తిని ప్రశ్నించింది ప్రకృతి. ఐనా తనకు ఎదురైన సమస్యలనుండి బయటపడే యత్నం మనిషి చెయ్యలేకపోవటం ఏమిటి! సహాయం అందుకునే అవకాశం వుండి, సహాయం అందించగలిగిన మనుషులు వుండి,ఎవరూ లేని,ఏమీ చెయ్యలేని నిస్సహాయతలోకి మనిషి నెట్టబడుతున్నాడా! ఆత్మహత్య తప్పించి మరో పరిష్కారం తన సమస్యలకు లేదనుకుంటున్నాడా!

ఎందుకు ఇలా ఆత్మహత్యలకు పాల్పడుతున్నారో తెలియదు. భారతీయులలో ఆత్మహత్యాధోరణి ఏటికేడు పెరుగుతున్నది.

ప్రతిరోజూ ఏదో ఒక ప్రాంతంలో ఎవరోఒకరు బలవన్మరణానికి పాల్పడుతున్నారు.

టీనేజ్‌లో లభిస్తుంది. అదే విద్యార్థి దశలోని సమయం కూడా. విద్యార్థి దశ దాటి ముందుకు వెళ్ళిన తర్వాత వున్న వయసులో ధైర్యంపాలెక్కువ.

యవ్వనంలో ఎటువంటి ఇబ్బందులనైనా తట్టుకోగలిగిన శక్తి వుంటుంది. వైఫల్యాలను స్వీకరించి,కొత్త మార్గంద్వారా లక్ష్యం చేరటానికి అనువుగా జీవితాన్ని మలచుకునే అవకాశం ఆ వయసులో వుంటుంది. ఎటువంటి ప్రయోగానికైనా సిద్ధం.

ఉత్సాహమే ఊపిరిగాసాగించగలిగిన ఆ వయసులో పిల్లలు ఆత్మహత్యలు చేసుకోవటం మన దేశంలో కనిపిస్తున్నది. విద్యార్థి దశ ఎంతమాత్రం ఆనందపు దశగా నేడు లేదు. భారతీయ విద్యావ్యవస్థలోకి కార్పొరేట్ సంస్థలు ప్రవేశం, కోచింగ్ కేంద్రాల ప్రభావంతో వచ్చిన పోటీతత్వం వెరసి విద్యార్థిజీవితం జైలుజీవితంలా తయారైంది.

అందుకే పసికుసుమాలు టపటపా రాలిపోతున్నాయి. భారతదేశంలో కోచింగ్ కేంద్రాలకు నిలయంగా గుర్తింపు పొందిన పట్టణం రాజస్థాన్‌లోని కోట. ఆ పట్టణమే విద్యార్థుల ఆత్మహత్యలకు నిలయమవుతున్నది.

## భారతదేశంలో పెరుగుతున్న ఆత్మహత్యలు

ప్రపంచంలోని దేశాలలోఆత్మహత్యల విషయంలో అగ్రస్థానాలలో భారత్ నిలబడుతున్నది. మిగిలిన దేశాలలో ఆత్మహత్యలు లేవని కాదు.

కాని మన దేశంలో 15-29 సంవత్సరాల మధ్య వయసువారు అత్యధికంగా ఆత్మహత్యలకు పాల్పడటం ఆందోళన కలిగిస్తున్నది.

విద్యార్థి దశ చాలా హుషారుగా సాగేది అనే అభిప్రాయం సర్వసాధారణం. ఎటువంటి బరువు బాధ్యతలూ లేని వయసు అది. కొత్త రకాల ఆలోచనలు మనసులో తన్నుకువస్తుంటాయి.

ఎటువంటి ప్రయోగానికైనా సిద్ధంగా వుంటుంది మనసు. చలాకీగా, తుళ్ళుతూ గడపగలిగిన జీవితం

ఆంధ్రప్రదేశ్‌లోని కార్పొరేట్ కాలేజీలలోని పరిస్థితి అదే. విద్యా, వ్యాపారం చేసిన కార్పొరేట్‌సంస్థలు తమ విద్యాబోధన విధానంతో చదువంటే విరక్తిని తెప్పిస్తున్నాయి.చదువంటే భయం,ర్యాంక్‌ల ఒత్తిడిపై ఏహ్య భావం. ర్యాంక్, మార్కులే జీవితమన్న విధంగా తల్లిదండ్రులు పెడుతున్న ఒత్తిడి.

ఇవి తట్టుకోలేని ఇంటర్మీడియేట్ స్థాయి విద్యార్థులు ఆత్మహత్యకు ఒడిగడుతున్నారు.

దాదాపుగా ప్రతివారం ఒకఆత్మహత్యవార్త కార్పొరేట్ కాలేజీలనుండి వస్తూనే వున్నది.

అది ఆ విద్యార్థి,అతని కుటుంబపు 'కర్మ'గాఒక్క రోజు వార్తతో వదిలేస్తున్నారే తప్పించి, విద్యావ్యవస్థలో వచ్చిన మార్పు, కార్పొరేట్ విద్యాసంస్థల సంస్కృతి గురించి ప్రభుత్వాలు పట్టించుకోవటంలేదు.

విద్యను వ్యాపారంగా మార్చిన ఆ సంస్కృతిమీద దృష్టిపెట్టక, పిల్లల ఆత్మహత్యలను నిలువరించేందుకు ప్రతి కార్పొరేట్ కాలేజీలో ఒక సైకాలజిస్ట్, కౌన్సిలర్‌వంటివారిని నియమించమంటుంది ప్రభుత్వం. ఆ కౌన్సిలింగ్‌చేసే వ్యక్తికి ఇచ్చే జీతాన్ని విద్యార్థుల నెత్తిన బాది అందులోనూ పర్సంటేజ్ నొక్కేయగలిగిన నేర్పరులు మన కార్పొరేట్‌కాలేజీల నిర్వాహకులు.అయితే భారతదేశంలో ఆత్మహత్యలు కేవలం విద్యార్థి దశకి పరిమితం కాదు.

ప్రపంచంలో ప్రతి ఏటా దాదాపు ఎనిమిది లక్షల పైచిలుకు ఆత్మహత్యలు జరుగుతున్నాయి.

వీటిలో దాదాపు 17 శాతం ఆత్మహత్యలు భారతదేశంలో జరుగుతున్నాయి.

ప్రపంచ జనాభాలో భారతదేశ జనాభాశాతం 17.5. ఆత్మహత్యల స్థితి భారతదేశంలో ఎంతో ఆందోళన కలిగించే విషయం.

ఆత్మహత్యల విషయంలో చైనా, భారత్, రష్యా, అమెరికా, జపాన్, దక్షిణ కొరియాలు ముందున్నాయి. సాధారణంగా మహిళలు బలహీనులు.

పురుషులమీద ఆధారపడి జీవించేవారన్న అభిప్రాయముంది. కాని ఆత్మహత్యలకు పాల్పడుతున్న వారిలో పురుషులే అధికం. ప్రతి 10 లక్షల జనాభాకి 16.4 శాతం ఆత్మహత్యలు మహిళలలో జరుగుతుండగా పురుషులలో అది 25.8 శాతంగా వుండటం భారతదేశ గణాంకం.

ఆత్మహత్యలకు ప్రధాన కారణంగా అనారోగ్యాలను గుర్తించారు. భారతదేశంలో మానసిక, శారీరక, దీర్ఘకాల అనారోగ్యాల కారణంగా ఆత్మహత్యలు అధికంగా జరుగుతున్నాయి. వాటి తర్వాతి స్థానం కుటుంబ సమస్యలది.

కుటుంబ సమస్యలలో పిల్లల చదువులు,పిల్లల ప్రవర్తనలుకూడా కారణంగా వుంటున్నాయి.

వ్యక్తిగత విభేదాలు,దాంపత్యబంధ వైఫల్యం, విడాకులు, ఒంటరి జీవితంవంటివి ఆత్మహత్యలకు దారితీస్తున్న అంశాలు. వివాహం కాకపోవటం, వివాహానికి సంబంధించిన ఇతర అంశాలు, ప్రేమ వైఫల్యంవంటివి ఇతర కారణాలుగా ఆత్మహత్య ముందు రాసిన ఉత్తరాలనుబట్టి అర్థమవుతోంది.

దక్షిణాది రాష్ట్రాలలో ఆత్మహత్యలు అధికంగా వున్నాయి. కేరళ, కర్ణాటక, తమిళనాడు, తెలంగాణా

లలో ఆత్మహత్యలు పెరిగాయి. ఆత్మహత్యల విషయంలో తెలంగాణ రాష్ట్రం 2015లో ఐదవస్థానంలో నిలవగా ఆంధ్రప్రదేశ్ 16వ స్థానంలో వుంది.

విద్యా, ఉద్యోగ అవకాశాలు తక్కువగా వుండి వెనకబడిన రాష్ట్రాలుగా గుర్తించినటువంటి రాష్ట్రాలలో ఆత్మహత్యలు తక్కువగా వుండటం గమనించాల్సిన విషయం. బీహారు, ఉత్తరాఖండ్, హిమాచల్ ప్రదేశ్, జార్ఖండ్, ఒడిషా రాష్ట్రాలలో ఆత్మహత్యలు తక్కువగా వున్నాయి.

## విద్యార్థి దశలో తీవ్ర ఒత్తిడి

ఇటీవలి కాలంలో బాగా పెరిగిన ఆత్మహత్యలు వ్యవసాయరంగానికి సంబంధించినవి.

ప్రభుత్వాలు రైతు పక్షపాతిగా వ్యవహరిస్తున్నామని ప్రచారం చేసుకుంటున్నప్పటికీ ఆ రంగంలో ఆత్మహత్యలుమాత్రం ఆగటంలేదు.

వ్యాపార పంటలు వేసిన రైతులు అధికశాతం ఆత్మహత్యలు చేసుకుంటున్నారు.

ఇటీవలికాలంలో రాజకీయ సిద్ధాంతాలు,నాయకులమీద వీరాభిమానంవంటి అంశాలు ఆత్మహత్యలకు పురిగొల్పటం అనే విచిత్రం దక్షిణాది రాష్ట్రాలలోనే కనిపించింది. అవి నిజంగా ఆత్మహత్యలా! లేక రాజకీయ లబ్ధికోసం సహజ మరణాలను ఆత్మహత్యలుగా ప్రచారంలోకి తీసుకువచ్చారా అనే దానిమీద స్పష్టత లేదు.

అయితే ఆత్మహత్య దగ్గరికి వచ్చేసరికి విద్యార్హత, సామాజిక హోదా,ఉన్నత పదవులు అనే తేడాలు లేకుండాపోతున్నాయి. తాజాగా వెలువడిన ఆత్మహత్య ఘటనలలో ఒక యువ సినీ నటుడు పేరు వుంది.ఒక యువబ్యాంక్ ఆఫీసర్ శ్రీకాకుళం జిల్లాలో ఆత్మహత్యకు పాల్పడ్డాడు.

అంతకుముందు ఒక వర్ధమాన సినీ హీరో, ఒక మాజీ హీరో, వయసుమళ్ళిన తర్వాత ఆత్మహత్య చేసుకోవటం తెలిసినదే.

కర్ణాటకలో, ఉత్తరప్రదేశ్‌లో ఐ.పి.ఎస్., ఐ.ఎ.ఎస్. అధికారుల ఆత్మహత్య సంఘటనలు వెలుగులోకి వచ్చాయి. వ్యాపారవేత్తలు ఆత్మహత్యలు చేసుకున్నారు.రాజకీయరంగంలోనే ఆత్మహత్యలుతక్కువ. ఐ.టి. రంగంలో తరచుగా ఆత్మహత్యలు వెలుగులోకి వస్తున్నాయి.

## ప్రేమ వ్యవహారాలు, సంసార ఇబ్బందులూ కారణాలే

ఈ ఆత్మహత్యలన్నింటినీ పరిశీలించినప్పుడు కనిపించే అంశం మానసిక ఒత్తిడి. ఒక యువ బ్యాంక్ అధికారికి, తన ఐ.ఎ.ఎస్. లక్ష్యానికి పని ఒత్తిడి అడ్డంకిగా నిలిచింది. యువ సినీ నటుడికి భార్యతో వచ్చిన విభేదాలు, ఆర్థికపరమైన చిక్కులు, బెదిరింపులు ఆత్మహత్య వైపుకు అడుగులు వేయించాయి.

జిల్లాస్థాయి పెత్తనం కలిగిన ఐ.ఎ.ఎస్., ఐ.పి.ఎస్. అధికారులు రాజకీయ ఒత్తిళ్ళను తట్టుకోలేక ఆత్మహత్యచేసుకున్నారు.

దారితప్పి ప్రవర్తించి,శిక్ష తప్పదని భావించిన లేదా అడ్డంగా దొరికిపోయిన అధికారులు అర్ధంతరంగా జీవితాలను ముగించుకున్నారు.

దాంపత్యంలో వేధింపులు,సంసారంలో కోరుకున్న కోరికలు తీరకపోవటం, ప్రేమవైఫల్యాలు, ఆర్థిక సమస్యలు ఇలా దాదాపుగా 30 రకాల కారణాలను ఆత్మహత్యల విషయంలో కనుగొన్నారు. ఆత్మహత్యకు పాల్పడినవారికి తప్పించి మిగిలిన వారందరికీ అవసలు సమస్యలు అనిపించవు.

సిల్లీ అంశాలకు ప్రాణాలు తీసుకున్నవారనిపిస్తుంది. ఈ జన్మలో అందుకోలేకపోయినవాటిని వచ్చే జన్మలో అందుకోగలమన్న ఆశతో ఈ జన్మని అంతం చేసుకున్నవారూ లేకపోలేదు.

మతవిశ్వాసాలు ప్రజల ప్రాణాలను తీస్తున్నాయి. కొత్తగా నమ్ముకున్న ప్రభువు పిలుస్తాన్నాడంటూ కుటుంబం మొత్తం ఆత్మహత్యకు పాల్పడిన ఘటనలు తూర్పుగోదావరి జిల్లాలో జరిగాయి.

సామూహిక ఆత్మహత్యలనేవి మరింత భయంకరమైనవి.పసిపిల్లల ప్రాణాలను తల్లిదండ్రులే చిదిమేస్తున్న ఘటనలు సామూహిక ఆత్మహత్యల్లో జరుగుతుంటాయి. ఈ ఆత్మహత్యల్లో అధికశాతం క్షణికావేశంలో చేసుకున్నవే.

## అనారోగ్యంవల్ల అధికంగా ఆత్మహత్యలు

దీర్ఘకాలం ప్రణాళికవేసుకుని భయంకరంగా ఆత్మహత్యచేసుకున్న ఘటనలు వున్నాయి.అది ఒక రకమైన ప్రతీకారం. తమ భయానక చావు మరెవరికో కళ్ళు తెరిపిస్తాయన్న నమ్మకంతో వారిని అటువంటి ఆత్మహత్యలకు పురిగొల్పుతుంటాయి.

వ్యక్తి స్వాతంత్ర్యం అనేది పరిమితి దాటేలా చేశాయి కొన్ని భావజాలాలు. ఆ భావజాలంలో సమాజాన్ని ధిక్కరించిముందుకు వెళ్ళి,హఠాత్తుగా ఒంటరి అయిపోతున్నారు. ఆ సమయంలో వారిని ఆదుకునేందుకు ఎవరూ సిద్ధంకారు.

అందరినీ కాదని, తాను ఎంచుకున్న భిన్నమైన మార్గంలో ఎదురైన ఇబ్బందులు తట్టుకోలేక హఠాత్తుగా ఒంటరితనంలోకి నెట్టబడి బలవన్మరణమే శరణ్యమనుకుంటున్నారు. ఆత్మహత్య అనేది ఒక మానసిక సమస్య.

తామెందుకు పనికిరానివారమన్న భావం, తమని ఎవరూ పట్టించుకోవటంలేదన్న భావన,ఎవరూ అర్థం చేసుకుని, మద్దతుగా నిలబడటంలేదన్న నిస్సహాయ స్థితి ఆత్మహత్యలకు ప్రేరేపిస్తున్నది.

ఇటువంటి పరిస్థితి జీవితంలో చాలామంది ఏదో ఒక దశలో అనుభవిస్తారు. జీవితంలో ఆత్మహత్య ఆలోచన చాలామందిలో కలుగుతుంది.

అయితే అది ఒక్క క్షణం లేదా ఒక రోజుకు పరిమితమయ్యే ఆలోచన ఎక్కువమందిలో. కాని కొందరిలోమాత్రం ఆత్మహత్య చేసుకోవాలన్న భావన స్థిరపడుతుంది. ఇది తమ బంధువులలో, మిత్రబృందంలో ఎవరిలోనైనా కనిపించవచ్చు.

అటువంటివారిని ఆదరించి, వ్యతిరేక ఆలోచనల నుండి బయటకు తీసుకువచ్చే ప్రయత్నం చెయ్యాలి. డిప్రెషన్‌లో వున్న వ్యక్తితో వ్యవహరించటంలోనేర్పు అవసరం. ఆ నైపుణ్యం వున్నవారు దొరికేవరకు ఆప్తులైనవారు ఆ యా వ్యక్తులను కనిపెట్టుకుని వుండాల్సిందే. ఆత్మహత్యవైపు అడుగులువేస్తున్న వారిని నిలువరించేందుకు సహనం, ఓర్పు, నేర్పు అవసరం. వారి భావోద్వేగాలు ఎటువంటివైనా వినాలి.

వారి మనసులోని వ్యతిరేక ఆలోచనలు బయటపెడుతున్నప్పుడు ఓర్పుతో విని, ముందు జీవితంపై ఆసక్తిని కల్పించే మాటలు చెప్పగలగాలి.

విశాల హృదయం వున్న పెద్దలకే అది సాధ్యమవుతుంది. చాలా సందర్భాలలో కొంతమేర ప్రయత్నం తర్వాత విసుగుతో వదిలేస్తారు.

తనకున్న ఆ ఒక్క సహాయంకూడా పోయిందన్న వ్యథ వారిని హఠాన్మరణ నిర్ణయం హఠాత్తుగా తీసుకునేలా చేస్తుంది. ఆత్మహత్యకు ముందు మానసికంగా ఘర్షణపడతారు. ఆ ఘర్షణ సమయంలో వస్తున్న మార్పులను గుర్తించగలగటం ముఖ్యం.

ఆ సమయంలో అండగా నిలబడినవారు ఒక జీవిని రక్షించినవారవుతారు. ఆత్మహత్యకి ప్రయత్నించి విఫలమైనవారు లేదా చివరిక్షణంలో విరమించుకున్నవారికి అర్థమవుతుంది తాము చేసిన పొరపాటు ఎటువంటిదో, తాము భావించుకున్న కష్టాలు ఎంత అర్థంలేనివో!

ఆత్మహత్యలను అడ్డుకోవాలి. ఆత్మహత్యా ధోరణులను ఓడించాలి. ఆత్మహత్యలవైపు ఆలోచించని ఒక ఆరోగ్యకర తరాన్ని నిర్మించాలి.

ఇందుకోసం మానసిక అనారోగ్య అంశాలమీద దృష్టిపెట్టాల్సిన అవసరముంది.

మానసిక అనారోగ్యం కూడా ఇతర అనారోగ్యాల వంటిదేనని పెద్దలు గుర్తించాలి.

పిల్లల ప్రవర్తనలో వస్తున్న మార్పును గుర్తించి తగిన చర్యలు చేపట్టగలిగితే విలువైన ప్రాణాలను కాపాడుకున్నవారవుతారు.

పిల్లలు ఆత్మహత్య చేసుకున్న తర్వాత కడుపుకోతకు గురవటంకన్నా, వారి ఆలోచనలను గౌరవించి, ప్రోత్సహించటం తల్లిదండ్రుల బాధ్యత.

ఆత్మహత్యలు సమస్యను ఏ విధంగానూ పరిష్కరించవన్న వాస్తవం ఈ తరం ఎంత త్వరగా గుర్తిస్తే అంత మంచిది.

**డా॥ దుగ్గరాజు శ్రీనివాసరావు**

# ఏ వయసులోనైనా ప్రమాదం

# డయాబెటిస్

డయాబెటిస్... డబ్బున్నవాళ్ళకి, నగరాలలో కులాసాగా జీవించేవారికి, శారీరక శ్రమ తెలియని వర్గాలకు, వయసు మళ్ళినతర్వాత వచ్చే జబ్బు అనే అభిప్రాయంలో ఉన్న వారంతా ఆ అభిప్రాయాన్ని అర్జెంట్‌గా మార్చుకుని, డయాబెటిస్ విషయంలో అప్రమత్తమవ్వాలంటున్నాయి అంతర్జాతీయ సంస్థలు.

అది మగవారికి మాత్రమే వచ్చే రోగం అనుకునే ఆడవారు కూడా డయాబెటిస్‌కి లింగభేదం అస్సలు లేదని అర్థంచేసుకోవటం అత్యవసరం.

గతంలో ఉన్న తేడాలన్నింటినీ చెరిపేసింది డయాబెటిస్. పంజాబ్ అనగానే అందరికీ గుర్తుకువచ్చేది శ్రామిక జీవనం. వ్యవసాయం అయినా, పరిశ్రమలు అయినా పంజాబీలు ముందుంటారు.

క్రీడలలో, సైనికదళాలలోనూ పంజాబీలది ప్రముఖ పాత్ర. అటువంటి పంజాబ్‌లో తాజా సర్వేలో తేలిన అంశం డయాబెటిక్ రోగుల్లో 18 శాతంమంది 18-24 ఏళ్ళ వయసు పంజాబీలున్నారు.

మరో 51 శాతంమంది ఆ రాష్ట్ర డయాబెటిక్ రోగుల్లో 25-44 ఏళ్ళమధ్య వయసు కలవారు. ఇది శారీరక శ్రమకు అతీతంగా, వయసుకు సంబంధం లేకుండా డయాబెటిస్ వ్యాప్తిచెందుతున్నదనేదానికి నిదర్శనం. అవే గణాంకాలలో అవిభక్త ఆంధ్రప్రదేశ్ 8.4 శాతం డయాబెటిక్ కేసులతో మహారాష్ట్రతో పాటుగాసంయుక్తంగానాల్గవస్థానంలోనిలుస్తున్నది.

భారతదేశంలో డయాబెటిక్‌కి గురవుతున్న వయస్సు ఏటికేడు తగ్గటం ఆందోళన కలిగిస్తున్న విషయం. 45 ఏళ్ళ వయసుకు అటూ ఇటూగా దాదాపుగా 85 శాతంమంది డయాబెటిస్‌కి గురవుతున్నారు. వీరిలో కేవలం 30 శాతంమంది మాత్రమే షుగర్ స్థాయి అదుపులో ఉంచుకోగల్గుతున్నారు.

మిగిలినవారిలో చక్కెరల స్థాయిలు తీవ్రంగా ఉంటున్నది. ఇకపోతే ఈ పరిస్థితి దక్షిణ భారతదేశ జనాభాలో అధికంగా కనిపిస్తున్నది.




Courtesy : THE WEEK

డయాబెటిక్ వ్యాధిని ఆలస్యంగా గుర్తించటం, వైద్యులు చేసే పొరపాట్లు, ఆహార నియమాల లోపం, వ్యాయామం చెయ్యకపోవటం, మందులు సరిగా వాడనందున సమస్యలు తీవ్రమవుతున్నాయి.

మనప్రాంతంలో డయాబెటిక్‌రోగుల్లో పొట్ట ప్రాంతం పెద్దదవుతున్నది. దాంతోపాటు మిగిలిన భాగాలూ సన్నబడుతున్నాయి.

భారతీయులలో డయాబెటిక్ రోగులలో హైడెన్సిటీ లైపో ప్రోటీన్ (హెచ్.డి.ఎల్.) తక్కువస్థాయిలో, ట్రైగ్లిసరైడ్ స్థాయిలో అధికంగా ఉంటున్నది. ప్రపంచ ఆరోగ్యసంస్థ (డబ్ల్యు.హెచ్.ఓ.)వారి అంచనాప్రకారం గతంలో అంటురోగాలవల్ల అధికంగా మరణాలు సంభవించేవి. ఇప్పుడు అంటురోగాలు కానివాటివల్ల మరణాలు మరింతగా పెరిగాయి.

ఒకరి వల్ల వచ్చే రోగం కాదు డయాబెటిస్. తమ శరీరంలో వచ్చే మార్పువల్ల వచ్చే రోగం. అటువంటి రోగాలు నాల్గింటిలో డయాబెటిస్ ఒకటి. ప్రపంచ జనాభాలో డయాబెటిక్ రోగులు 1980లో 4.5 శాతం ఉండగా,2014అంచనాల్లోవారిశాతం 8.5కిచేరింది.

భారతదేశంలో నేడున్న డయాబెటిక్ రోగుల సంఖ్య 73 మిలియన్లు.

ఇదే పరిస్థితులు ఇలాగే కొనసాగితే 2045 నాటికి 134 మిలియన్లకు చేరుతుంది. ప్రస్తుతం 40ల వయసులో వస్తున్న డయాబెటిస్ క్రమంగా 20ల వయసుకు చేరుతుందనేది అంచనా. భారతదేశంలోని డయాబెటిక్ ఇతర ప్రాంతాలలోని డయాబెటిక్ కన్నా భిన్నంగా కనిపిస్తున్నది.

శరీరం సన్నగా ఉంటుంది, పొట్టమాత్రం పెద్దదిగా కనిపిస్తుంది భారతీయులలో. దీనితోపాటుగా ఇన్సులిన్ అంత సులభంగా భారతీయులలో పనిచేయదు. దీనికి కారణం భారతీయుల శరీరతత్వం అంటున్నారు. శరీరంలో చక్కెరలు, కొవ్వుల నియంత్రణ భారతీయులలో భిన్నమన్నది తేలుతున్న విషయం.

ఇంగ్లండ్‌లో స్థిరపడిన భారతీయుల శరీరనిర్మాణం స్థానిక జనాభా శరీర నిర్మాణంకన్నా భిన్నంగా ఉంటున్నది. జీవనక్రియల్లో ఉన్న తేడావల్ల ఇంగ్లండ్‌లోని భారతీయులు సులభంగా డయాబెటిస్‌కి గురవుతున్నారు. ఆర్థిక సంస్కరణలతో ఆరోగ్యస్థితిగతులు భారతదేశంలో కూడా మారాయి.

పాశ్చాత్య ఆహార పదార్థాలు విరివిగా లభ్యమవుతున్నాయి. అధిక క్యాలరీలు, కార్బోహైడ్రేట్‌లు, కొవ్వులు కలిగిన పదార్థాలు లభిస్తున్నాయి.

మరో వైపు పాలిష్ చేసిన బియ్యం, పప్పుధాన్యాల వాడకం పెరిగింది. ఇవన్నీ కలిపి భారతీయుల జీవన క్రియలను ఎంతగానో మార్చాయి.

2003 నాటికి భారతదేశంలో అంటురోగాల వలన మరణాలు అధికం. ఆ తర్వాత అంటురోగాల మీద విజయం సాధించాము. కాని డయాబెటిక్‌వంటి అంటురోగాలు కానివి పెరిగాయి.

ఆర్థిక సంస్కరణల లబ్ధిని అందుకోవటంలో వెనకబడిన బీహార్, జార్ఖండ్, ఉత్తరప్రదేశ్, రాజస్థాన్, ఒడిషా వంటి రాష్ట్రాలలో అంటురోగ మరణాలే ఇంకా అధికంగా ఉన్నాయి.

అందుకు భిన్నంగా ఆర్థిక సంస్కరణ ఫలితాలు అందుకుని ఆర్థికంగా ఎదిగామనుకునే తమిళనాడు, పంజాబ్, మహారాష్ట్ర, ఎ.పి, కర్ణాటకవంటి రాష్ట్రాలలో డయాబెటిస్‌వంటి రోగాలు అధికమయ్యాయి.

ఈ రాష్ట్రాలన్నింటిలో ఐ.టి. రంగంలో ఉద్యోగాలు పెరిగాయి. ఒక కుర్చీలో కదలకుండా కూర్చుని చేసే ఉద్యోగాలు అందుబాటులోకి వచ్చాయి.

ఎ.సి. గదుల్లో పని. అదే సమయంలో అంతులేని మానసిక ఒత్తిడి. విదేశీయుల సమయాలకు తగినట్టుగా పనిగంటలవల్ల నిద్రలేమి.

వెరసి డయాబెటిక్‌ని సులభంగా తెచ్చుకుంటున్నారు. ఒత్తిడితోవచ్చే హైబి.పి.కి డయాబెటిస్ తోడవటంతో జీవితం ఒక్కసారిగా కుదేలవుతున్నది. దీంతో నాలుగుపదుల వయసులోనే ఎందుకు పనికి రాకుండాపోతున్నారు.

## పిల్లలలో

చిన్నవయసులోనే డయాబెటిస్‌కి గురవుతున్న వారున్నారు. టైప్ 1 డయాబెటిస్ అనే ఈ తరహా జబ్బులో ఇన్సులిన్ ఉత్పత్తి పూర్తిగా ఆగిపోతుంది. ఇన్సులిన్ ఉత్పత్తి చేసే గ్రంథి పనిచేయదు.

అలా శరీరంలోని ఒక భాగం లేదా గ్రంథి హఠాత్తుగా ఎందుకూ పనికిరాకుండా పోతుందనేది అంతుపట్టని విషయం. చిన్నవయసులో డయాబెటిస్ వస్తున్న కేసులు పెరుగుతున్నాయి. కాబట్టి పిల్లల ఆరోగ్యం గురించి గమనిస్తుండాలి.

హఠాత్తుగా బరువు తగ్గుతున్నా, ముఖం పీక్కు

డా॥ కె.వేణుగోపాల్‌రెడ్డి తన గురువైన డా॥ వి.మోహన్‌గారితో





పోయి శరీరం సన్నబడుతున్నా, ఏ పనీ చెయ్యలేక నిస్సత్తువగా కూలబడుతున్నా ఒకసారి పరీక్ష చేయించండి. ఆ లక్షణాలు డయాబెటిక్‌కి సంబంధించినవి కాకుంటే సంతోషమే.

ఒకవేళ 'జువెనైల్ డయాబెటిస్' అని నిర్ధారణ అయితే వైద్యుడి సలహాలను తు.చ. తప్పక పాటించండి. అవసరం అనిపిస్తే ఒకరికన్నా ఎక్కువమంది వైద్యులను తప్పనిసరిగా సంప్రదించండి.

ఒకటికన్నా ఎక్కువ క్లినిక్‌లలో రక్తపరీక్ష చేయించండి. ఆ తర్వాత జాగ్రత్తలు మొదలుపెట్టండి. పిల్లలలో ధైర్యాన్ని పోగొట్టవద్దు. వ్యాధిగ్రస్థుడన్న భావం అతనికి కలగనివ్వకండి. సాధారణ పిల్లలలాగానే అతన్ని చూడండి. వారితో ప్రవర్తించండి.

తల్లిదండ్రుల మద్దతు చాలా కీలకం. పిల్లల అవసరాలు చూడాల్సింది తల్లిదండ్రులే.

వైద్యుడి సూచనమేరకు ఇన్సులిన్ ఇవ్వాల్సిన అవసరం వస్తే ఆ ఇన్సులిన్ ఇచ్చే పద్ధతిని తల్లిదండ్రులు నేర్చుకోవాలి. షుగర్ స్థాయి అటూ ఇటూ అతివేగంగా వారితో ఏం చేయాలో తల్లిదండ్రులు అర్థంచేసుకుని సిద్ధంగా ఉండాలి. వైద్యుడితర్వాత కీలకమైన పాత్ర తల్లిదండ్రులదే. వారు ఎంత ధైర్యంగా వ్యవహరిస్తే పిల్లలు అంతత్వరగా డయాబెటిస్‌తో పోరాడి సాధారణ జీవనం సాగించగలుగుతారు.

## మధ్యవయసువారికి

మధ్యవయసులో పలురకాల సమస్యలు ఎదురవుతాయి. కుటుంబ బాధ్యతలు, ఉద్యోగపరమైన ఒత్తిడులు, పిల్లలను పెంచటంవంటి అంశాలన్నీ కలిసి మధ్యవయసులో సులభంగా అనారోగ్యానికి గురవుతారు. ఆ వయసులో ఆహారం, నిద్ర, వ్యాయామం విషయంలో పూర్తిగా నిర్లక్ష్యం వహిస్తారు.

ఉద్యోగపరంగా ఎదగాలనుకోవటం మంచిదేకాని ఆ ఉద్యోగంలో ఎదుగుదలకు ఆరోగ్యాన్ని ఫణంగా పెట్టటం అవసరమా! అనే ఆలోచన చెయ్యాలి. వేళకు ఆహారం తీసుకోరు. నిద్ర సరిగా పోరు. విశ్రాంతి లేని జీవితం, వ్యాయామం కరువైన జీవితానికి ఒత్తిడి కూడా జతకలిసి డయాబెటిస్ తెస్తున్నది.

నిజానికి శరీరంలో నుండి హెచ్చరికలు జారీ అవుతూనేవుంటాయి. గతి తప్పుతున్న వైనాన్ని పరోక్షంగా సూచిస్తుంది. అయినా పట్టించుకోరు. ఆరోగ్య అంశం కన్నా ఇతర అంశాలమీదే ప్రాధాన్యత అంటారు.

చివరికి ఇక పూర్తిగా పనిచేయలేని పరిస్థితిలో వైద్యుడి దగ్గరికి వెళ్ళేసరికి జరగాల్సిన నష్టం జరిగి వుంటుంది. తమ ఆరోగ్యంమీద ఖర్చుపెట్టటంకన్నా పిల్లల చదువుకోసం తమ సంపాదనను ఖర్చుచేస్తారు. పిల్లలచదువులు ముగించి, పైచదువులకు వెళ్ళిపోయి, భార్యాభర్తలుమాత్రమే మిగిలినపుడు ఆ ఒంటరితనపు ఆలోచనలో సమస్య జటిలమవుతుంది.

డయాబెటిక్ పరీక్షలకు ఆలస్యంగా వెళతారు. ఆ సమయంలో వారిని దగ్గరుండి చూసుకోవాల్సిన పిల్లలు వారి ఉద్యోగం బిజీలో వారుంటారు. ప్రస్తుతం సమాజంలో ఎదురవుతున్న పెద్ద సమస్య ఇది.

## అవగాహన అవసరం

డయాబెటిస్ అనగానే కంగారుపడవద్దు. తగిన జాగ్రత్తపడండి. ఆ వ్యాధి రాకుండా చూసుకున్నవారు అదృష్టవంతులు. వచ్చినా దాని స్థాయి కనిష్ఠంలో ఉంచగలిగినవారు నిజమైన విజేతలు.

ఎందరో డయాబెటిక్ బాధితులు అద్భుతమైన విజయాలను సాధించారు. వారిగురించి తెలుసుకోవాలి. వారినుండి స్ఫూర్తి పొందాలి.

పాకిస్తానీ ఫాస్ట్ బౌలర్ వసీమ్ అక్రమ్ ఎంత వేగంగా బంతులు విసురుతాడో, క్రికెట్‌ఫీల్డ్‌లో ఎంత చలాకీగా వ్యవహరిస్తాడో అందరికీ తెలిసినదే. అతగాడు డయాబెటిక్. అయినా చివరి మ్యాచ్‌వరకు ఎప్పుడూ అతని ముఖంలో అలసట చూసివుండరు. ఇన్సులిన్ ఇంజక్షన్ తీసుకుని గ్రౌండ్‌లోకి దిగేవాడు. వైద్యులు చెప్పిన జాగ్రత్తలు తీసుకోవటంవల్లనే తనకు ఎటువంటి ఇబ్బందులు రాలేదని వసీమ్ అక్రమ్ వివరించేవాడు.

డయాబెటిక్ రోగులు చాలామంది చేసే ఫిర్యాదు మందుల ఖరీదు. ఆ అనారోగ్యానికి నెలకు ఆరేడు వేలు మందులకు ఖర్చు చేయాల్సివస్తున్నది. ఇది ఒక సామాన్య భారతీయుడు తలకుమించిన భారంగా భావిస్తున్నాడు.

డయాబెటిక్ వ్యాధిగ్రస్థులు పెరగటంవల్ల దేశ ఆర్థిక ప్రగతి కుంటుపడుతుంది. వారు సంపూర్ణ సమర్థతతో పనిచేయలేనప్పుడు ఉత్పత్తి మందగిస్తుంది. డయాబెటిక్ తీవ్రతతో బాధపడేవారిని ఆదుకోవాల్సిన బాధ్యత ప్రభుత్వానిదే.

కాబట్టి జాతీయ ఆర్థిక ప్రయోజనాల దృష్ట్యా డయాబెటిక్ రోగ మందులకు సబ్సిడీ ఇచ్చే అవకాశాన్ని పరిశీలించటం అవసరమే.

తక్కువ ధరలో ఇన్సులిన్ అందివ్వగలిగిన మార్గాలను వైద్య, ఆరోగ్యశాఖ చూడాల్సివుంది.

## మహిళల్లో

మహిళలఆరోగ్యంపట్ల శ్రద్ధకరువవటం, డయాబెటిస్ ఉందని చెబితే వివాహంకాదేమోనన్న భయం వంటివాటివల్ల భారతీయ మహిళల్లో డయాబెటిస్‌ని ప్రారంభదశలో గుర్తించటం లేదు.

డయాబెటిస్ ఉందని చెప్పుకునేందుకు మహిళల్లో వున్న మొహమాటంవల్ల కూడా వారి రోగాన్ని ముదర పెట్టుకుంటున్నారు. ప్రాథమిక స్థాయిలో గుర్తిస్తే చికిత్స సులభమవుతుంది. ఆ అవకాశాన్ని మహిళలు పోగొట్టుకుంటున్నారు.

గర్భవతిగా ఉన్న సమయంలో చెక్కెరలు పెరుగుతాయి. అయితే వాటి స్థాయి అధికమవుతోంది. 'జెస్టేషనల్ డయాబెటిస్' అని పిలిచే ఆ రకమైన డయాబెటిక్ కేసులు భారతీయ మహిళల్లో అధికంగా ఉన్నాయి. ఆ డయాబెటిస్ సమస్య సాధారణంగా ఆ తర్వాత సర్దుకుంటుంది.

కాని సర్దుకోక అదే నిలిచివున్న కేసులు దేశంలో నాలుగు మిలియన్లవరకు ఉంది. ఇటువంటి కేసులు నగరాలలో అధికంగా కనిపిస్తున్నాయి.

రెండేళ్ళ వయసులో డయాబెటిక్ రోగిగా గుర్తించబడిన మహిళ హాయిగా చదువుకుని, పెళ్ళి చేసుకుని, ఇద్దరు పిల్లలకు జన్మనివ్వగలిగిందంటే ఆమెకు పుట్టినింట లభించిన మద్దతే కాదు, కట్టుకున్న భర్తనుండి అందిన సహకారం కూడా కారణం. అటువంటి కేసులు చాలా ఉన్నాయి. డయాబెటిస్ వచ్చిన భర్తకు భార్యనుండి సహకారం అవసరం.




డా॥ కె.వేణుగోపాల్‌రెడ్డి
M.B.B.S., Dip. Diab., P.G.C.Diab (Australia)
వి.జి.ఆర్. డయాబెటిస్ స్పెషాలిటీ హాస్పిటల్
జమ్మిచెట్టు సెంటర్, మొగల్‌రాజపురం, విజయవాడ
ఫోన్: 0866-2485933, 2485944 Cell : 93467 96260

# వేరికోస్ వెయిన్స్ వల్ల వచ్చే ఇబ్బందులు, ఆపరేషన్ లేకుండా లేజర్‌తో చికిత్స

వేరికోస్ వెయిన్స్ అనేది ఒక సర్వసాధారణంగా కనిపించే వ్యాధి. 15-20% మంది జనాభా ఈ వ్యాధితో బాధపడుతూ ఉంటారు.

కాలిపైన సిరలు ఉబ్బి మెలికలు తిరిగి అంద వికారంగా కనపడుతూ ఉంటాయి.

వీటిని ఉపేక్షిస్తే కాళ్ళవాపులు రావడం,చర్మంపై మచ్చలురావడం, చర్మం మందపడడం, దురదలు రావటం మరియు పుండు పడడం జరుగుతుంది. ఈ పుండు విపరీతమైన సలుపు పోటు పెడుతుంది మరి యు మానకుండా ఉండిపోతుంది.

ఈ వ్యాధి సాధారణంగా 20 సంవత్సరాలపైబడిన వారి నుంచి కనబడుతుంది. మరియు వయసు పెరుగు



Before After



## DR.CHALAPATHI RAO's IR Centre

INTERVENTIONAL RADIOLOGY & BEYOND



Before After

తున్న కొద్దీ ఇంకా ఎక్కువ శాతం జనాభాలో కన బడుతుంది. ఈ వ్యాధి స్త్రీలలో ఎక్కువగా చూస్తూ ఉంటాము.గర్భిణి సమయంలో హార్మోన్‌ల ప్రభావంవల్ల కాళ్ళలోని సిరలు ఉబ్బడము జరుగుతుంది. అది కాలక్రమేణా వేరికోస్ వెయిన్స్ వ్యాధికి దారితీస్తుంది.

అంతేకాకుండా వృత్తిరీత్యా రోజూ గంటల తరబడి నిలబడి పనిచేసేవారిలో, ఉదాహరణకు ట్రాఫిక్ పోలీస్‌కానిస్టేబుల్స్, ఉపాధ్యా యులు, బస్సు కండక్టర్లు, ఆపరేషన్లు చేసే సర్జన్లు, చిన్న దుకాణదారులు మొద లైనవారిలో ఎక్కువగా కనబడుతూ ఉంటాయి.

తల్లిదండ్రులకు ఈ వ్యాధి ఉంటే పిల్లలలో వచ్చే అవకాశాలు ఎక్కువగా ఉంటాయి. అదే విధంగా ఊబకాయం ఉన్నవారిలోకూడా ఈ వ్యాధి తరచుగా చూస్తూ ఉంటాము.

కానీ చాలామందిలో ఈ వ్యాధి ఎందుకు వస్తుందో కారణం చెప్పలేము.

ఈ రోజున ఈ వ్యాధిని ఆపరేషన్ లేకుండా లేజర్ చికిత్సద్వారా సులువుగా నయం చేయవచ్చు.

లేజర్ చికిత్స అనేది ఒక మహత్తరమైనటువంటి పరిష్కారం. లేజర్ చికిత్సలో కత్తిగాటు కానీ, ఒక్క కుట్టుగాని పడదు. ఈ విధానం మొత్తం సూది రంధ్రం ద్వారా పూర్తి అవుతుంది.

పెద్ద ఆపరేషన్‌లకులాగా స్పైనల్ అనెస్తీషియా లేదా జనరల్ అనెస్తీషియా అవసరం లేదు.

మొత్తం ఆపరేషన్ స్థానిక (లోకల్) అనెస్తీషియాలో జరిగిపోతుంది.

ఆపరేషన్ అయిన వెంటనే ఆపరేషన్ టేబుల్‌పై నుండి దిగి నడవడం మొదలుపెట్టవచ్చు. వెంటనే ఇంటికి వెళ్ళిపోవచ్చు. వేరే ఊరినుండి వచ్చిన వారు అదే రోజు వారి ఊరికి వెళ్ళిపోవచ్చు. తెల్లవారినుండి మెట్లు ఎక్కడం దిగడం దగ్గరనుంచీ అన్ని పనులు మామూలుగా చేసుకోవచ్చు.

పెద్ద ఆపరేషన్‌లలాగా గాట్లు మరియు కుట్లు ఉండవు కాబట్టి గాయాలు మానకపోవటం లేదా కుట్లు చీముపట్టటంవంటి దుష్ప్రభావాలు కనిపించవు.

ఈ పూర్తి ఆపరేషన్ అల్ట్రాసౌండ్ స్కాన్ మార్గ దర్శకంలో చేయడంవల్ల నూరు శాతం వైద్యం చేయడం జరుగుతుంది. దానివల్ల జబ్బు పునరావృతం అయ్యే అవకాశాలు కూడా తగ్గిపోతాయి. ఆపరేషన్ అయిన ప్రాంతంలో ఒకటి నుండి రెండు వారాలు



డా॥ ఎమ్.వి.చలపతిరావు
Interventional Radiologist
Dr Chalapathi Rao's IR Centre
Cell : 96668 88693

నొప్పులు ఉండవచ్చు.

కేవలం మాత్రలు తీసుకోవడంద్వారా ఉపశమనం కలుగుతుంది. ఒక్క రోజు కూడా పడక విశ్రాంతి తీసు కోవలసిన అవసరం ఉండదు.

సూది రంధ్రం ద్వారా ఆపరేషన్ పూర్తిచేయడంవల్ల ఎటువంటి మచ్చలు ఉండవు. కాస్మెటిక్‌గా కూడా ఫలితాలు చాలా బాగుంటాయి.

ఈ వ్యాధి నివారించడానికి క్రమంతప్పకుండా వ్యాయామం చేయడం ఒక మంచి ఉపాయం.

ఊబ కాయం రాకుండా చూసుకోవడం, ఎక్కువగా నిలబడి పనిచేయవలసినవారు కుదింపు మేజోళ్ళు (కంప్రెషన్ స్టాకింగ్స్) వాడడంవల్ల ఈ వ్యాధి రాకుండా నివారించవచ్చు.

వేరికోస్ వెయిన్స్ తొలి దశలోనే, అనగా ఉబ్బిన రక్తనాళములు కనబడినప్పుడుగాని లేదా కాళ్ళ వాపులు, నొప్పులు మొదలవగానే వైద్యం చేయించుకోవడం ఉత్తమం. ఒకసారి చర్మంపై మచ్చలుపడితే అవి శాశ్వతంగా ఉండిపోతాయి.

వేరికోస్ వెయిన్స్ వ్యాధికి లేజర్ ట్రీట్‌మెంట్ ఒక సంపూర్ణమయిన పరిష్కారం.



Before After

**Dr Chalapathi Rao's IR Centre** Opposite Focus Diagnostics, Panjagutta, Hyderabad. Cell: **96668 88693.** www.ircentre.in contact@ircentre.in

**హైదరాబాద్:** సోమవారం నుండి శనివారం వరకు ఉదయం 11 గం. నుండి సాయంత్రం 4 గం. వరకు- డా॥ చలపతిరావు ఐఆర్ సెంటర్, ఫోకస్ డయాగ్నోస్టిక్స్ ఎదురుగా, మోడల్ హౌస్ ప్రక్కవీధి, సాయిబాబా గుడి దగ్గరలో, పంజాగుట్ట, హైదరాబాద్. అపాయింట్‌మెంట్ కొరకు : **96668 88693**

**రాజమండ్రి:** ప్రతినెలా రెండవ ఆదివారం ఉదయం 10 గం. నుండి సాయంత్రం 3 గం.ల వరకు- డాక్టర్స్ డయాగ్నొస్టిక్స్, గ్రీన్ పార్క్ రెస్టారెంట్ ఎదురుగా, దానవాయిపేట, రాజమండ్రి.

**విజయవాడ :** ప్రతినెలా నాలుగవ ఆదివారం ఉదయం 11 గం. నుండి 4 గం.ల వరకు- ఏబీసీ ఇమేజింగ్, ఫ్యామిలీ హాస్పిటల్ ఎదురుగా, డోర్నకల్ రోడ్, విజయవాడ.

# మధుర జ్ఞాపకం

**ప్రతీరోజూ ఆమె ఒంటరిగా వెళ్తుంటే ధైర్యంచేసి మరీ ఆమెని అనుసరించేవాడిని. అనుకోకుండా ఒకరోజు న్యూ పూర్ణ సినిమా హాల్లో మా ఇద్దరివీ పక్కపక్క సీట్లు తలవనితలంపుగా పడ్డాయి. ఆ చీకట్లో తెగ ధైర్యమొచ్చేసింది. అంతే ఇద్దరం ముద్దులతో, స్పర్శలతో తీయని స్పందనలకు లోనైనాం. ఇంతలో...**



పెళ్ళివారిల్లు కళకళలాడిపోతోంది. అసలు ఈ పెళ్ళి ఎవరిదయ్యా అంటే సుస్మిత మూర్తిగారి ముద్దుల తనయ అక్షితది.

మాకు సుస్మితమూర్తి బాగా దగ్గరచుట్టం. తపనకి ఆయన భార్య వరసకి మేనత్త అవుతుంది. అందుకనే మూడురోజులముందునుంచి పెళ్ళిపనుల్లో సాయం చేయమంటూ పదేపదే పిలిచారు.

ఎందుకంటే నేను అందరితో కలివిడిగా సరదాగా నవ్విస్తూంటాను! ఆప్యాయంగా పలకరిస్తూంటా. పైగా పెళ్ళిపనుల్లో వాళ్ళకి కొండంత సాయం!

మర్నాడు పెళ్ళి అనగా అందరూ కూర్చుని వచ్చే వారికి ఏమేమి ఇవ్వాలో అన్నీ ఏ సందర్భంలో ఏవేవి ఏర్పాటుచేసుకోవాలో ఒకచోట రాసుకోవడమే కాకుండా వాటిమీద స్టిక్కర్స్ అంటిస్తున్నారు.

ఆ సమయంలోనే అందరి మధ్యన చేరాన్నేను. అక్కడ అందరికంటే వయసులో పెద్దామె సుమిత్రమ్మ కూడా ఉన్నది. అసలు ఆవిడది పెత్తనమంతా! సుస్మితమూర్తికి బాగా దగ్గర చుట్టరికం. అందుకే అన్నిటినీ చూసుకోడానికి ఆవిడను వారం ముందే పిలిచాడు. "ఏమర్రా! ఇక్కడ చేరినవాళ్ళంతా తమ మధురమైన జ్ఞాపకాలను ఒకసారి కలబోయండి. సరదాగా చెప్పుకుంటూ పనులు చేసుకుందాం!" అని సూచించింది సుమిత్రమ్మ.



"అబ్బ! ఇరుకునపెట్టడంలో మీరు గొప్పవారండీ! ఎవరైనా తమ అనుభవాలను నలుగురిలో డప్పు కొట్టుకుంటారా?" అంది సందేహంగా చూస్తున్న ఇరవై ఏళ్ళ యామిని.

"ఐనా తింగరబుచ్చీ! నీ వయసనగా ఏపాటి? నీకున్న అనుభవాలేముంటాయి?

ఇక్కడున్నవాళ్ళంతా పెళ్ళయినవాళ్ళే! ఆలుమగల మధ్యనో... తమ పాత రోజుల్లో జరిగిన సంఘటనల్లోనో ఏదో ఒకటి గుర్తుకురాకపోతుందా? చెప్పక పోతారా?" అని అందరి వంకా చూసింది.

"అమ్మమ్మా! నువ్వు యామినీని తక్కువ అంచనా వేయకు... మొన్న తన బాయ్‌ఫ్రెండ్ గురించి నాకు" అని అమల ఏదో అనబోతుంటే "చంపుతా! అది వీళ్ళందరి మధ్యన అంత అవసరమా?" అని ఆమె నోరు మూసేసింది.

"అమ్మో! దీని వెనుక కూడా కథా కమామీషు ఉన్నాయన్న మాట! ఏమే నీ బాయ్‌ఫ్రెండ్ గురించి నాలుగు ముక్కలు చెప్పేడవకూడదా?" అని ప్రోత్సహిస్తున్నట్లుగా అన్నది సుమిత్రమ్మ.

"ఏంలేదు బామ్మా! మొన్న ఒక తింగరోడు నాకు ప్రపోజ్‌చేయడానికి దారికాచి గులాబీ అందించాడు. దాన్ని వాడిముందే చిదిమిపారేసి ఇలాంటి పిచ్చి పనులు మరెప్పుడూ చేయద్దంటూ వార్నింగ్ ఇచ్చా! అది పట్టుకుని ఇది మీ అందరి మధ్యన పెద్ద రచ్చ చేస్తోంది" అని చేత్తో సైగచేసి అమలవైపు కోపంగా చూసింది యామిని.

"పోనీలెండ్రా! పసిపిల్ల! ఈ వయసు మళ్ళా వస్తుందా! ఇలాంటి సన్నివేశాలు మళ్ళా ఎదురౌతాయా? పోనీ మీలో ఎవరో ఒకరు మీ మధురజ్ఞాపకాలనుతిరగతోడండ్రా!"అని నలుగురివైపుచూసింది.

"ఇంతమందిని మొదలెట్టమంటున్నావుగాని... అమ్మమ్మా! తమరి గాథలేంటో బైటపెట్టచ్చుగా... శ్రీకారం చుట్టండి!" అని సుమిత్రమ్మను బలవంత పెట్టింది సిరి.

"పోనీలెండర్రా! మీ మాటను నేనెందుకు కొట్టిపారేయాలి. చెబుతున్నా వినండి. రామతీర్థంలో కరణం

## ఎన్ని ఇష్టాలో...

తన ఇష్టాల జాబితాను పూజాహెగ్డే విప్పి చెప్పింది. "పుస్తకాలు చదవడం అంటే నాకు చాలా ఇష్టం. ప్రతిసంవత్సరం ఓ కొత్తప్రదేశానికి వెళ్ళడం ఇష్టం. బెంగళూరు అంటే మరీ మరీ ఇష్టం.

అక్కడ జరిగే ఫ్యాషన్ వీక్‌లో పాల్గొనడంవల్ల చాలామంది ఫ్రెండ్స్ అయ్యారు.

నేను అందరితో సరదాగా జోకులు వేస్తుంటా. నా ఈ ధోరణి నా స్నేహితులందరికీ ఎంతో ఇష్టం" అని చెప్పుకువచ్చింది.




గారింటి పక్కన మేముండేవాళ్ళం. నాన్నది మునసబుగిరీ! జనమంతా తెల్లార్లేస్తే మా ముంగిటే వాలేవారు. మునసబుగారి అమ్మాయిగా నేనంటే అందరికీ అభిమానం మెండుగానే ఉండేది.

మా ఇంటికి దగ్గర్లోనే రామకోనేరు... ఉదయం సాయంత్రం కడవ పట్టుకొని నీళ్ళకెళ్ళడం పరిపాటి అయింది.ఆ చెరువులో ఇన్నీఅన్నీ తామరపూలుకావు. అయితే ఒకరోజున దురదృష్టంకొద్దీ నాకు చేతికందనంత దూరంలో ఉన్న పువ్వుని కోద్దామనుకునేంతలో నాచులో కాలుజారి పడ్డా!

అంతలోనే ఒకబ్బాయి ప్రమాదం గ్రహించి నా జుత్తు దొరకబుచ్చుకుని పైకి లాగేశాడు.

నన్ను తన రెండుచేతుల్లోకి ఎత్తుకుని ఒడ్డుకు చేర్చి నీళ్ళు కక్కించాడు. కళ్ళు తెరచి చూస్తే పొడగరి అయిన ఆ కుర్రాడు ఊరి మోతుబరి ఏడుకొండలు కొడుకు రామేశ్ అని తెలిసింది.

ఆ రోజు తడిబట్టతో వెళ్ళేసరికి నా అవతారం చూసి అడిగితే చెప్పక తప్పలేదు. నాన్న మనసు చివుక్కుమన్నది. నీళ్ళకెళ్ళద్దన్నారు.

మర్నాడు నేను వెళ్ళకపోవడంతో రామేశ్ కిటికీ లోంచి తామరపూలు లోపలికి పడేశాడు. ఈ వ్యవహారం నాన్న కళ్ళబడకపోలేదు. అగ్గిమీద గుగ్గిలమైనారు.అయినా నామీదప్రేమతో ఒకరోజు నాన్న ఊరెళ్ళిన సమయంలో ఇంట్లోకి జొరబడి మరీ నన్ను ముద్దుల్లో ముంచెత్తాడు ఎలాగైనా పెళ్ళి చేసుకుంటానన్నాడు. నాకు అంతా ఇంతా భయం కాదు.

ఇకనుంచి రావద్దంటూ హెచ్చరించాను. ఎలా పొక్కిందోగాని నాన్నకు... ఈ విషయం తెలిసి నన్ను తెగ చివాట్లు పెట్టారు. మరి రెండు నెలల్లోనే మరొకరితో పెళ్ళి చేసేశారు. ఐనా అతడు సమర్థుడు కాకపోవడం, వ్యసనపరుడు అవడంతో మా దాంపత్యజీవితం సజావుగా సాగలేదు. నా దురదృష్టంకొద్దీ ఒక ప్రమాదంలో అతను పోయాడు. అప్పటినుంచీ నేనిలాగ ఒంటిపిల్లి రాకాసిలాగే బ్రతుకుతున్నా.

నా జీవితంలో ఏదైనా మధుర జ్ఞాపకమంటూ మిగిలిందంటే రామేశ్ స్పర్శ మాత్రమే!" అని కొద్దిగా వణికే గొంతుతో చెప్పింది.

"మీ విచారం వెనుక ఇంతటి ప్రేమ కథ దాగి ఉందన్న మాట! ఇక మగాళ్ళవంతు" అని అక్కడున్న మగమారాజులవైపు చూపించింది సిరి.

"మేమా! అసలు మాకేముంటాయ్? ఒకవేళ మేం మా చిన్నెలను బట్టబయలు చేసినా మా ఇల్లాళ్ళు అప్పడాలకర్రలో, చీపురుకట్టలో తీసి దేహశుద్ధి చేస్తారు"అని యోగిగారు చెప్పనంటూ మగాళ్ళ తరపునచెప్పేశారు.ఐనాసరే బంకలా వదలక సుమిత్రమ్మ యోగిగారిని బలవంతపెట్టింది. ఆయన తప్పదన్నట్లుగా "నేను విజయనగరంలో బియిడి చదివేరోజుల్లో శకుంతల అనే అమ్మాయి కొత్తపేట నీళ్ళట్యాంకు దగ్గరనుంచి ఉమెన్స్ కాలేజీకి వెళ్ళేది.

ఆమె అందానికి చిత్తయిన నేను మూడు లాంతర్ల దగ్గర కాపుకాసేవాడిని. ప్రతీరోజూ తప్పనిసరిగానావైపు



చూసేది. ఒకరోజున ఒంటరిగా వెళ్తుంటే ధైర్యంచేసి మరీ వెనకాలే అనుసరించాను.

ఐనా నా ప్రేమ విషయాన్ని బయటకు చెప్పలేకపోయాను.అనుకోకుండా ఒకరోజు న్యూపూర్ణ సినిమా హాల్లో మా ఇద్దరివీ పక్కపక్క సీట్లు తలవనితలం పుగాపడ్డాయి.ఆ చీకట్లో తెగధైర్యమొచ్చేసింది. ముద్దులతో, స్పర్శలతో తీయని స్పందనలకు లోనైనాం. చేతుల్లో చేతులేసి మరీ చెప్పేశాను.

ప్రేమ విషయంలో ఆమె కూడా సమ్మతించింది. తర్వాత అదేరోజున మా ప్రేమకథ హటాత్తుగా అనుకోని మలుపు తిరిగింది.హాలు బైట ఆమెని రిక్షా ఎక్కించిన తర్వాత నా ముందు ఒక రాజదూత్ బైకాగింది. అతడు శకుంతలకు అన్నయ్యని చెప్పి, ఇకముందు ప్రేమాగీమా అంటూ వెంటబడితే ఎముకలేరేస్తానని గట్టిగా హెచ్చరించి వదిలేశాడు. అంతే నా ప్రేమకు చరమగీతం పాడాల్సివచ్చింది" ఉస్సూరని నిట్టూర్చడం యోగిగారి వంతైంది.

"ఓస్! ఓడిపోయిన ప్రేమ మధురజ్ఞాపకమెలాగౌతుంది? ఏమిటో ఏ ఒక్కరైనా మంచి రస వత్తరమైన సన్నివేశం అంటూ ఏదైనాఉంటే చెబితే విందామని అందరం ఉవ్విళ్ళూరు తున్నాం" అనిబాంధవి ఎంతోఉత్కంఠతో అన్నది.

"నాయనా! సుమన్! ఇక నీ కథ వినిపిస్తావా? అదేనోయ్ నీ మధురజ్ఞాపకం! నలుగురి ముందు చెబితే అందరిలో హుషారుపుడుతుంది. చకచకా పనులు జరిగి పోతాయ్! ఊ... కానీ..." చెప్పమన్నట్టుగా సైగ చేసింది.

"మాది పెద్దలు చేసిన పెళ్ళేగా! ప్రేమలు దోమలు నాకు తెలీదు... నన్ను విడిచిపెట్టండి" అంటూ ఓ దణ్ణం పెట్టేశాను.

"ఓరి భడవా! ప్రేమే కానక్కర్లేదురా! నీ "మధుర" జ్ఞాపకం గురించి నాకు తెలవకనా? నువ్వు ఒక్కసారి గుర్తుకుతెచ్చుకో!

ఒక ఐదేళ్ళక్రిందటిమాట... రాగిణి పెళ్ళిలో నీకు జరిగింది. గుర్తులేదురా బడుద్దాయ్? అది మధురాతిమధురమైనగుర్తుకాదురా! నువ్వుచెప్పకుంటే నేనేచెప్పేస్తా!" అని నన్ను అందరిలోకిలాగింది.

"నీకు దణ్ణంపెడతా బామ్మా! అదేదో అనుకోకుండా జరిగితే ఇలా చెప్పమంటూ నన్ను ఇరుకున పెట్టడం ధర్మమా?! నన్నిలా వదిలెయ్!" అని వద్దన్నట్లుగా ముడుచుకుపోయాను.

"ఏంరా! నీకదిచిన్నదేకావచ్చునేమోగాని నీఅదృష్టం అందరికీవస్తుందా? దేనికైనా సిరిఉండాల్రా! అది ఆ రోజున నీకు పట్టిందనే చెప్పాలి...అన్నట్లు నీ 'మధుర' మళ్ళా ఈ పెళ్ళిలోనీకు ఎదురుపడబోతోంది. సిగ్గుల మొగ్గనైపోకుండా పలకరించు సుమీ!" అని ముసిముసిగా నవ్వేసింది సుమిత్రమ్మ.

"మీ ఇద్దరిసంభాషణ ఇక్కడున్న మాకెవరికీ ఒక్క పిసరు అర్థంకావట్లేదు... అదేదో బయటకి కక్కేస్తే మేంకూడా సరదాగా వింటాం కదా!" అని సుమిత్రమ్మ పైన ఒత్తిడి తెచ్చారంతా!

"అమ్మో! మనవాడిగాథను వాడిఅనుమతిలేకుండా చెబితే వాడు నా తాట ఒలవడూ!"అని తప్పించుకోబోయింది. అదే సమయంలో పెళ్ళిపెద్దల్లో ఒకరైన కృష్ణకాంత్ గారు ఏదోపనిఉందని పిలిస్తే వెళ్ళక తప్పలేదు.

అరటిపళ్ళ గెలలకోసం బోనంగి అనే గ్రామం వెళ్ళమని ఒక ఆటోవాడిని కూడా పంపారు.

నేను వెళ్ళానన్నమాటేగానీ ఈ బామ్మగాని అసలు విషయం ఊదేయదుకదా!

అన్నట్లు ఈ పెళ్ళిలో మధుర రాకగురించి చూచాయగా చెప్పింది బామ్మ! అసలు మధుర గురించి తలుచుకుంటేనే అమృతం త్రాగిన అనుభూతి! ఆ స్పర్శ ఇప్పటికీ మరువరానిది. అంతా యాదృచ్ఛికం! ఒక పడకపైన.... అందమైన ఆమెతో నేను...

ఆటో చప్పుడికి తెలివిలోకి వచ్చి చూసేసరికి గమ్యం చేరినట్లు తెలిసింది. అరటి గెలలు దింపించి లోపలపెట్టి ఇలా బయటకొచ్చానో లేదో ఒకమ్మాయి నా ముందుకి వచ్చి "తమరి రసరమ్యమైన సన్నివేశం మహా రక్తికట్టిందోయ్! నువ్వు లేకపోయినా సరే బామ్మగారు వర్ణించి మరీ మాకందరికీ చెప్పి ఆహ్లాదపరచింది. నీలాంటి అదృష్టం అందరికీ దక్కద్దూ!" అని నవ్వుతూ కనుమరుగైంది.

హామ్మ! కొంపముంచినట్లుంది! ఇప్పటిదాకా గుట్టుగా నాకు, సుమిత్రమ్మకు మాత్రమే తెలిసిన ఈ సంగతి ఇప్పుడు నలుగురి మధ్యన నలిగింది. సుమిత్రమ్మను కలిసి కడిగిపారేద్దామనేసరికి ఆమే నాకెదురుపడింది.

"ఏయ్! బామ్మా! ఏమిటది నీకేమైనా బాగుందా! ఆ విషయం నలుగురిలో చెప్పడం...

ఎంతవరకూ సమంజసం? ఇటు నాకు అటు మధురకి కూడా ఇబ్బంది కాదా?" అని కాస్త చిరాకు పడ్డాననే చెప్పాలి.

"ఓరి బడుద్దాయ్! నీకు బెంగేమో గాని మధుర మాత్రం ఏమనుకోదురా! అది నాకు మేనకోడలేకదరా! ఐనా వీళ్ళందరికీ విన్నవించింది... కాస్త కల్పితంలే... కొంత మసాలా జోడించి ఉత్సాహపరిచాను"

"అంటే నన్ను బలిపశువుని చేశావా? హతోస్మి!!" నెత్తిన పెట్టుకోవడమొక్కటే మిగిలింది.

"ఒరేయ్! అన్నట్లు అదిగోరా! మధుర దిగింది... ఏమే మధురా బాగున్నావటే!" అని గుమ్మందగ్గరికి వెళ్తుంటే నా దృష్టి అటువైపు మళ్ళింది. నిజమే! మధురే!! పొడగరైన అందాల బొమ్మ... నిండు పొంకాలతో పొదరిల్లు మాదిరి విగ్రహం... ఈమె స్పర్శలో నేనా నేను పులకించిపోయిందారోజు.

"హాయ్! సుమన్! హౌ ఆర్యూ?" అని పలకరించుకుంటూ ముందుకెళ్ళిపోయింది మధుర.

"ఏమండీ! మీ మధుర మత్తులో పడి ఈలోకం మరువకండి... నేలమీదనే ఉండండి...

మీ మధుర సన్నివేశాలను కాస్త తలుచుకోవడం ఆపి ఇక్కడ పనుల్లో సాయం చేయండి..." అని కొరకొరా చూస్తూ వెళ్ళిపోయింది నా శ్రీమతి రసరమ్య.

అమ్మో! సుమిత్రమ్మ చెప్పిన పురాణకాలక్షేపం ఈమె చెవులదాకా పాకిందన్నమాట! ఇక మా ఇద్దరి

## స్వేచ్ఛ ఇచ్చారు

'రాజుగారి గది 2'లో వీలైనంతగా పరువాలను ప్రదర్శించిన సీరత్‌కపూర్ ఈసారి ఒక్క క్షణం చిత్రంలో కొత్తగా పెళ్ళైన గృహిణి పాత్ర పోషిస్తున్నది. "అవసరాల శ్రీనివాస్ సరసన నటిస్తున్నా. మా ఇద్దరి నడుమా మంచి అవగాహన ఉండడంతో కష్టంగా లేదు.

ఇటువంటి సైంటిఫిక్ థ్రిల్లర్‌లో పనిచేయడం నాకు కొత్త. పరిణతిగల హోమ్‌మేకర్ పాత్ర ఇచ్చినందుకు దర్శకుడికి కృతజ్ఞతలు చెప్పుకోవాలి. నా స్వంత స్టయిల్‌లో నటించేందుకు ఆయన స్వేచ్ఛ ఇచ్చారు" అంటూ సినిమా సంగతుల్ని ఏకరువుపెట్టింది సీరత్‌కపూర్.



నేను అందగత్తెను కాదు అనే విషయంమీద స్పష్టత రావటంతో నాలో తెలియని పరిణితి వచ్చింది.

-అనుష్క శర్మ, నటి

నడుమ యుద్ధం ఖాయం! అదే భయంతో నేను మధుర ఉనికివున్న ఛాయల పక్క వెళ్ళడానికి సాహసించలేదు. ఐనా మా ఆవిడ నన్నో కంట కనిపెడుతూనే ఉందని నేను పోల్చాను.

"మీ శ్రీమతిగారా? సూపర్! ఇదే చూడ్డం... అదృష్టవంతుడివి!" అన్నది మధుర శ్రీమతి రసరమ్యను పరిచయం చేసుకుంటూ.

పేలవంగా నవ్వేసింది రమ్య. మధుర రసరమ్యను చూస్తూ "మీ శ్రీ వారు సూపర్! హ్యాండ్సమ్!! మీరు మహా అదృష్టవంతులు!" అన్న పొగడ్తకు చురుగ్గా చూసింది. ఒక పరాంగన తన భర్తను పొగిడితే ఏ స్త్రీ పొంగిపోదు సరికదా ఒక అనుమానపు వీచిక కూడా పొడసూపడం కద్దు. అదే జరిగింది.

శ్రీమతిచూపులు నన్ను కూడా కస్సుమని గుచ్చాయి. అసలేం జరిగిందో తెలీదు.. బామ్మ నలుగురిలో ఏమేమి చెప్పుకొచ్చిందో అంతా అయోమయం! దైవమా! నువ్వే రక్షించాలి. మొత్తానికి సుస్మితమూర్తి గారింట్లో పెళ్ళి వైభవంగా జరిగిందని చెప్పాలి. ఇక మర్నాడే తిరుగు ప్రయాణం!

ప డగ్గదిలో ఉన్నామన్న మాటేగాని మా ఇద్దరి మధ్యన మౌనం కర్కశంగా రాజ్యమేలుతోంది. నేనే చొరవచేసి రమ్య మీద చేతులేస్తే విదిలించిపారేసింది. "ఏమైంది రమ్యా! అసలు నీకు విషయం..." అని సముదాయించబోతే...

"మీరేం చెప్పనక్కర్లేదు. మీ ఇద్దరి రాసలీలలు సుమిత్రమ్మ రసవత్తర కావ్యంగా మలిచిమరీ వినిపించింది. మీ మధుర జ్ఞాపకాలను..."

"అసలేం చెప్పిందట... నువ్వింత ఫీలైపోవడానికి"




"అంటే మరోసారి నా నోటంట చెప్పించి వినోదిద్దామనా?" కస్సుమన్నది. ఆమెను నావైపుకు తిప్పుకోడానికి చేసిన భగీరథ ప్రయత్నం వమ్మయింది.

"మీ ఇద్దరూ అసలు ఒకే గదిలోకి ఎలా చేరారో... తర్వాత ఒకే పడకమీద ఎలా విలాసాలు సాగించారో... మీ ఇద్దరూ ఒకలాగ కౌగిల్లో ఎలా కరిగిపోయారో అంతా ఆవిడగారు చెబుతుంటే అందరూ సినిమాకథ వింటున్నట్లు ఆనందిస్తుంటే మీ శ్రీమతిగా నేను మీరు సరసాలలో ఘనుడని పొంగిపోవాలా? లేదు పరాయిపడతితో ఒకే పక్కపై రసకేళి జరిపారని కృంగిపోవాలా? చెప్పండి?" దిగ్గున లేచి నా వైపు చూస్తూ ప్రశ్నిస్తుంటే దిమ్మదిరిగిపోయింది.

భుజంపైన చేయివేస్తే విదిలించబోతే గడ్డం పట్టుకుని లాలిస్తూ శాంతింపజేస్తూ "బుజ్జీ! అసలు సంగతి తెలిస్తే ఇలా ఛ్రాచిలా లేచేదానివి కాదు. విను... చెబుతున్నా..." అని అసలు సిసలు కథను శ్రీమతికి వెళ్ళబోసుకున్నాను.

ఐదేళ్ళక్రితం మాట! అప్పటికి నాకింకా పెళ్ళి కాలేదు. మా అత్తకూతురు రాగిణి పెళ్ళికి మా ఇంటి తరపున నన్ను వెళ్ళమంటూ అమ్మ ఒత్తిడితో బయలుదేరక తప్పలేదు.

నేను వెళ్ళేసరికి సుమిత్రమ్మకూడా అక్కడ సిద్ధం! ఆమె హడావుడి అంతా ఇంతాకాదు. ఆమెతో పాటుగా నన్ను కూడా పెళ్ళి పనుల్లో తలమునకలు అయ్యేలా చేసింది.

ఎడతెరపి లేకుండా పనులు చేయడంతో రాత్రి ఒళ్ళు పులిసిపోయింది. నిద్రతో నాకు కళ్ళు పడిపోతున్నాయి.ఏ గదిలో పడుకోవాలో అర్థంకాక కాలుగాలిన పిల్లిలాతిరుగుతున్న నా పరిస్థితిని చూసిన సుమిత్రమ్మ "ఏరా! బడుద్దాయ్! అలా రెప్పలు వాలిపోతూంటే కాస్త నడుంవాల్చాలని తెలియదట్రా! అన్నిటికీ మొహమాటపడితేఎలా?నేనింతదాకా ఓ కునుకుతీసొగాని నువ్వు కూడా అదిగో ఆ గదిలో దుప్పటికప్పేసుకునిపడుకో... అసలే చలి వణికిస్తోంది" అని చెప్పడమేంటి ఆమె చూపించినగదిలో ఉన్న విశాలమైనబెడ్ ఎక్కేశాను.

నాకు ఒకటే నిద్ర! ఐతే హటాత్తుగా మధ్య రాత్రి తెలివి వచ్చి చూసేసరికి నన్నెవరో గట్టిగా చుట్టుకుని పడుకున్నట్లుగా పోల్చాను. మెల్లగా దుప్పటి ఎత్తి చూశా... ఒక అందమైన అమ్మాయి నన్ను కౌగిలిలో బంధించి పడుకుందంటే నమ్మశక్యం కాలేదు.

అసలు ఇదెలా జరిగిందో ఓ పట్టాన బోధపడలేదు. నేను మెల్లగా లేవబోతుంటే "సుమిత్రత్తా! ప్లీజ్! అలాగే ఉండు... మరికాసేపు పడుకుందాం... అన్న మాటవినడంతోనే జరిగిందేమిటో అర్థమైపోయింది.

బా మ్మ అంతవరకూ పడుకున్న స్థానంలో నేను చేరానన్నమాట! తన అత్తే అక్కడ పడుకుని ఉందేమోనని కూడా చూడకుండా పక్క ఎక్కేసింది. తర్వాత గభాలున లేచి బయటకి పరిగెత్తి "అత్తా! నువ్వెప్పుడు అక్కడినుంచి వచ్చేశావ్? అతనెవరు?" అని సిగ్గుపడుతూ అడుగుతున్నమాటలు నా చెవిని చేరాయి.

"జరిగినదాంట్లో మీ ఇద్దరి తప్పు లేదే మధురా!! కాకతాళీయం... ఇది మీ శీలం చెడకుండా ఇద్దరికీ ఓ మధురజ్ఞాపకం" అనేసింది.

అంతే! నేను ఎదురుపడినప్పుడల్లా మధుర మొహమాటంగా ఉండేది.తర్వాత మళ్ళా ఈ పెళ్ళిలో ఎదురుపడ్డమే! నన్ను నమ్ము! ఇంకా కావలిస్తే సుమిత్రబామ్మను అడుగు... అసలు సంగతి తెలుస్తుంది" అని చెప్పి రసరమ్యవైపు చూశాను.

ఆమె మొహం తేటగా అనిపించింది. హమ్మయ్య! అప్పటిగ్గాని నా మనసు శాంతించింది కాదు. అంతే గభాలున నన్ను లాక్కుని "ఏయ్! రాత్రంతా తన పొంగులతో మిమ్మల్ని హత్తుకున్న ఆ మధురనే చేసుకోలేకపోయారా? నన్నెందుకు చేసుకున్నారు?" అని ముద్దుల్లో ముంచెత్తుతూ అడిగింది.

"ఇంత కథకీ మూలకారణమైన సుమిత్రమ్మ ఆ ప్రయత్నమూ చేయకపోలేదు. అయితే అప్పటికే మధురకు పెళ్ళి కుదిరిపోయిందిట!

ఐనా వివాహం ఒక దివ్యయోగం! అది ఎవరితో ఎవరిని కలుపుతుందో అనూహ్యం! మనిద్దరికీ రాసి పెట్టి ఉంది... అంతే!" అని నేను కూడా శ్రీమతితో సయ్యాటకు సిద్ధమయ్యాను!



THE LARGEST CIRCULATED TELUGU WEEKLY

# స్వాతి

సపరివార పత్రిక

## నూతన సంవత్సర కానుక సరికొత్త విజయాల వేదిక

### పిడపర్తివారి

# 2018 క్యాలెండర్ ఉచితం

కాలాన్ని, దాని కదలికలను అంచనావేయడం అనితర సాధ్యం.
రెప్పపాటుసమయాన్ని ఆపాలన్నా ఆ సృష్టికర్తకే అసాధ్యం.
కాల పురుషునికాలం అంత గొప్పది. అటువంటి కాలం గురించి
తెలుసుకోవాలనే జిజ్ఞాసగలవారికోసమే ఈ స్వాతి
క్యాలెండర్. కాలజ్ఞానాన్నిచ్చేదే స్వాతి క్యాలెండర్.
ఈ క్యాలెండర్‌లో రోజుయొక్క ప్రాముఖ్యత, సంవత్సరంలోని 365
రోజుల గ్రహానుకూలత, వారం, వర్జ్యం, తిథి, నక్షత్రం, దుర్ముహూర్తం,
సుముహూర్తం, రాహుకాలం మొదలైన వాటితోపాటు ఏ నెలలో
ఏ పండుగ మొదలైనవాటిగురించి వివరించబడింది.
స్వాతి క్యాలెండర్ మీ వద్ద వుంటే 12 నెలలు అనగా 365 రోజుల
అదృష్టమంతా మీ చేతిలో వున్నట్లే.
లగ్న నిర్ణయకర్తలవంటి బహుముఖ ప్రజ్ఞావంతులుసైతం
ప్రామాణికంగా తీసుకునేది స్వాతి క్యాలెండర్‌నే. కనుక ఈ క్యాలెండర్
కోసం ముందుగా మీ కాపీని రిజర్వుచేసుకోండి.





మ్యాప్‌లితో పేపర్, మల్టీకలర్ ప్రింటింగ్‌తో 2018 క్యాలెండర్‌ను పాఠకదేవుళ్ళకు నూతన సంవత్సర
కానుకగా స్వాతి సపరివార పత్రిక వచ్చేసంచికతో ఉచితంగా అందిస్తోంది.
ముందుగానే మీ కాపీని ఏజెంట్‌ద్వారా రిజర్వ్ చేసుకోండి.



ఆమె రాజహంసా?! లేక కోకిలా?!
ఆ సుందరాంగుడు ఆలోచనలోపడ్డాడు

ఆమె మంద్రంగా మేలిముసుగును
తొలగిస్తే-
అతడి కళ్ళలో కోటి సూర్యమండలాలు
వెలిగాయ్! శతకోటి చంద్రోదయాలు
విరిశాయ్!

ఆమె అద్భుత సౌందర్యరాశి!
మానవరూపంలో వచ్చిన
దేవాంగన కాదుగదా!
అతడిలో నిర్వచించలేని
భావసంచలనం!
అతను ఆమెవంకే
రెప్ప వాల్చకుండా చూస్తుంటే
మనోహరంగా నవ్వింది యువతి!
ఎవరామె?!
అతనెవరో తెలియాలంటే

## సి.శివరామమూర్తి

గోల్డెన్ ఎరా సీరియల్

# సామ్రాట్ సముద్రగుప్త

చదవండి! త్వరలో ప్రారంభం!

# చేసిన మేలు మరువద్దు



Courtesy : PARENT CIRCLE

పిల్లలకు కొత్తలో ఏదైనా ఇచ్చినప్పుడు ఎంతో సంతోషిస్తారు. ఎగ్జయిట్ అయిపోతారు. ఇచ్చిన అమ్మనో, నాన్ననో ముద్దులతో ముంచెత్తేస్తారు. ప్రశంసలతో ఉక్కిరి బిక్కిరి చేస్తారు. కృతజ్ఞతలతో ఆనందాన్ని వ్యక్తం చేస్తారు.

ఆ వస్తువు కొన్నాళ్ళకు పాతబడిపోతుంది. మళ్ళీ మరోదాన్ని కావాలంటారు. అమ్మానాన్న దాన్నీ సమకూర్చుతారు. కాని, తొలిసారి వ్యక్తంచేసిన భావాలు ఈసారి సన్నగిల్లిపోతాయి. ప్రశంసలు, కృతజ్ఞతల స్థాయి తగ్గుతుంది.

అంటే ఎంత ఎక్కువగా వారు కోరింది ఇస్తుంటే, అంత తక్కువ ప్రశంసలు, కృతజ్ఞతలు వ్యక్తం చేస్తుంటారన్నమాట. మనకులేనివన్నీ పిల్లలకు సమకూర్చిపెట్టాలని, ప్రేమతో వారిని ముంచెత్తాలని తల్లిదండ్రులు ఆరాటపడడం అతిసహజం.

ఇలా చేస్తూపోవడంవల్ల అసంకల్పితంగా వారిలో ప్రశంసాపూర్వక ధోరణిని తగ్గింపజేస్తుంటారు. పిల్లలు తమకు కావాల్సినవి అడిగీ, అడగకుండానూ సమకూర్చుకుంటూ రానురాను "టేక్ ఇట్ ఫర్ గ్రాంటెడ్" ధోరణికి అలవాటుపడిపోతారు.

తమ కోరికలపట్ల పూర్తిదృష్టి సారిస్తారు. వాటిని పొందగల మార్గాలగురించి ఆలోచిస్తారు. అంతేతప్ప, విషయాలను ప్రశంసించడాన్ని అభ్యసించే ఛాన్స్ అస్సలు తీసుకోరు. అందినవాటికి కృతజ్ఞతలు తెలియజేయాలన్న ఆలోచన అసలే రాదు.

ఇంకా చెప్పాలంటే నేటి తరానికి ఏదైనా తమ దగ్గర లేకపోవడం అన్నదానికి అర్థమే తెలియనంతగా ఉంటున్నది. ఇంట్లోని పెద్దలు పిల్లల అవసరాలను అన్నింటినీ వీలయినంత త్వరగా తీర్చేయడానికి సిద్ధంగా వుంటున్నారు.

దీంతో పిల్లలు తమ కోరికలను సాధించుకోవడం ఓ హక్కుగా భావిస్తుంటారే తప్ప అందుకు ప్రశంసలందించాలని, ధన్యవాదాలు చెప్పుకోవాలని అస్సలు భావించడంలేదు. కాని, ఎదిగేకొద్దీ ఇటువంటి ధోరణి ఉండడం ఎంతమాత్రమూ సమంజసం కాదు. కావాల్సింది పొందినందుకు కృతజ్ఞతాభావాన్ని వ్యక్తం చేయుగల అలవాటును చిన్నతనం నుంచి వారికి అలవరచాలి. ఇది అవసరం కూడా.

## ⏭ పెద్దలతోనే మొదలు

**మ**నపిల్లలకు మనమే తొలిరోల్‌మోడల్స్.వారిపై అమ్మానాన్నల ప్రభావం తెలియకుండానే చాలా వుంటుంది. మన చర్యలద్వారా, మాటలు, కృతజ్ఞతాపూరిత ధోరణిద్వారా ప్రశంసాపూర్వక ప్రవర్తనతో పిల్లల్ని ప్రభావితంచేయగలగాలి. ఇతరులు చేసిన సాయానికి కృతజ్ఞతలు చెప్పడం చూసిన పిల్లలకూ అదే ధోరణి అలవడుతుంది. తల్లిదండ్రుల నుంచి పిల్లలుసులువుగా జీవితాన్ని చక్కనిమార్గంలో మలచగల విలువల్ని గ్రహించగలుగుతారు.

**అనుభవాల లెక్క :** పిల్లలు దేన్ని అయినా అనుభవంతో నేర్చుకుంటారు. కాబట్టి, ఇతరులకు కృతజ్ఞతలు చెప్పడంద్వారా ఎటువంటి ఆనందం దక్కుతుందనే విషయాన్ని వారు అనుభవపూర్వకంగా గుర్తించే విధంగా చెయ్యాలి.

ఉదాహరణకు ఆదివారాలు పనివాళ్ళెవరూ లేనప్పుడు గార్డెనింగ్, క్లీనింగ్ వంటి పనులను పిల్లల్ని చేయనిస్తే, ఇంటికోసం పనివాళ్ళెంత సాయపడుతున్నారన్న విషయాన్ని వాళ్ళు గ్రహిస్తారు. వారుచేసే పనిని ప్రశంసించగల ధోరణి అలవడుతుంది.

## ⏭ చిన్న సంగతులే

**కొ**ద్ది నిమిషాలు బాల్యస్మృతుల్లోకి వెళ్ళిపోతే ఆనందాన్ని ఇచ్చిన అనేక చిన్నచిన్న విషయాలు గుర్తుకువస్తాయి. ఇష్టమైనవారితో గడపడం, ఆడుకోవడం, పుస్తకం చదవడం, వర్షంలో ఆడడం,

పక్షుల కూతల్ని ఇష్టంగావినడం, సీతాకోకచిలుకల వెంటపడడం-ఇటువంటి అనేక చిన్నిచిన్ని సహజమైన పనులుంటాయి.వీటిని నేటితరం పిల్లల రొటీన్‌లోనూ చేర్చగలిగితే వాళ్ళు చిన్నవిషయాలతోనే పెద్ద సంతోషాన్ని పొందగలరు. అప్పుడు పిల్లలకు ఖరీదైన వస్తువుల కోరికలస్థానే జీవితం మరింత అందంగా కనపడడం మొదలవుతుంది.

**'నో' చెప్పాలి :** పిల్లలకు ఎన్నో అందిస్తుంటారు. వారేదైనా అడిగినా ఇవ్వనని చెప్పడానికి అస్సలే మనస్కరించదు. కాని, ఇదితప్పు. వారి అవసరాలు అన్నింటినీ తీర్చాలి. కాని, హార్డ్‌వర్క్ ప్రాముఖ్యాన్ని వాళ్ళను గుర్తించనివ్వాలి. ప్రతిదీ అందుబాటులోకి వస్తుంటే, ఈ ప్రాముఖ్యం వారికి ఎన్నటికీ అర్థంకాదు.

అందుకే కొన్నిసార్లు, కొన్నింటికి 'నో' చెప్పడం నేర్చుకోవాలి. వారికి కొనిచ్చే బొమ్మలు, ఇతర వస్తువులవిలువను తెలుసుకోవడాన్ని అవగతంచేయాలి.

**పిల్లల జోక్యం :** కుటుంబవ్యవహారాల్లో పిల్లల జోక్యాన్ని పెంచాలి. ఆ జోక్యంలో కృతజ్ఞతాపూరిత వైఖరినీ అలవరచుకునే విధంగా వుండాలి. ఇది నాది అన్న బాధ్యత వారికి తెలియజెప్పాలి.



Courtesy : CHILD

**క్లిష్టసమయాల్లో :** అన్ని విషయాలూ సజావుగా సాగుతున్నప్పుడు అంతా బాగానే వుంటుంది. కాని, విషయాలు సక్రమంగా లేనప్పుడుకూడా అదే కృతజ్ఞతను వ్యక్తం చేయగలగాలి.

జీవితం పర్‌ఫెక్ట్‌గా లేనప్పుడు కూడా ప్రశంసించగల ధోరణిని వారికి నేర్పించాలి.

## ⏭ సంపాదనతత్వం

ఎలా సంపాదించాలన్న విషయాన్ని వారికి బోధిస్తుండాలి. ఉదాహరణకు నెలకు మూడువందల రూపాయలు వారికి ఇచ్చారనుకుందాం.వెంటనే వాటినంతా ఖర్చుపెట్టేస్తారా, లేక తర్వాత ఏదైనా కొనుక్కోవడానికి పొదుపుచేస్తారా?

నేటి జీవనశైలిలో, ఆధునిక సమాజంలో నిరంతర రష్ వుంటుంది. కోరికల జాబితాను త్వరత్వరగా పూరించాలన్న ఆతృత వుంటుంది. అప్పుడు ఉన్న దానిని ప్రశంసించుకునే ధోరణి కొరవడుతుంది. లేనిదాని గురించి ఆలోచనలు ఎక్కువై కోరికలచిట్టా నిరంతర ప్రవాహం అయిపోతుంది.

అప్పుడిక ప్రశంసలు, కృతజ్ఞతలకు తావులేక 'స్వార్థం' పెరిగిపోతుంది. ఇటువంటి ధోరణికి పిల్లల్ని ఎంతమాత్రం రానీయకూడదు. ఇటువంటి ధోరణి ఉన్నప్పుడు ఎదిగేకొద్దీ, వారిలో అవగాహన లోపిస్తుంది. ఇంటి పరిస్థితి, తల్లిదండ్రుల అభిప్రాయాలతో నిమిత్తంలేకుండా తాము అనుకున్నది సాధించడమే ధ్యేయంగా వుంటుంది.

## ⏭ ఇబ్బందులు

దైనందిన పనుల్లో ఎదుర్కొనేటువంటి పరిస్థితులు సమీక్షించుకుంటే పెంపకంలో అనేక ఇబ్బందులు తలెత్తుతాయి. ఉదాహరణకు ఆరేళ్ళవయసున్న పిల్లవాడి పుట్టినరోజుకు తాత, అమ్మమ్మలు ప్రేమగా ఏ బోర్డ్‌గేమో కొనిద్దామనుకున్నారనుకుందాం.

కాని, పిల్లవాడు అదికాదు నాకు రేసింగ్‌కారు కావాలంటే ఎలా ఉంటుంది? నిజానికి, ఇంత చిన్న పిల్లలు వారి మనస్సులోని మాటను లేదా కోరికను యథాలాపంగా చెప్పేస్తారు. అసంకల్పితంగా అడిగేస్తారు.

పెద్దవాళ్ళు ఇక్కడే పరిస్థితిని అర్థంఅయ్యేలా వివరించాలి. అడిగాడు కదా వెంటనే కొనిస్తే, అసంకల్పితంగా తర్వాత తర్వాత తరచూ ఏదోక కోరిక పుడుతూనే వుంటుంది.ఇప్పుడు పెద్దవాళ్ళిచ్చిన కానుకకు కృతజ్ఞతలు చెప్పాలని, బోర్డ్‌గేమ్‌తో అందరం ఆడుకుందామని ఉత్సాహపరచాలి. ఇలావారిని బుజ్జగిస్తూనే ఆనకట్ట వేయకపోతే కోరికల ప్రవాహం, వాటి సాధన పెరిగిపోతూనేవుంటాయి.

పదీ పదకొండేళ్ళ పిల్లలతో షాపింగ్‌కు వెళ్ళిన ప్రతిసారీ వారు ఏదోకటి అడుగుతూనే వుంటారు. బయటకు అడుగుపెట్టడానికి ముందుగానే వారికి కొన్ని పరిమితులు విధించాలి. ఆ పరిధి దాటకుండా చేసే ప్రయత్నం ఖచ్చితంగానే ఉండాలి. కాకుంటే మృదువుగా వ్యవహరించాలి.

ఈపరిమితివల్లతమ అవసరాలు,ప్రాధాన్యాలపట్ల వారికి సరైన అవగాహన ఏర్పడుతుంది.

తోటి పిల్లలకు ఉన్నాయన్న కారణంగా, తమకూ కావాలని కోరే పిల్లలు కోకొల్లలు. బ్రాండెడ్ షూలు, ఖరీదైన స్మార్ట్‌ఫోన్లు ఖచ్చితంగా కావాలంటూ పేచీలు వేస్తుంటారు. కోపంగా అరిచేస్తుంటారు కూడా.

అతనిలోని అసహనాన్ని అర్థంచేసుకోవాలి. అతని ఆలోచనలు, అంచనాలను అనుసంధానం చేసే విధంగా ఓర్పుగా, సహనంగా వ్యవహరించాలి.

తన కోసం తగ్గాక లాలనగా పరిస్థితిని వివరించాలి. కుటుంబంపై పడే ఆర్థికభారాన్ని తెలియజెప్పాలి. మారాం చేశాడనో, అల్లరిపడి అరుస్తున్నాడనో కొనివ్వవద్దు.మొగ్గలోనే తుంచేయాలి. లేకుంటే ఉన్న దాంతో సంతృప్తిచెందే ధోరణే వారికి ఉండదు.

స్వంతంగా కొన్ని నిర్ణయాలు తీసుకోగలగడాన్ని తల్లిదండ్రులు అనుమతించినందుకు కృతజ్ఞతలు చెప్పుకోవాలి. తల్లిదండ్రులు అవసరంలో ఉన్నవారి కోసం సమయాన్ని, ధనాన్ని వెచ్చించడాన్ని చూసి వారినుంచి నేర్చుకోవాల్సింది ఎంతో ఉంటుంది. ఆ ప్రభావం పడుతున్నందుకు ప్రశంసించుకోవాలి.

**జాలి, కరుణ :** కరుణ, జాలి, ఎదుటివారికి ఇచ్చే ధోరణి పరస్పరం సంబంధం కలిగివుంటాయి. తన కున్నవాటిపట్ల పిల్లలకు కృతజ్ఞత, సంతృప్తి లేకపోతే ఇచ్చేధోరణిని వారు ఎంజాయ్ చెయ్యలేకపోతారు. ఇచ్చే ధోరణివల్ల సంతోషం దక్కుతుంది. అవసరం ఉన్నవారికి ఎవరికైనా ఏదైనా ఇచ్చిన తర్వాత కలిగే భావాలు సంతోషాన్నిచ్చే హార్మోన్ ఆక్సిటోసిన్‌ను ఉద్దీపించేస్తాయని శాస్త్రీయబద్ధంగా రుజువైంది.

తీసుకోవడంలో కలిగిన ఆనందం స్వల్పకాలికం అయితే, ఇవ్వడంవల్ల కలిగేఆనందం అనంతం. పిల్లలకు ఇచ్చేధోరణి గురించి, కృతజ్ఞతాధోరణి గురించి అవకాశం వచ్చినప్పుడల్లా విశదపరుస్తూ, వాటిని పెంపొందించే ప్రయత్నాలు చేస్తుండాలి.

## ⏭ షేరింగ్ పవర్

దగ్గరున్నవాటిని ఇతరులకు, అవసరం అయిన వారికి పంచడంలో ఎంతో ఆనందం లభిస్తుందన్న సంగతిని వారుగ్రహిస్తే, అలా వస్తువులను షేర్ చేయడంలోగలపవర్ వారికిఅర్థంఅవుతుంది.ఈ విషయాన్ని గ్రహించగల వయస్సురాగానే, వివరిస్తుండాలి.

వయస్సుకు తగినట్లుగా, ఎదిగేకొద్దీ ఒక్కో అలవాటు చేస్తుండాలి. అప్పుడే వాళ్ళు స్వార్థరహితంగా, జీవితంలో తమకు లభించినవాటిపట్ల కృతజ్ఞతాపూర్వకంగా వ్యవహరించడాన్ని అలవరచుకుంటారు. ఎదిగేకొద్దీ బాధ్యతాయుతంగా వ్యవహరించడానికి ఇక్కడే పునాది పడుతుంది.

కె.మనస్విని



# నేనెవరో తెలుసా!

ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు **ఇన్‌లాండ్ కవర్‌పై** రాసి స్వాతి చిరునామాకు 30 డిశంబరు 2017 తేదీలోగా పంపించండి.

కరెక్టు సమాధానాలు రాసినవారిలో లాటరీ పద్ధతిద్వారా ఒకరిని విజేతగా ఎంపిక చేసి ₹ 500/- నగదు బహుమతిని అందజేస్తాం.

చట్టసభలకు ఎన్నికైనవారికి ప్రత్యేక గౌరవాన్నిస్తారు. ఆయా సభలలో పనిచేసి మరణించినవారికి సభా నివాళులు అర్పిస్తారు.వారి మరణం తప్పకుండా ప్రస్తావిస్తారు సభాపతులు.

మరీ ముఖ్యులైతే సంతాప తీర్మానం తర్వాత సభలో ఎటువంటి కార్యక్రమాలూ నిర్వహించక వాయిదా వేస్తారు. ఆ ప్రముఖుడికి అధికారిక లాంఛనాలతో అంత్యక్రియలు నిర్వహిస్తారు.అది ఒక సభా సాంప్రదాయం. ఆ గౌరవం సభలో సభ్యులు కాని వారికి అంత సులభంగా లభించదు.

కాని 2012లో ఒక వ్యక్తి మరణించినప్పుడు పార్లమెంట్‌లో ప్రత్యేకంగా అప్పటికప్పుడు ప్రస్తావించారు. ఒక మహానేతను కోల్పోయామని ఎందరో ఎమ్.పిలు ప్రసంగాలు చేశారు. చివరికి సభా సమయం తగ్గించి సీనియర్ ఎమ్.పిలు ఆయన మృతదేహాన్ని చూసేందుకు వెళ్ళే వీలు కల్పించారు.

ఆయన అధికారిక అంత్యక్రియలకు ప్రత్యేకంగా జి.ఓ. విడుదలచేసింది ప్రభుత్వం. ఒక బహిరంగ పార్క్‌లో ఆయనకు అంత్యక్రియలు నిర్వహించారు ముంబయిలో. అప్పుడెప్పుడో స్వాతంత్ర్య సమర యోధుడు బాలగంగాధర్ తిలక్‌కి 1920లో బహిరంగ ప్రదేశంలో నిర్వహించిన అంత్యక్రియల తర్వాత తిరిగి ఆ స్థాయిలో అంత్యక్రియలు జరిగినది, ప్రజలు హాజరైనది ఈయనకే.

ఆయనకు ఎటువంటి హోదా లేకున్నా 21 తుపాకీలతో వందనం సమర్పించి అంత్యక్రియలు జరిపారు. అటువంటి గౌరవం అందుకున్న ప్రైవేట్ వ్యక్తి భారతదేశంలో ఆయన ఒక్కడేనేమో.

తమ చట్టసభకు, తమ రాష్ట్రానికి ఏమాత్రం సంబంధం లేకున్నా బీహారు అసెంబ్లీలో ఆయన మరణానికి ప్రత్యేకంగా సంతాప తీర్మానం చేశారు. ఒక్కసారికూడా ప్రజలచేత ఎన్నుకోబడలేదు.

కాని ఆయన పిలుపుతో ముంబయి వంటి నగరాన్ని ఒక ఆట ఆడించేవాడు. ఆయన పిలుపు ఇస్తే ముంబయి స్తంభించేది. వేదికలమీద ఆయన్ని తిట్టిపోసేవారుకూడా ఎదురుగా పిల్లుల్లా వుండేవారు.

ఆయన ఒక ప్రాంతీయ పార్టీ అధినేత మాత్రమే. పైగా ఆయన ఆలోచనలు, చేష్టలు అన్నీ సంకుచితంగా వుండేవి. 'విశాల భారతదేశం' అనే భావన కాక మహారాష్ట్ర, ముంబయి మాదేనంటూ నినాదాలు ఇచ్చేవాడు. ముంబయి నగరంలోని మహారాష్ట్రేతరులు కొన్ని సంవత్సరాలపాటు బిక్కుబిక్కుమంటూ బతకాల్సి వచ్చింది. ఎప్పుడు ఎవరిని పరాయివారిగా ప్రకటిస్తాడో తెలిసేది కాదు. ఒకసారి తమిళులమీద విరుచుకుపడితే మరోసారి ఉడిపి హోటళ్ళమీద దాడి చేయించేవాడు. బీహారీలు, ఉత్తరప్రదేశ్‌కి చెందిన వాళ్ళు వచ్చి ముంబయిని ఆక్రమిస్తున్నారనేవాడు.

పేరుకు ఇది మహారాష్ట్రలోని నగరమే కాని బొంబాయిమీద పెత్తనమంతా గుజరాతీలదే అంటూ రెచ్చగొట్టేవాడు.ఎప్పుడు ఎవరిమీద రాయి విసురుతాడో తెలిసేది కాదు. పైగా తాను శివాజీ మహరాజ్ సిద్ధాంతాలకు వారసుడనంటాడు.

దేశంకోసం, పరాయి పాలకులను పారద్రోలేందుకు వీరపోరాటం చేసిన శివాజీ పేరు చెప్పుకుంటూ మిగిలిన భారతీయులమీద విషం కక్కే ఆయన్ని ఎలా భరించాలో ఏ పార్టీకీ అర్థమయ్యేది కాదు.

అంతగా విద్వేషం రెచ్చగొట్టినా, భయంకరకమైన ప్రసంగాలతో ఒక వర్గాన్ని మరో వర్గం మీదికి ఉసిగొల్పినా, విచారణా సంఘాలు ఆయనది తప్పుగా తేల్చినా ఒక్కసారంటే ఒక్కసారికూడా ఆయన్ని అరెస్టు చెయ్యలేకపోయాయి ప్రభుత్వాలు.

అసలు ఆయన ఇంటివైపు తొంగిచూడగలిగిన సాహసం ముంబయి పోలీసులకు లేదని అనేవారు ఆ రోజుల్లో. మరాఠీల సంస్కృతీ నగరమైన పూనెలో పుట్టాడు ఆయన.నాటి ముంబయి రాష్ట్రంలో మరాఠీ వారికి ప్రత్యేక రాష్ట్రం కావాలన్న ఉద్యమం నడిపిన వ్యక్తుల్లో ఆయన తండ్రి ఒకరు.

నిజాం పాలనలో వున్న మరాఠీ ప్రాంతాలు విలీనం కావాలన్నది నాటి పోరాటం. అటువంటి కల 1956లో సఫలమైనా ఆయన మాత్రం ప్రాంతీయతత్వం వదలలేదు. ప్రారంభంలో ఆయన జీవితం ఒక కార్టూనిస్టుగా, మంచి పంచ్ వున్న కార్టూనిస్టుగా ప్రత్యేకమైన గుర్తింపు వచ్చింది.

'ఫ్రీప్రెస్ జర్నల్', 'టైమ్స్ ఆఫ్ ఇండియాల్లో' ఆయన కార్టూన్స్ వచ్చేవి. ఫ్రీప్రెస్ జర్నల్‌వారితో విభేదాలు తలెత్తి ఆయన బయటకు వచ్చి సొంతంగా పత్రిక ప్రారంభించినప్పుడు ఆయనకు మిత్రుడు జార్జి ఫెర్నాండెజ్. పత్రిక అట్టే కాలం నడవలేదుగాని రాజకీయాలలో రావటానికి అవకాశం దొరికింది.

బొంబాయి నగరంలో ఎటు చూసినా మరాఠీయేతరులే. కాబట్టి మరాఠీ ఆత్మగౌరవం పేరుతో పార్టీ పెడితే బాగుండనే ఆలోచన వచ్చింది. ఐతే తొలుత అది రాజకీయపార్టీగా మొదలవలేదు. మరాఠీ అభిమానుల బృందంగా ఏర్పడింది.

వారి డిమాండ్ స్థానిక ఉద్యోగాలన్నీ మరాఠీ భాష మాట్లాడేవారికే దక్కాలి అనేది.అందుకోసం మరాఠీ ప్రజలను రెచ్చగొట్టాలనుకున్నాడు. 'బొంబాయి టెలిఫోన్ డైరెక్టరీ చూడండి' అంటూ ప్రజలకు పిలుపు ఇచ్చాడు. దానినిండా గుజరాతీలు, దక్షిణ భారతదేశం వారి పేర్లే వున్నాయి చూడండి.

తమ సొంత ప్రదేశంలో టెలిఫోన్లుకూడా లేనంతగా మరాఠీలు వెనకపడున్నారు చూడండి అంటూ రెచ్చగొట్టాడు. మరాఠీలు నిజమని నమ్మారు. హింసాత్మక సంఘటనలు మొదలయ్యాయి.

ఆయనకు, ఆయన పెట్టిన పార్టీకి గుర్తింపు వచ్చింది. అక్కడనుండి కమ్యూనిస్టుల అధీనంలో వున్న కార్మిక సంఘాలన్నింటినీ తనవైపు తిప్పుకున్నాడు. కమ్యూనిస్టులను లొంగదీసేందుకు కాంగ్రెస్ మద్దతు ఇచ్చింది.

అయితే క్రమంగా కాంగ్రెస్‌కి సవాలు విసరగలిగిన శక్తిని సంపాదించాడు. సొంతంగా ఒక పత్రిక పెట్టాడు. ఆ పత్రికద్వారా తన మరాఠీ అభిమానాన్ని రాష్ట్రమంతటికీ అందించగలిగాడు.

1992లో ముంబయిలో బాంబు పేలుళ్ళు జరిగి వందలాదిమంది అమాయకులు మరణించిన తర్వాత ఆయన తన పార్టీని ముస్లిమ్ వ్యతిరేక పార్టీగా మార్చాడు. బి.జె.పికి దగ్గరయ్యాడు. 1995 ఎన్నికల్లో మహారాష్ట్రలో అధికారం చేపట్టగలిగాడు.

నేరుగా ముఖ్యమంత్రి కాగలిగిన అవకాశం వున్నప్పటికీ ఆయన ఎన్నడూ పదవులను తీసుకోలేదు. 'రిమోట్ కంట్రోల్ నా చేతిలో పెట్టుకుని ప్రభుత్వాన్ని ఆడిస్తాగా' అని గర్వంగా చెప్పుకునేవాడు.

**ఆయన్ని ఎన్నికల్లో పోటీచేసేందుకే కాదు,ఓటు వెయ్యటానికికూడా అనర్హుడుగా కోర్టు ప్రకటించినా అరెస్టుచేసి జైలుకు పంపలేకపోయాయి. పాకిస్తాన్, క్రికెట్ పోటీలు ఇండియాలో ఆడకుండా అడ్డుకునేందుకు టెస్ట్ పిచ్‌ని తవ్వించాడు.**

**సినిమా అయినా, సంగీతం అయినా పాకిస్తాన్‌తో సంబంధం వున్నవారుంటే దానిని జరగనిచ్చేవాడు కాదు. ఆయన మాట వేదం... ఆయన మాట శాసనం అన్నంతగా ముంబయినగరాన్ని తన గుప్పిట్లో పెట్టుకున్నాడు ఆయన.ఇంతకీ...**

***1. ఆ నాయకుడు ఎవరు?***

***2. ఆయన స్థాపించిన పార్టీ పేరేమిటి?***

15.12.2017 సంచికలో ప్రచురించబడిన 'నేనెవరో తెలుసా!' శీర్షిక సమాధానాలు :

1. రుష్యేంద్రమణి
2. అజంతా థియేటర్స్

విజేత : సి.యు.కె.ఎల్.సాయి ప్రశాంతి
ఎమ్.ఐ.జి. 16, ఎ.పి.హెచ్.బి కాలనీ
తణుకు 534 211






# ఈనాటి ఈ బంధమేనాటిదో...

## మూగమనసులు

ప. ఆ. ఈనాటి ఈ బంధమేనాటిదో...
ఏనాడు పెనవేసి ముడివేసెనో
అ. ఓ... ఈనాటి ఈ బంధమేనాటిదో
ఏనాడు పెనవేసి ముడివేసెనో
ఇ. ఓ... ఈనాటి ఈ బంధమేనాటిదో...
చ. ఆ. చుక్కలు పొదిగిన ఆకాశం
మక్కువలొలికే మనకోసం ॥2॥
అ. మంచుతెరలలో మల్లెలతో
పందిరిమంచం వేసింది ॥2॥
ఇ. ఈనాటి ఈ బంధమేనాటిదో... ॥2॥
చ. అ. నీ కనుపాపల ఊయలలో నే పసిపాపలా పవళిస్తా ॥2॥
ఆ. అనురాగము అనురాగమునే ఆలపించి నిను లాలిస్తా ॥2॥
అ. నీలో నాలో నేనేలే, నీలో నాలో నేనేలే
ఆ. మనలో మమతే చిరంజీవిలే
ఇ. ప్రేమకు రూపం మనమేలే... ॥ఈనాటి॥
చ. అ. నీ సిగవిరజాజినై - నీ ఎదనేలరాజునై
ఆ. నీ నగవుల రాశినై - నీ మగసిరిదాసినై
అ. నీవూ నేనూ నిజమై బుజువై ॥2॥
ఆ. ఎన్ని యుగాలుగ ఉన్నామో
ఇ. ఎన్ని జన్మలు కన్నామో... ॥ఈనాటి॥

సంగీతం కె.వి.మహదేవన్ గానం ఘంటసాల, పి.సుశీల

# నిను వీడని నీడను నేనే...




## అంతస్తులు

ప. నిను వీడని నీడను నేనే - కలగా మెదిలే కథ నేనే ॥2॥
చ. నునులేత పూవునై విరిసె - నిను నమ్మి చేరినా వలచి ॥2॥
వలపంతా ధూళిలో కలిసె ॥2॥
బ్రతుకె బలియై ముగిసె
చ. నిరుపేదకెందుకో అలుపు - కలవారి ఆటకే గెలుపు ॥2॥
మృతినైన మాయదీ తలపు ॥2॥
బ్రతుకె చితిగా తుదకు ॥నిను వీడని॥

సంగీతం : కె.వి.మహదేవన్ గానం : సుశీల

# మనిషిలో మనిషి





సంస్థానంకూడా ఆశ్రమాభివృద్ధికి తమవంతు చాలా సాయంచేసింది. వారసీకంగా వస్తున్న అనుబంధంగాబట్టి తమ రాజగురువు కృష్ణశాస్త్రికి మించి స్వామీజీపట్ల అభిమానం భక్తి చూపిస్తాడు తను. రాజగురువు కృష్ణశాస్త్రి రాకతో- రాజావారు ఆలోచనలనుంచి బయటపడ్డారు.

"రాజావారు దీర్ఘాలోచనలో ఉన్నట్టున్నారు. ఏమైంది?" అని అడిగాడు కృష్ణశాస్త్రి. అప్పటికి ఎనిమిదిన్నర దాటింది సమయం.

ప్యాలెస్ అంతా విద్యుద్దీపాలకాంతులతో దేదీప్యమానంగా ప్రకాశిస్తోంది.

రాజా విష్ణుచంద్ర గజపతి మహదేవ్ పళని పీఠాధిపతి ఫోన్ చేసిన విషయం కృష్ణశాస్త్రితో చెప్పారు.

"ఇందుకు చింతపడనేల ప్రభూ! యువరాణీ వారికి త్వరలో వివాహం జరిపించుటే తరుణోపాయమని చెప్పటానికి వస్తూంటారు. వేరే కారణం కనిపించదు. ముందు చిరంజీవి సహనాదేవిని లండన్‌నుంచి పిలిపించి వరాన్వేషణ ఆరంభించండి..." అంటూ సూచించాడు కృష్ణశాస్త్రి. చాలాసేపు మౌనంగా ఉండిపోయారు రాజావారు.

ఢిల్లీ!

అది యమునా తీర ప్రాంతంలోని మారుమూలన మూతబడిన కర్మాగారం. చాలాకాలంగా పనిచేయటంలేదు. ఎటుచూసినా తుప్పుపట్టిన యంత్ర భాగాలు, ఒరిగిన షెడ్లు, పిచ్చిమొక్కలతో బీభత్సంగా ఉంటుందక్కడ. అటువంటిచోట -

సాయంత్రం ఐదుగంటల ప్రాంతంలో ఆగంతకులు కొందరు ఆ కర్మాగారం ఆవరణలోకి ప్రవేశింపసాగారు. అప్పటికే లోన ఒక షెడ్‌లో చెక్కబల్లను దులిపి దానిమీద కూర్చున్నాడు సాధూభాయ్. తన నెట్‌వర్క్‌తో ఇండియాలోనే స్మగ్లింగ్ కార్యకలాపాలుసాగిస్తున్న డ్రగ్ మాఫియా లీడర్.



వారంక్రితం కొలంబియా వెళ్ళి అక్కడ మాఫియాకింగ్ పాబ్లో ఎస్‌కోబార్ రహస్య సమావేశంలో పాల్గొన్నాడు. మరునాడే ఇండియాకు తిరుగు ప్రయాణమయ్యాడు.

సైంటిస్టు కార్తికేయను అంతం చేసే బాధ్యతను తీసుకుని బయలుదేరాడు. అమెరికాలో ఉండగానే ఇండియాలోని తన మనుషులకు ఫోన్‌లుచేసి కార్తికేయ జాడ తెలుసుకోమని హెచ్చరించాడు.

ఎలాగైనా కార్తికేయను కనిపెట్టి చంపి కొలంబియా మాఫియాకింగ్ మెప్పుపొందాలని పట్టుదలగాఉన్నాడు సాదూభాయ్. ఆ విషయంగానే ఇప్పుడా మూతబడిన కర్మాగారంలో రహస్య సమావేశం జరుగుతోంది.

ఇండియాలోని అన్ని రాష్ట్రాల నుంచి అతడి ప్రతినిధులు ఈ సమావేశానికి వస్తున్నారు. ఎలకలు పిల్లికి భయపడతాయి. పాములు ముంగిసకు భయపడతాయి.

అది జాతివైరం. అలాగే మాఫియా వర్గాలకు పోలీసులంటే భయం. సాధ్యమయినంతవరకు తమ జాడ పోలీసులకు తెలీకుండా జాగ్రత్తపడతారు. ఇలాంటి రహస్య ప్రదేశాల్లోనే సమావేశాలు జరుపుతారు.

అక్కడ కూర్చోడానికి కుర్చీలు లేవు. ఏది దొరికితే దాన్ని లాక్కుని దులిపి కూర్చుంటున్నారు.

"అంతా వచ్చినట్టేనా?" పక్కన నిలబడిన తన అసిస్టెంట్‌ని చూసి అడిగాడు సాధూభాయ్.

"ఎందుచేతో మన అసోం ప్రతినిధి ఇంకారాలేదు" బదులిచ్చాడు అసిస్టెంట్.

"నో ప్రాబ్లమ్" అంటూ లేచి నిలబడి ఓసారి తన ముందు హాజరయిన ప్రతినిధులవంక చూశాడు సాదూభాయ్. వచ్చినవాళ్ళు ఇరవయిమందికిపైగా ఉన్నారు. తమను రప్పించిన కారణమేంటో వాళ్ళ

E-mail: Suryadevaranovelist@gmail.com

సూర్యదేవర రామ్‌మోహనరావు



## (6) జరిగిన కథ

రాజా విష్ణుచంద్ర గజపతి మహదేవ్‌తో సంజూ కోపంగా మాట్లాడుతుంది. దీనితో ఆమె అనుచిత ప్రవర్తనకి రాజావారికి క్షమాపణలు చెపుతాడు కార్తికేయ.

సంజూ, నేను ప్రేమించుకుంటున్నామని, మీరే పెళ్ళి పెద్దగా వ్యవహరించి మా వివాహాన్ని జరిపించాలని రాజావారిని కోరతాడు కార్తికేయ. ఎంతో సంతోషంతో అంగీకరించిన రాజావారు 'నీ ప్రయోగాలు ఎంతవరకొచ్చాయి' అని కార్తికేయని అడుగుతాడు.

చివరి అంకానికి వచ్చామని, భూమిని శుద్ధి చేయటానికి అవసరమయ్యే ధనం, కావలసిన వస్తుసామాగ్రి, వసతి, మార్కెట్ వ్యూహాల గురించి రాజావారితో చర్చిస్తాడు కార్తికేయ.

కార్తికేయ ఎఫెక్ట్ ఆరంభమయితే స్మగ్లర్స్‌కి కలిగే నష్టం గురించి, కొలంబియా అడవుల్లో మాఫియా కింగ్ దాడుల్లో చనిపోయిన పోలీసుల గురించిన ప్రస్తావన రాజా, కార్తికేయ సంభాషణల్లో వస్తుంది. సంజూకి ప్యాలెస్‌ని చూపించమని సూర్యప్రకాశవర్మకి చెపుతాడు రాజావారు. ఇక జరిగేది చదవండి.

అందరికీ తెలుసు. కాని సమాధానంమాత్రం తమ దగ్గర లేదు. సైంటిస్ట్ కార్తికేయ ఆచూకీ ఇంతవరకు ఎవరికీ చిక్కలేదు.

"ఓకే! నేను ఎక్కువసేపు మాట్లాడను. మీ అందరికీ తెలుసు! ఇది మన బిజినెస్ సమావేశం కాదు. అలాగని మనం ఇక్కడ ఎక్కువసేపు ఉండటంకూడా సేఫ్ కాదు. సో... చీకటిపడకముందే మనం ఇక్కడి నుండి వెళ్ళిపోవాలి కాబట్టి నేరుగా విషయానికి వచ్చేస్తాను. మన టార్గెట్ సైంటిస్ట్ కార్తికేయ.

వాడు ఎవడో ఎక్కడ ఉంటాడో కనిపెట్టి అంతం చేయటం మన లక్ష్యం. చెప్పండి. మీలో ఎవరికైనా అతడి ఆచూకీ తెలిసిందా? ఎనీ ప్రోగ్రెస్?" అని అడిగాడు. ఒక్కడూ చేయి ఎత్తలేదు.

ముఖముఖాలు చూసుకున్నారు.

తమిళనాడు నుంచి వచ్చిన ఆళగిరి వంకచూశాడు సాదూభాయ్. అతను లేచి నిలబడి చెప్పాడు. "సారీ! మా స్టేట్‌లో కార్తికేయకోసం గల్లిగల్లీ వెతికారు మా కుర్రాళ్ళు. దొరకలేదు. అంటే వాడు ఖచ్చితంగా తమిళనాడులో లేడని తేలిపోయింది" అన్నాడు.

సాదూభాయ్ చాలా అసంతృప్తిగా అందరివంక చూశాడు. కళ్ళుమూసుకొని కాసేపు అటూ ఇటూ పచార్లు చేశాడు. అంతలో ఏదో గుర్తుకువచ్చి చటుక్కున ఆగి కళ్ళు తెరిచాడు.

"నాకు ఇప్పుడు అర్థమవుతోంది. సైంటిస్ట్ కార్తికేయ అసాధ్యుడు. భవిష్యత్తును ముందే ఊహించి తగు జాగ్రత్తలో ఉన్నాడు. తన ఉనికి, అడ్రసు ఎవరికీ తెలీకుండా చాలా జాగ్రత్తలు తీసుకున్నాడు. ఆఖరికి ఉత్తరాలు పోస్ట్ చేయటంలో కూడా.

## అమ్మో! పిల్లా!

'ఫిదా'తో రాత్రికి రాత్రి సూపర్ తార అయిపోయిన సాయిపల్లవిని కొన్ని ప్రాజెక్టులకు సంప్రదించినా రెండే రెండు తెలుగు సినిమాలకు, ఓ ద్విభాషా చిత్రానికి సంతకాలు చేసింది.

నాగ శౌర్య, నానీల సరసన నటిస్తూ, చిత్రబృందానికి చుక్కలు చూపిస్తూ, హీరోలు, టెక్నీషియన్ల సహనానికి పరీక్షలు పెడుతున్నది.

మిగతావాళ్ళంతా సెట్స్‌కు ఉదయం తొమ్మిదిన్నరకల్లా వచ్చేస్తుంటే ఈమెమాత్రం 11-12 గంటలకు కాని రాదు. సాయిపల్లవి ధోరణితో విసుగుచెందిన నాగశౌర్య తాను ప్రాజెక్టును వదిలేయాలన్నంత కోపం చూపాడట.

దర్శక, నిర్మాతలు ఆమె జాప్యం గురించి ఎందుకు ప్రశ్నించరని రుసరుసలాడాడు కూడానట. నానీకి కూడా చిరాకు తెప్పించిందని వినికిడి. అమ్మో! ఈ పిల్లలో చాలా ఉందే!



నాకు తెలిసి ఒకటి రెండు లెటర్లు ఢిల్లీ నుంచి పోస్ట్ చేయబడ్డాయి. మిగిలినవి ఎక్కువభాగం ఆంధ్రా ఒరిస్సాలకు చెందిన వేరువేరు ఊళ్ళనుంచి పోస్ట్ చేయబడ్డాయి. కాబట్టి ఖచ్చితంగా ఈ రెండు స్టేట్స్ లోనే ఎక్కడో ఉండాలి. అవునా?" అనడిగాడు.

"మీ డౌట్ కరెక్ట్ కావచ్చు. కాని మా కుర్రాళ్ళు ఇటు ఆంధ్ర అటు తెలంగాణ జిల్లాల్లో ప్రతి అంగుళం గాలించి వదిలారు. అయినా కార్తికేయ ఆచూకీ చిక్కలేదు. ఇంకెక్కడ ఉండే అవకాశం ఉంది?" అనడిగాడు ఆంధ్రానుంచి వచ్చిన కిట్టప్పనాయుడు.

"అవును... మా ఒరిస్సా స్టేట్‌లో పరిస్థితి కూడా అదే..." అన్నాడు ఒరిస్సా నుంచి వచ్చిన సురేష్ భండారీ.

"నోనో... వాడు ఖచ్చితంగా మీ స్టేట్స్‌లోనే ఎక్కడో రహస్యంగా ఉన్నాడు. మీరు మరింత శ్రద్ధపెట్టి గాలింపు ముమ్మరం చేయాలి. ఏదో క్లూ దొరక్కపోదు. మీకు సాయంగా ఇక్కడనుండి నా మనుషులు పదిమంది మీవెంట వస్తారు. కలిసి పనిచేయండి. కార్తికేయ ఎంతమాత్రం బ్రతకటానికి వీల్లేదు" అన్నాడు స్థిరంగా సాదూభాయ్.

ఆ విధంగా కార్తికేయను కనిపెట్టి అంతంచేసే బాధ్యత కిట్టప్పనాయుడు, సురేష్ భండారీల మీద పడింది. ఆ సమావేశం కేవలం ఒక్క గంట మాత్రమే జరిగింది. తర్వాత చీకటిపడకముందే ఎలా వచ్చారో అలాగే అక్కడినుంచి అంతా డిస్పర్స్ అయ్యారు.

పళని ఆశ్రమం నుంచి ఇద్దరు శిష్యులను వెంటబెట్టుకుని బయలుదేరారు స్వామి సత్యానంద. వారు ఫ్లైట్‌లో భువనేశ్వర్ చేరుకునేసరికి చీకటిపడింది.

రాత్రికి భువనేశ్వర్‌లోనే ఒక శిష్యుడి ఇంట బస చేశారు. మరునాడు స్నానాలు, పూజలు, జపతపాదులు ముగించుకుని రోడ్డు మార్గంగా కార్లో బయలుదేరారు. ఆ విధంగా గురుశిష్యులు పర్లాకిమిడి ప్యాలెస్‌కు చేరుకునేసరికి భోజనం వేళయింది.

భోజనంచేసి విశ్రాంతి తీసుకున్న పిమ్మట సరిగ్గా సాయంత్రం నాలుగు గంటలకి అంతరంగిక మందిరంలో రాజావారితో సమావేశమయ్యారు సత్యానంద స్వామి. అక్కడ రాజా విష్ణుచంద్ర గజపతి మహదేవ్‌తోపాటు రాజగురువు కృష్ణశాస్త్రి, సత్యానంద స్వామీజీ ముగ్గురే ఉన్నారు.

తన శిష్యుల్ని బయటే ఉంచాడు స్వామీజీ.

స్వామి వయసు అరవై సంవత్సరాలు ఉండొచ్చు. కాని పొడవాటి గెడ్డంలోగాని ముడివేసిన జుట్టులోగాని ఎక్కడా ఒక్క తెల్లవెంట్రుక కూడా కన్పించదు. చామనఛాయ రంగు ఆరు అడుగుల పొడవు మనిషి. నిత్యం చేసే యోగాసనాలు, సిద్ధయోగాల కారణంగా చక్కటి షేప్‌తో దృఢగాత్రుడు. పొడవాటి గ్రద్దముక్కు, కనుగుడ్లు పెద్దగా ఉంటాయి.

తీక్షణమైన చూపులు. ఆయన శాంతంగా ఉన్నా అందుకే ఎవరూ సూటిగా ఆయన కళ్ళలోకి చూడలేరు. సాధారణంగా పెద్ద పెద్ద కన్నులు ఉన్నవారు దృఢచిత్తులు అయివుంటారు... ఎంత సేపూ ఎదుటివార్ని చదవటమే గాని తమ మనసులో మాట ఆవగింజంత కూడా తెలుసుకునే అవకాశం ఇవ్వరు.



కాషాయ పంచెను లుంగీలాగా కట్టుకున్నాడు. భుజాన ఒక కాషాయ తుండు ఉంది. మెడలో రుద్రాక్షలు, నుదుట విభూది రేఖలు. అంతే అంతకుమించి కాళ్ళకు చెప్పులు కూడా ధరించే అలవాటు స్వామీజీకి లేదు. సమావేశం కాసేపు మౌనంగానే గడిచింది.

రాజమందిరాన్ని ఎ.సి. గదులు చల్లబరుస్తున్నా రాజావారి నుదుట స్వేదం అలుముకుంటోంది.

స్వామీజీ చెప్పబోయే విషయం ఏమిటో తెలీక అంతరంగం కలవరపడుతోంది. ఇది తమ గారాలపట్టి భవిష్యత్తుకు సంబంధించిన విషయం.

కృష్ణశాస్త్రిగారు చెప్పిందే చెప్తారా లేక కొత్త విషయం ఏమన్నా ఉందా? ఏం వినాల్సివస్తుందోనని ఆందోళనగా ఉంది. పీఠం వదిలి ఎప్పుడోగాని బయటకు రాని స్వామీజీ ఇలా శిష్య సమేతంగా తరలిరావటం సాధారణ విషయం కాదు. అందుకే రాజావారు మౌనం వహించి కూర్చున్నారు.

ఇక రాజగురువు కృష్ణశాస్త్రికి ఈ సమావేశం ఏమంత ప్రాముఖ్యంగా తోచటంలేదు. జ్యోతిష శాస్త్రాన్ని ఔపోసనపట్టిన ఉద్దండ పండితుడు తను. యువరాణి భవిష్యత్తు గురించి తను చెప్పిన విశేషాలకు మించి స్వామీజీ చెప్పేది ఏమీవుండదని భావిస్తున్నాడాయన. కాబట్టి అడగటం దేనికి తనే చెప్తాడనుకుని ఆయనా మౌనముద్ర వహించాడు.

స్వామీజీ మరోలా ఆలోచిస్తున్నారు.

యువరాణి గండంగడిచే తరుణోపాయంగురించి కృష్ణశాస్త్రి ఏం చెప్పాడో తెల్సుకోకుండా, తనే ముందు బయటపడటం కరెక్ట్ కాదేమోనన్న సందేహం ఆయనది. అందుకే తనూ మౌనం వహించాడు.

ఈ పరిస్థితిలో చీమ చిటుక్కుమన్నా విన్పించేంత నిశ్శబ్దం ఆ మందిరంలో నెలకొనివుంది. ఎట్టకేలకు రాజగురువు కృష్ణశాస్త్రే ముందుగా కల్పించుకొంటూ ఆ నిశ్శబ్దాన్ని భగ్నం చేశాడు-

"స్వామీ...! మీ సందేహం ఏమిటో వినాలని రాజావారితోపాటు నేనూ ఎదురుచూస్తున్నాను. సెలవీయండి" అని అడిగాడు.

"నాకు తెలుసు. నేను చెప్పబోయే విషయం ఏమైవుంటుందని మీరు ఆలోచిస్తున్నారు. ఇందులో కలతపడాల్సింది ఏమీలేదు..." అని అంటూ ఆగాడు స్వామి సత్యానంద. మౌనంగా వింటున్నారు రాజావారు, రాజగురువు కృష్ణశాస్త్రి ఇరువురూ.

తిరిగి చెప్పనారంభించారు స్వామీజీ. "ఎప్పుడో ఊహ తెలీని వయసులో చిరంజీవి సహనాదేవిని లండన్ తీసుకెళ్ళారు. ఆ అమ్మాయి అక్కడే పెరిగి

మిగిలినవి ఏవైనా ఇతరులు పంచుకోగలరు. కాని శారీరక బాధని ఎవరూ పంచుకోలేరు. అందుకే ఆరోగ్యంపట్ల అందరూ శ్రద్ధ వహించాలి.

*-శ్రీశ్రీ రవిశంకర్, ఆర్ట్ ఆఫ్ లివింగ్ గురు*

పెద్దదైంది. ఎలా ఉంటుందో కూడా ఎవరికీ ఇక్కడ తెలీదు. సొంతగడ్డ తమ సంస్థానం, ఈ ప్యాలెస్ ఇవన్నీ ఎలా ఉంటాయో కూడా ఆమెకు తెలీవు.

యువరాణి భవిష్యత్తుగురించి మీరు ఎన్నో జాగ్ర త్తలు తీసుకున్నారు. ఇందుకు మిమ్మల్ని అభినం దించాల్సిందే. కాని ఈసారైనా మీ కుమార్తెను వెంట నిడుకొని రావలసింది. ఎందుకంటే- యువరాణికి ఇరవైనాలుగు పూర్తయి ఇరవై అయిదో ఏట అడుగు పెట్టనుంది. అసలు సమస్య ఇక్కడే ఉంది. కృష్ణ శాస్త్రిగారు చెప్పే ఉంటారు.

సహనాదేవికి ప్రాణగండం తప్పాలంటే ఆమెకు ఇరవై అయిదో సంవత్సరం రాకముందే తగిన వరు నితో వివాహం జరిపించాలి. అలాచేస్తే వరుని జాతక బలం శ్రీచక్రంలా అడ్డంబడి ఆమెను ప్రాణగండం నుంచి రక్షిస్తుంది. సమస్యకు ఇదొక్కటే తరుణో పాయం. అవునా?" అంటూ రాజగురువు కృష్ణశాస్త్రి వంక చూశాడు స్వామి సత్యానంద.

అవునన్నట్టు తలూపాడు కృష్ణశాస్త్రి-

"అవును స్వామీ... నేను ఇచ్చిన సలహా కూడా అదే" అన్నాడు.

"మీరు రాజగురువులు. జ్యోతిష్యశాస్త్రంలో మహా పండితులు. మీకు తెలీని విషయం వుండదు. మీ సలహా సముచితంగానే ఉంది. దివ్యమయిన యోగం గల మహర్జాతకుడిని వెతికి తెచ్చి యువరాణీవారి వివాహం జరిపించవచ్చు. కాని ఇక్కడే మరో మెలిక ఉంది. జటిల సమస్య ఉంది. ఆ విషయం చెప్పారా?" అని అడిగాడు స్వామి సత్యానంద.

ఆ ప్రశ్న కృష్ణశాస్త్రికి మింగుడుపడలేదు. వేరే సమస్యా! ఏమిటది? ఆరూఢంవేసి యువరాణి జాత కంలో రానున్న నాలుగు మాసాల గ్రహస్థితులను ఫలితాలను క్షుణ్ణంగా అధ్యయనం చేశాడే తన దృష్టికి రాని మరో సమస్య సత్యానందస్వామికి కన్పిం చిందా. అది ఏమైవుంటుంది?

"మీరు ఏమంటున్నారో నాకు అర్థంకాలేదు" అన్నాడు చివరికి.

"మీకు అర్థమయిఉండాలి. అర్థంకాలేదంటే ఈ విషయం మీ దృష్టికి రాలేదనుకుంటాను..." అంటూ రాజావారి వంక చూశాడు సత్యానందస్వామి.

"ప్రభూ! పర్లాకిమిడి సంస్థానాధీశులయిన మీకు మా గురించి తెలీని విషయంలేదు. మూడుతరాలుగా మీ వంశీకులు మా కుమార శక్తిపీఠాన్ని నమ్మి కొలిచిన భక్తులు. పీఠానికి భూరివిరాళాలిచ్చి ఎంతో అభివృద్ధి చేశారు. ఆ విధంగా ఈ సంస్థానంతో మాకు వున్న అనుబంధం వర్ణింపరానిది.

ఆ షణ్ముఖుని కరుణాదృష్టితో మీరు, మీ సంస్థానం మీ వంశం సుఖసంతోషాలతో వర్ధిల్లాలి అని కోరుకునేవారిలో మేం ప్రథము లం..." అంటూ క్షణం చెప్పడం ఆపాడు స్వామి సత్యానంద.

"మాకు తెలుసు స్వామీ. కష్ట



కాలంలో మీకన్నా మాకు ఆప్తులు ఎవరు? మీరేం చెప్తారోనని అంతరంగం తత్తరిల్లుతోంది. ఏం జరగ నుంది? అది చెప్పండి" అన్నారు రాజా విష్ణుచంద్ర గజపతి మహదేవ్ ఆత్రుతగా.

"అక్కడికే వస్తున్నాను ప్రభూ... కాదంటే ఎలా వివరించాలో తెలీకున్నది. ఈ సందర్భంగా మీకో ఉపమానం చెప్తాను వినండి. గాంధారి ధృతరాష్ట్రుని భార్య. మహాపతివ్రత. గాంధార దేశ యువరాణి.

ఆమె కన్యగా ఉన్నప్పుడు జాతకంచూసిన జ్యోతిష్య పండితులు ఆమెకు వైధవ్యయోగం ఉందని చెప్పారు. పెళ్ళయితే భర్త మరణిస్తాడు. ఏంచేయాలి? దోషనివా రణార్థం పండితులు ఒక తంత్రం సూచించారు.

దాని ప్రకారం ఆమెను ముందుగా ఒక మేకపోతు కిచ్చి పెళ్ళి జరిపించారు. ఆ వెంటనే మేకను చంపే శారు. ఆ విధంగా తొలి భర్త మరణించినట్టయింది. పిమ్మట ఆమెను ధృతరాష్ట్రునికి ఇచ్చి వివాహం జరి పించారు" అనిచెప్పి మౌనం వహించాడు స్వామీజీ.

"అంటే... యువరాణీవారి జాత కంలో వైధవ్యయోగం ఉందనా మీరు చెప్పేది...?" అని వెంటనే ప్రశ్నిం

## 'సీత' అనే పిలిచారు

బాపుగారి సినిమాల్లో హీరోయిన్లమాదిరి సీత రామునికోసం' సినిమాలో తను కనిపిస్తానంటూ చెప్పుకుని తెగ మురిసిపోతున్నది కారుణ్య.

"ఈ సినిమాకంటే ముందు నేను కొన్ని సిని మాలు చేసినప్పటికీ అవి ప్రేక్షకులకు రీచ్ అవ లేదు. ఇప్పుడుమాత్రం ఖచ్చితంగా ప్రేక్షకులకు దగ్గరవుతానన్న నమ్మకం ఉంది. సెట్స్‌లో నన్నం దరూ 'సీత' అనే పిలిచేవారు.

సౌందర్యమాదిరి చేశావంటూ యూనిట్‌సభ్యులు ప్రశంసించారు. ప్రస్తుతం కొన్ని చిత్రాల్లో అవ కాశాలు వస్తున్నాయి" అంటూ పసపిట్టలా కబుర్లు చెబుతూ స్వంతడబ్బా మోగించింది.

చాడు రాజగురువు కృష్ణశాస్త్రి.

"ఉంది" అన్నాడు స్థిరంగా సత్యానందస్వామి.

ఆ మాటలు విని నిర్ఘాంతపోయారు రాజా విష్ణు చంద్ర గజపతి మహదేవ్. ఆయన చింతాక్రాంతు డయ్యాడు. పాదాలుక్రింద నేల చీలుకుపోతున్నట్టని పించింది. అందాలభరిణె తన కుమార్తెకు వైధవ్య యోగమా. హతవిధీ ఏమిటీ ఘోరం. ఆయన అంత రంగం తల్లడిల్లుతోంది. నోటమాట రావటంలేదు.

"స్వామీ! మీరేదో పొరపాటుపడినట్టున్నారు. యువరాణి వారి జాతకం మొత్తం గాలించి చూసినా ఎక్కడా అలాంటి సూచన కన్పించలేదు" అడుగు తున్నాడు రాజగురువు కృష్ణశాస్త్రి.

"ఉంది శాస్త్రిగారూ" స్థిరంగా బదులిచ్చాడు సత్యానందస్వామి.

"యువరాణీవారి జన్మతార మఖానక్షత్రం.

నాలుగవ పాదంలో జన్మించారు. సింహరాశి. అందుకే మేఘనా సౌందర్యానంద సహనాదేవిగా నామకరణం చేయడమయినది.

రవి సింహరాశికిఅధిపతి. మేషరాశిలో రవికి ఉచ్చ స్థితి, తులారాశిలో నీచస్థితి, ప్రస్తుతం ఉన్న కాలంలో రవి నీచగతుడవుతున్నాడు. ఆపైన తుల చరరాశి రవి స్థిరంగా ఉండడు. ఏదో నష్టం చూపిస్తాడు.

ఎందుకంటే రవి పాపగ్రహం.

స్మరే కేశ నియుక్తే భూమిపుత్రేణ వీక్షితే ।
చంద్ర రాహుయితే రంధ్రే
యోగో వైధవ్య సంజ్ఞకః॥

అని శాస్త్రం అంటే-సప్తమాధిపతి శనితోగూడి కుజవీక్షితుడగుచూ ఆరింట చంద్రరాహు వులు చేరియుండిన ఆ స్త్రీకి వైధవ్యం తప్పదు. అనర్థం... త్వరలో యువ రాణికి ఇదే యోగం సంప్రాప్తించ నుంది. దీన్ని నివారించకుండా వివాహం జరిపిస్తే వరునికి మరణ గండం తప్పదు. మీకు అర్థమయివుం టుందనుకుంటాను. ముందు నుయ్యి వెనక గొయ్యి అంటే ఇదే. చూడండి!

ఆర్మీ విద్యాసంస్థల్లో చదివే పిల్లలు ఇస్లామ్‌కి దూరమయ్యే ప్రమాదముంది. వారిని ఆర్మీ స్కూల్స్‌కి పంపవద్దు.
-సయ్యద్ షా గిలానీ, హురియత్ నేత



## చిలిపి



**మిమ్మల్నెక్కడో చూసినట్టుగా ఉందండీ?**
వెర్రినాయనా! అద్దంలో చూస్తుంటావుగా!

**అగస్త్యుడు సముద్రం మొత్తం తాగేశాట్ట!**
పాపం, రాయలసీమ నుంచి వచ్చుంటాడు.

**విజాన్ని నిర్మొహమాటంగా చెప్పే ఏకైక వస్తువు?**
అద్దం.

**ఇప్పటి ప్రజలకు ఏ భావాలు అధికమయినాయి?**
అహంభావాలు.

**ఇంధనం లేకుండా తిరిగే చక్రమేది?**
కాలచక్రం

**తెలుగు సినిమాల్లో మనం చూడని సీను?**
హీరో తల దువ్వుకోవటం.

**దొంగలకు బేడీలెందుకు వేస్తారు?**
పోలీసుల జేబులు కొట్టకుండా!

**పురుషుల్లో భక్తి పెరగాలంటే?**
గుళ్ళల్లో 'పూజారిణు'లను నియమించటమే!

**లంచంమీద మీ అభిప్రాయమేమిటి?**
ఏమీ ఇవ్వకుండానే ఎలా చెప్పమంటారు.

ఈ నాలుగు మాసాలు ఆగి ఆమె ఇరవై ఐదో ఏట పెండ్లిజరిపిస్తే-ఈవైధవ్యయోగంతప్పిపోతుంది. కాని ఇరవై అయిదులోనే ఆమెకు మరణగండం ఉంది.

అలాగని ఈ లోపలే వివాహం జరిపేస్తే వరుడు ఎంత మహార్జాతకుడయినా అకాల మరణం పొందక తప్పదు. కాబట్టి ఏవిధంగా చూసినా ఈ వైధవ్య యోగాన్ని తప్పించకుండా వివాహం చేయలేం. శాస్త్రం ఒప్పదు..." అంటూ తన వాదాన్ని బలంగా వివరించారు స్వామి సత్యానంద.

ఈ విషయంగా కృష్ణశాస్త్రి, స్వామి సత్యానందలమధ్య కొద్దిసేపు తర్కం వాదోపవాదాలు చెలరేగాయి. వింటున్న రాజా విష్ణుచంద్ర గజపతి మహదేవ్‌కు ఏమీ పాలుపోలేదు.

ఇద్దరూ కావలసినవారే. తమ యోగ క్షేమాలు కోరేవారే. ఎవరినీ కాదనలేరు. అలాగని తనకు జ్యోతిష్యశాస్త్రంలో అనుభవమూ లేదు. కాబట్టి ఎవర్నీ నొప్పించకుండా మధ్యేమార్గంగా సమస్యను పరిష్కరించాలి అని భావించి తను కలుగజేసుకుంటూ- "చాలు... ఇక ఈ వాదనలు ఆపేద్దాం" అని అన్నారు.

"ఇది జ్యోతిషశాస్త్ర చర్చావేదిక కాదుగాబట్టి ఇంతటితో ఆపేయండి..." అని అంటూ రాజగురువు కృష్ణశాస్త్రివంక చూశారు. "గురువర్యా! మీ పరిశీలనలో మా తనయకు వైధవ్యయోగం లేదు అంటారు అంతేగా?" అని అడిగాడు.

"అవును ప్రభూ. లేదు" అన్నాడు కృష్ణశాస్త్రి.

"ఓకే...! లేనిదానిగురించి ఆలోచన అనవసరం గదా. ఇక మీకు అప్పగించిన పనులు పూర్తిచేయండి. ముఖ్యంగా అమ్మాయి పేరిట మహామృత్యుంజయ యాగం మీ చేతులమీదుగా జరగాలి.

మంచిముహూర్తం చూడండి. లండన్‌నుంచి మా కుమార్తెను రప్పించే ఏర్పాట్లు చేద్దాం. మనం రేపు మరోసారి కలిసి చర్చిద్దాం. ఇకమీరు బయలుదేరండి" అన్నారు.

ఎవరినీ కాదనలేక రాజావారు ఈ విధమయిన నిర్ణయం తీసుకున్నారని కృష్ణశాస్త్రికి అర్థమైంది. ఇంకేం మాట్లాడకుండా "చిత్తం" అంటూ లేచి అక్కడినుండి నిష్క్రమించారాయన.

"ఇప్పుడు చెప్పండి స్వామీ! మీరు మా ప్రియపుత్రికకు వైధవ్యయోగం వుందంటారు. ఆ విషయంగా తర్కం అక్కర్లేదు. ఇప్పుడు మన ముందున్న సమస్య ఆ దుష్టయోగాన్ని తప్పించటం ఎలా? ఏం చేద్దాం అది చెప్పండి" కృష్ణశాస్త్రి నిష్క్రమించాక అడిగారు రాజా విష్ణుచంద్ర గజపతి మహదేవ్.

స్వామి సత్యానంద ఏంచేయాలో వివరించనారంభించారు. ఇక్కడ యువరాణి జాతకాన్ని ఇద్దరు మహా జ్యోతిష పండితులు వడపోసి వేరువేరు ఫలితాలు చెప్పారు. ఎవరు చెప్పింది కరెక్ట్ అంటే సమాధానం లేదు. అది కాలమే నిర్ణయించాలి.

ఆ రోజు కార్తికేయ ల్యాబ్‌నుంచి బయటకు రావలసొచ్చింది. ఇది బొబ్బిలి వెళ్ళొచ్చిన వారంరోజుల తర్వాతి సంగతి. ఒక్కడే బయలుదేరి రాయగడ్ వెళ్ళి పనిముగించుకుని వెనక్కి పర్లాకిమిడి చేరుకునేసరికే చీకటిపడింది.

సాయంకాలమే వాతావరణం మారింది. ఆకాశం మేఘావృతమై ఈదురుగాలులు ఆరంభించాయి. వర్షంపడే సూచనలున్నాయి. ఆ టైమ్‌లో అడవి దారుల్లోంచి ల్యాబ్‌కి చేరుకోలేడు.

రాత్రికి పర్లాకిమిడిలోనే స్టే చేద్దామని వ్యాన్‌ను తమ ఇంటిదిశగా పోనిస్తున్నాడు. ఈసారి వెంట సంజనా లేదు. ఆమె ల్యాబ్‌లోనే ఉంది. సాయంకాలం నుంచే ప్రతి అరగంటకోసారి ఆమె ఫోన్ చేస్తోంది.

అడవిలో సెల్ టవర్లు ఉండవుగాబట్టి అక్కడ మామూలు ఫోన్లు పనిచేయవు. అందుకే వెంట శాటిలైట్ ఫోన్ తీసుకువస్తాడు. ఇప్పుడు సంజనా ఫోన్ చేస్తోంది ఆ ఫోన్‌కే.

"సంజూ డియర్! ఇప్పుడే పర్లాకిమిడిలోకి ఎంటరయ్యాను. వాతావరణం బాగాలేదు. రాత్రికి రావటం లేదు. డోన్ట్‌వర్రీ! ఇంటికి చేరాక ఫోన్ చేస్తాను" చెప్పాడు కార్తికేయ. "అర్ధగంటాగి నేనే ఫోన్‌చేస్తాలే" అంది అవతలినుంచి సంజనా.

"నేను చేస్తానంటున్నాగా"

"ఆడపిల్లను బాబూ. మనసాగుతుందా. మాకున్న ఆతృత మీకు వుండదుగదా నేనే చేస్తాలే. టేక్కేర్" అంటూ లైన్ కట్ చేసింది సంజనా.

నవ్వుకుంటూ వ్యాన్ వేగంపెంచాడు కార్తికేయ. అంతలో చిటపటచినుకులతోవర్షం కూడా మొదలైంది.అప్పటికే రాత్రి ఏడుగంటలు దాటిందిసమయం.

చూస్తుండగానే పర్లాకిమిడి వీధులు జలమయం అవుతున్నాయి.

వీధిలైట్లకింద వర్షం నీరు మెరుస్తోంది. హెడ్‌లైట్ల కాంతిలో సూదుల్లాగా జారుతున్న వాననీటి జల్లు వింత అనుభూతిని ఇస్తోంది. చలిగాలి జివ్వున వీస్తోంది.



ఫేస్‌బుక్ కాస్తా... వాడేవారి సంఖ్య పెరగటంతో ఫేక్‌బుక్‌గా మారింది. అందులో తప్పుడు సమాచారం పెరుగుతోంది.
-చామత్, ఫేస్‌బుక్ మాజీ వైస్ ప్రెసిడెంట్

**ఇంకా ఉంది**



పర్సనల్ ఎజెండా

# సయామీఖేర్

మీర్జ్యా తార సయామీఖేర్. ఈ చిత్రం తన ప్రతిభను ప్రదర్శించడానికి పెద్ద ప్లాట్ ఫారమ్ అయిందని చెప్పింది. ఈ సంగతిని పదేపదే పలు సందర్భాల్లో చెప్పుకుంటుంది. ఇక బాలీవుడ్‌లో మనుగడ అనేది మరో కథ అనేది ఆమె అభిప్రాయం. ఆమె వ్యక్తిగత అభిప్రాయాల్లోకి వెళ్తే...

▸ **చిత్రపరిశ్రమలో:** గ్లామర్‌కు మించి ఎంతో క్లిష్టత కలిగివుంది.ఇక్కడకు ఓసారి చేరితే అలా అలా కదలి పోతుంటాం- అంతే

▸ **ఏదో ఒకనాడు :** ప్రశంసల జల్లు కురుస్తుంది. ప్రత్యేకమైన గుర్తింపు వస్తుంది. లేదంటే ఎవరికివారు పరిరక్షించుకుంటూ సాగిపోతుండాలి

▸ **వివాహ వ్యవస్థపట్ల:** సంప్రదాయపూర్వక విశ్వాసం ఉంది. నిజమైన జీవిత భాగస్వామి అవసరం

▸ **ప్రస్తుతం నా ఎజెండాలో :** పెళ్ళి లేదు

▸ **పరిశ్రమలోనాకు:** కొద్దిమంది స్నేహితులున్నారు. సామాజికంగా అందరినీ కలుసుకుంటుంటా. కాని నా స్నేహితులందరూ విభిన్న రంగాలకు చెందినవారు. వీళ్ళంతా జయాపజయాలతో నిమిత్తం లేకుండా నాకు తోడుగా ఉండేవారు.

నన్ను నేను పరిశోధించుకోవడానికి వీళ్ళుతోడ్పడు తుంటారు. వీరు ఇచ్చే సలహాలు నా ఎదుగుదలకు ఎంతో దోహదపడతాయని నేను నమ్ముతాను.ప్రతి ఒక్కరికీ నాపై ఎంతో ప్రేమ, అభిమానం. ఇలాంటి స్నేహితులు నాకు ఉండటం నా అదృష్టం

▸ **క్రీడలపట్ల నా ఇష్టాన్ని :** సినిమా కమిట్‌మెంట్స్‌తో నిమిత్తం లేకుండా కొనసాగిస్తుంటా.

గత ఏడాది మారథాన్ చేశాను. ఆదివారాలు నా గ్యాంగ్‌తో కలిసి క్రికెట్ ఆడుతుంటాను. ఆదివారం కోసం ఆ వారమంతా ఎదురుచూస్తుంటాను. క్రికెట్ ఆట అంటే నాకెంతో ఇష్టం

▸ **లక్ష్యాలు నిర్దేశించుకోవడానికి :** క్రీడలు నాకు ఎంతో స్ఫూర్తి ఇస్తుంటాయి. ఇంకా చెప్పాలంటే రన్నింగ్ నాకు మెడిటేషన్ వంటిది

▸ **నాకు ఎదురయ్యే సవాళ్ళను అధిగమించడంలో:** క్రీడలు నాకో మెకానిజంలాంటివి. చదువుకునే రోజుల్లోనైతం అంతే. బాడ్మింటన్ నుంచి క్రికెట్‌దాకా ఎన్నో ఆటలు ఆడేదాన్ని

▸ **కాలేజీ రోజుల్లో :** థియేటర్‌ను బాగా ఎంజాయ్ చేసేదాన్ని. తదుపరి ఢిల్లీలో శిక్షణ తీసుకున్నాను

▸ **నాకు అతిపెద్ద స్ఫూర్తి :** సచిన్ టెండూల్కర్. నాకు ఎనిమిదేళ్ళ వయస్సునుంచి అతని పనిని ఫాలో అవుతున్నాను. ఆయన నాకు ఒక్కరికే కాదు అనేకమందికి ఆయన ఒక ట్రెండ్ సెట్టర్

▸ **సోషల్ మీడియా :** నటీనటులకు తమ విషయాలను అభిమానులతో పంచుకోవడానికి గొప్ప వేదికగా వుంది. దాన్ని సద్వినియోగం చేసుకోవాలేగాని దుర్వినియోగం చేసుకోకూడదు

▸ **బాలీవుడ్ ఎక్స్‌పోజర్ :** తక్కువ సమయంలోనే ఎక్కువ అనుభవాలు ఇవ్వగలదు.

నేను నాకు ఇరవై నాలుగు సంవత్సరాల వయస్సులో తొలి సినిమా చేశాను

▸ **ఇక్కడ సెలబ్రిటీల జీవితం :** అనూహ్యంగా ప్రతి శుక్రవారం మారిపోతుంటుంది

▸ **సినీ ప్రపంచానికి :** నేను, నా సోదరి దూరంగా పెరిగాము. సరస్సులు, పర్వతాలు చుట్టూగల చిన్న నగరం అయిన నాసిక్‌లో పెరిగాము. నాకు పదకొండు సంవత్సరాల వయస్సులో కాని మొదటి సినిమా చూసేందుకు అనుమతి లభించలేదు

▸ **మా ఇంట్లో మా అమ్మ :** మిస్ ఇండియా కాదు, ఆమె ఒక మదర్ ఇండియా

▸ **కెమెరా ముందుంటే :** చాలా సంతోషంగా వుంటుంది. థియేటర్ ఇందుకు సరైన శిక్షణ ఇచ్చింది. తొలి దక్షిణాది చిత్రం బాలీవుడ్‌లో చేయడానికి ఈ శిక్షణ ఎంతగానో తోడ్పడింది

▸ **నా ఐడియల్ పురుషుడు :** ఏదో ఒకనాడు యువరాజు గుర్రంపై వచ్చి తీసుకువెళ్తాడనే సిద్ధాంతాలను నేను అంతగా విశ్వసించను. నా ఆలోచనలు ఎప్పుడూ సగటు స్థాయిలోనే వుంటాయి. ఏ స్థాయికి వెళ్ళినా నేను సాధారణ యువతినే



# China

China is the country with the most people in the world. Over a billion people live here!



## Silk Road

3000 years ago,traders travelled to China along the Silk Road. They brought gold, ivory, glass and precious stones to exchange for Chinese silk, jade and fur.

The Chinese believe jade keeps bad luck away. Some emperors were even buried in whole suits of jade!

## jade suit

## bamboo shoot



Pandas are big but gentle animals. They live in bamboo forests and eat bamboo shoots and leaves.

## panda



## Shaolin monk

Shaolin monks are very good at kung fu. Many of them start training at 6 years old!



## Confucius

2500 years ago, Confucius wrote about how to rule a country. People still study his books today.

In Chinese opera, performers sing and act out a story. Cymbals and drums make the story lively and very noisy!



## Chinese opera

The Chinese drink tea and eat noodles using chopsticks. Not everyone can eat with chopsticks! Can you?



## tea



## noodles

## chopsticks



## Hong Kong



Hong Kong is a busy, crowded city in China. People here move, walk and talk very fast!

Long ago, the emperor lived in the Forbidden City. He was not allowed to go out, and common people could not come in. The city wall is 10 metres high!

The Qin Emperor built the Great Wall to keep enemies out. He also had 7000 terracotta soldiers made to guard his tomb after he died.

**Forbidden City**

Look! It's the Chinese New Year lion dance and dragon dance! Watch the lions fight to get the red packet!

**Great Wall**

**terracotta soldiers**

During Chinese New Year, children get red packets with money in them for good luck.

**dragon dance**

**lion dance**

**red packets**

Marshall Cavendish Education

# స్టార్ టీమ్

కొన్నిరకాల ఆహారపదార్థాలను కలిపితింటే రుచిగా వుంటాయి.అంతేకాదు- ఆరోగ్య దాయకం కూడా. ఉదాహరణకు రోజుకో యాపిల్ తింటుంటే వైద్యునికి దూరంగా ఉండవచ్చునేది ఏనాటినుంచోగల అభిప్రాయం.

దానికి డార్క్ చాక్లెట్ జతచేస్తే మరింత ప్రయోజనకరమవుతుంది. యాపిల్స్‌లోని క్వెర్సెటిన్, చాక్లెట్లలోని కెటాచిన్లు కలిసి గుండెను పరిరక్షిస్తుంటాయి. ఈ రెండూ ఇటురుచినీ, అటు ఆరోగ్యాన్నీ ఇస్తాయన్నమాట.

రెండు లేదా అంతకంటే ఎక్కువ జత కుదిరే పదార్థాలనుకలిపి తినడంవల్ల విడివిడిగా తినడం కంటే ఎక్కువగా ప్రయోజనం కలుగుతుందనేది ఆయుర్వేదంలో ప్రాచీనకాలంనుంచి ఉంది.

తాజా పరిశోధనలు, అధ్యయనాలు ఈ ప్రాచీనసూత్రాన్ని బలపరుస్తున్నాయి.ఒక్కో పదార్థాన్ని విడిగా తినడంతో పోల్చితే, ఇలా కలిపి తినడంవల్ల మరిన్నిపోషకాలుదక్కుతాయి.

రుగ్మతలనివారణలో సప్లిమెంట్లకంటేపూర్తిస్థాయి పదార్థాలే ఎక్కువగా మేలుచేస్తాయన్నది నిర్వివాదాంశం. కాబట్టి, రోజంతా తినే ఆహారాన్ని మరింత జాగ్రత్తగా, పోషక భరితంగా, సరైన కాంబినేషన్‌తో కొనసాగించాలి.



## ❖ సరైన కాంబినేషన్

ముఖ్యంగా ప్రతిరోజూ తినే పదార్థాల్లో ఏవి జతచేయాలన్న అవగాహన చాలా అవసరం.

**రోటీ, పెరుగు :** పూర్తిస్థాయి ధాన్యంతో తయారుచేసుకునే రోటీలకు పెరుగు కలిపిన కూర కాని లేదా రైతా కాని జతచేస్తే, ధాన్యాల్లోని జింకును శరీరం త్వరితంగా గ్రహిస్తుంది.

**పసుపు-మిరియాలపొడి :** పసుపులో 'కర్క్యుమిన్' అనే యాంటీఆక్సిడెంట్ వుంటుంది. ఇది కొన్నిరకాల క్యాన్సర్ల రిస్కును తగ్గించగలదు.

అల్జీమర్స్ వ్యాధినుంచి కూడా పరిరక్షించే గుణం కలిగివుంటుంది. మిరియాలపొడిని జతచేయడంవల్ల కర్క్యుమిన్‌ను గ్రహించే శక్తి పెరుగుతుంది. దానిలోని తేలికపాటి హీట్ మిరపలోని క్యాప్సిసిన్ వంటివి ఇంటర్నల్ మెంబ్రన్స్‌ను చికాకుపెట్టవు.

**పీనట్ బటర్, హోల్‌వీట్ బ్రెడ్ :** పీనట్ బటర్ అనేది న్యూట్రీషనల్ పవర్ హౌస్.దీనిని పూర్తిస్థాయి గోధుమ బ్రెడ్‌తో జతపరిస్తే శరీరానికి సక్రమరీతిలో ఎమినోయాసిడ్స్ అందుతాయి. శరీరం ప్రొటీన్లను గ్రహిస్తున్నప్పుడు, అదే సమయంలో ఎమినోయాసిడ్స్ అవసరంఅవుతాయి.గోధుమలో కొన్ని ఎమినోయాసిడ్స్ లభించవు. అవి పీనట్స్‌లో లభిస్తాయి. ఈ రెండూ కలిస్తే సంపూర్ణంగా వుంటాయి.



Courtesy : HEALTH & NUTRITION

**డ్రెస్సింగ్‌తో సలాడ్ :** పూర్తి లేదా తక్కువ ఫ్యాట్ డ్రెస్సింగ్‌లతో సలాడ్లు తినేవారికి వయస్సురీత్యాఏర్పడే దృష్టి లోపాన్ని నివారించగల లూటెన్ అనే సూక్ష్మపోషకాల గ్రహణశక్తి అత్యధికంగా ఉంటుందని తాజా పరిశోధనల్లో గుర్తించారు.

మొక్కజొన్న, గుడ్డులోని పచ్చసొన, బ్రొకోలి, బీన్స్, పాలకూర, క్యాబేజీ, తోటకూర, బఠాణీలు వంటి ఆకుపచ్చ కూరగాయలు లూటెన్‌కు మంచి ఆధారం. పండ్లుకూడా మంచి ఆధారమే. ఎ, డి, ఇ, కె వంటి కొన్ని కొవ్వులో కరిగే విటమిన్లకు కొంత ఫ్యాట్ తప్పనిసరి.

కాబట్టి లో-ఫ్యాట్ డ్రెస్సింగ్‌లతో సలాడ్లు తినడంవల్ల పరిరక్షణా పూరిత ఫైటో కెమికల్స్‌ను శరీరం త్వరగా గ్రహించగలదు.

**టొమేటో-శనగలు :** పాలకూర, శనగలు వంటి వాటిలోని ఐరన్‌ను శరీరం సులువుగా గ్రహించేందుకు విటమిన్'సి' సహకరిస్తుంది. కాబట్టి సలాడ్లలో కొద్దిగా ఆరెంజ్ కలుపుకుంటుండాలి. చింతపండు ఆధారిత కూరల్లో పాలకూర, ఉడికించినశనగల్లో టొమేటోలు కలుపుకుంటే వాటిలోని ఐరన్ శరీరానికి బాగా పడుతుంది లేదా ఐరన్లు పుష్కలంగా లభించే సెరల్స్ తిన్నతర్వాత, ఓ గ్లాసుడు ఆరెంజ్‌జ్యూస్ తాగాలి.

## ❖ డిటాక్సిఫికేషన్

శరీరాన్ని ఎప్పటికప్పుడు డిటాక్స్ చేసుకుంటుండాలి. ఇందుకోసం కొన్ని పోషక పదార్థాలు, కాంబి

## ❖ శక్తి కారకాలు

కొన్నిరకాల ఆహారపదార్థాలను కలిపి తినడం వల్ల అత్యుత్తమశక్తిస్థాయిలు కొనసాగుతాయి.

**పండ్లు-నట్స్ లేదా గింజలు:** కార్బోహైడ్రేట్స్‌కు, పీచుకు పండ్లు మంచి ఆల్కలైన్ ఆధారం. తక్షణ శక్తిని అందిస్తాయి. నానబెట్టిన నట్స్ లేదా గింజల్లో నీటిని కలుపుకుని తినడంవల్ల రెండింతలు ప్రయోజనం కలిగి, ఖనిజాలు, విటమిన్లు లభిస్తాయి.

నట్స్‌లో, గింజల్లో ప్రొటీన్లు, ఆరోగ్యవంతమైన ఫ్యాట్స్, పీచు కూడా లభిస్తాయి.

**నిమ్మనీరు, తేనె, కళ్ళుప్పు :** నిమ్మరసం కలిపిన నీరు శారీరక వ్యవస్థను ఆల్కలైన్‌చేసి, శరీరాన్ని తక్షణమే హైడ్రేట్ చేస్తుంది. కళ్ళుఉప్పు ఎలక్ట్రోలైట్ స్థాయిల్ని పెంచుతుంది. తేనె అత్యవసర ఖనిజాలు అందించి, శక్తిని పెంచుతుంది.



నేషన్లు చాలా రకాలు ఉంటుంటాయి.

**స్ప్రౌట్ బార్లీనీళ్ళు:** బార్లీ పూర్తిస్థాయి ధాన్యం. విటమిన్లు, ఖనిజాలు ఎక్కువగా లభిస్తాయి. ముఖ్యంగా ఇన్‌ఫ్లమేషన్‌తో పోరాడే గ్లుకాన్, యాంటీఆక్సిడెంట్లు ఉంటాయి. దీన్లో వాము, జీర వంటివి కలిపితే జీర్ణవ్యవస్థకు మరింత మేలు జరుగుతుంది. రక్తం శుద్ధికావడంతోపాటు, కడుపుబ్బరం, నీరు చేరడం వంటి సమస్యలు తగ్గుతాయి.

**క్యారెట్, బీట్‌రూట్, కొబ్బరినూనె:** బి, సి, కె వంటి విటమిన్లకు, ఐరన్, కాపర్, మెగ్నీషియం వంటి ఖనిజాలకు, డైటరీపీచు, యాంటీ ఆక్సిడెంట్స్‌కు బీట్‌రూట్ తిరుగులేని ఆధారం. క్యారెట్లలో బెటాకెరోటిన్, ఇతర విటమిన్లు, ఖనిజాలు, పీచు, యాంటీ ఆక్సిడెంట్స్ సమృద్ధిగా లభిస్తాయి.

ఎక్స్‌ట్రా వర్జిన్ కొబ్బరినూనె లారిక్, క్యాప్రిలిక్, క్యాప్రిక్ యాసిడ్స్‌కు ఆధారం. ఇవి యాంటీ ఇన్‌ఫ్లమేటరీ, యాంటీ ఏజింగ్ గుణాలు కలిగివుంటాయి. ఈ మూడింటినీ కలిపినప్పుడు రక్తసరఫరా మెరుగవుతుంది. కణాలు డిటాక్సిఫై అవుతాయి.

చర్మం కాంతివంతంగా వుంటుంది. ఉదయం బ్రేక్‌ఫాస్ట్‌తో ఈ మూడింటి గుజ్జుతో కూడిన జ్యూస్ తాగడంవల్ల జీర్ణవ్యవస్థ అమోఘంగా పనిచేస్తుంది.

**జీలకర్ర, నీరు-ఉప్పు :** ప్రధాన భోజనం చేశాక ఓ గ్లాసు జీలకర్ర నీటిని తాగాలి. జీలకర్ర ఆకలిని ఉద్దీప్తంచేసి, జీర్ణప్రక్రియకు సహకరిస్తుంది. గ్యాస్, కడుపుబ్బరంవంటి సమస్యలు తలెత్తవు.

**నిమ్మరసంతో గ్రీన్‌టీ:** గ్రీన్‌టీలో కెటాచిన్లు శక్తివంతమైన యాంటీ ఆక్సిడెంట్లు. గ్రీన్‌టీలో కొద్దిగా నిమ్మరసం కలుపుకోవడంవల్ల జీర్ణవ్యవస్థలో కెటాచిన్లు బ్రేక్‌డౌన్ కావడం తగ్గి, శరీరం వాటిని సులువుగా గ్రహించగలుగుతుంది.

## ❖ వెయిట్ వాచ్

బరువు తగ్గాలని భావించేవారి ఆహారపదార్థాల కలయికపై ఓ కన్నేసివుండాలి.

**మొలకలు, వెజిటబుల్ సలాడ్ :** బరువు తగ్గాలని భావిస్తుంటే, ఆరోగ్యవంతమైన పీచు అత్యధికంగా వుండే సలాడ్‌ను ఎంచుకోవాలి. అయితే, అన్ని వాతావరణాలకూ అనుగుణంగా కొంత ప్రొటీన్ జతచేసుకోవాలి. మొలకలు, అన్ని కూరగాయలు కలిపిన సలాడ్ ఇందుకు సరైనది.

ప్రొటీన్లు, కార్బోహైడ్రేట్స్‌ను మాత్రమే కాక, పోషకాలతో కూడిన ఆహారాన్ని అందించి, కడుపు నింపుతాయి. శక్తిస్థాయిలను పెంచుతాయి.

**యాపిల్, అవకాడో, అరటిపండు :** ఈ మూడింటితో కూడిన ఫ్రూట్ సలాడ్ ఫ్లేవనాయిడ్లు, పెక్టిన్, పీచు, ముఫా వంటి ఆరోగ్యవంతమైన ఫ్యాట్స్, ఫోలిక్ యాసిడ్, పొటాషియంవంటివాటిని అందిస్తాయి. ఇవి చక్కెర, కొలెస్ట్రాల్, రక్తపోటుస్థాయిలను క్రమబద్ధీకరించడమే కాకుండా, రోగనిరోధక వ్యవస్థను బలోపేతం చేస్తాయి.

**జామ, బొప్పాయి, కివి :** ఈ మూడురకాల పండ్లు విటమిన్ సి, పీచు, కెరోటిన్, మెగ్నీషియం, పొటాషియంలకు మంచి ఆధారాలు.

మలబద్ధకాన్ని నిరోధించి, జీర్ణశక్తిని మెరుగుపరుస్తాయి. జీవక్రియను క్రమబద్ధీకరిస్తాయి.

**సెరల్స్, పెరుగు, పండ్లు :** రోజు మొత్తంలో ఉదయంవేళ తినేటువంటి ఉపాహారం ఎంత ముఖ్యమో విడిగా చెప్పుకోనవసరంలేదు.

ప్రొటీన్లు, పీచుఅధికంగా వుండే పదార్థాలు కడుపు నిండిన భావన ఇస్తాయి. కనుక, స్కిమ్డ్‌మిల్క్ లేదా పెరుగు, పండ్లతో కలిపి సెరల్స్ తీసుకోవాలి.

## ❖ డైజేషన్‌కు

పండ్లు ఆల్కలైన్ పదార్థ ఆధారితాలు. శరీరంలో సులువుగా జీర్ణమై, శక్తిని ఉత్పత్తి చేస్తాయి. ఇంకో పక్క ఉడికించిన పదార్థాలు, శక్తిని ఉత్పత్తి చేయడానికి ముందు కొంత సమయం కావాల్సిఉంటుంది. ఇందుకోసం కొంత ప్రక్రియ కొనసాగుతుంది.

భోజనం చేయగానే పండు తింటే త్వరగా జీర్ణం కాదు. ఉడికించిన పదార్థం పూర్తిగా ప్రాసెస్ అయ్యే దాకా ఉదరంలో అలాగే వుండిపోతుంది. దీనివల్లగ్యాస్, కడుపుబ్బరం, ఎసిడిటీ వంటి సమస్యలు ఎదురవుతాయి.



Photographs : Shutterstock

ఆహారాన్ని నీటితో జతచేయవద్దు. ఇలా ఆహారం నడుమ మంచినీరు తాగుతుంటే ఉదరంలో జీర్ణరసాలు విడుదల కావు. పోషకాల్ని శరీరం సమగ్రంగా గ్రహించాలంటే భోజనానికిముందు లేదాతర్వాత ఓ గంటవిరామంతో మంచినీరు తాగాలి. స్మూథీలను యాలకులు, జాజికాయ వంటివి కలుపుకుని తీసుకోవాలి. లేనిపక్షంలో ఉదరంపై హెవీగా వుండి శారీరకంగా, మానసికంగా నెమ్మదింపజేస్తాయి.

ఆయుర్వేదప్రకారం పుల్లని పండ్లను డెయిరీతో కలిపి తీసుకోవడంవల్ల జీర్ణప్రక్రియకు ఆటంకం కలుగుతుంది. శరీరంలో విషతుల్యాలు ఉత్పత్తి అయ్యి సైనస్, ముక్కుదిబ్బెడ, జలుబు, దగ్గు, ఎలర్జీలు వంటి సమస్యలు ఎదురవుతాయి.

కె.మధుప్రియ

# వారఫలం

**డిశంబరు 21 నుండి 27, 2017 వరకు**

పిడపర్తి వీరేశ్వరశాస్త్రి, పిడపర్తి భాస్కర సుబ్రహ్మణ్యశాస్త్రి
సెల్ : 94921 56064



## మేషం

**అశ్విని, భరణి, కృత్తిక 1వ పా.** ఈ వారంమందు మీ నిత్యకృత్యాలను సకాలంలో నిర్వహించుకోగల్గుతారు. అదృష్టదేవత చేయూతనిచ్చినట్లు ఊహించని మేలును పొందుతారు. ఉత్సాహమైన వార్తలు బంధుమిత్రులచే వింటారు. వ్యాపార, వ్యవహారాలందు ఉత్సాహంగా వ్యవహరించుకుంటారు. విద్యార్థుల వ్యాసంగాలు చురుకుగా సాగుతాయి. యత్నీకృత కార్య లాభాలు ఉంటాయి. యత్నించుకోండి. ఈ రాశివారికి గురు, శుక్ర, శని, ఆదివారాలు అనువైనవి.



## వృషభం

**కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా.** ఈ వారంలో రోజులు నిరాశగా సాగుతాయి. ప్లానింగ్ లేకుండా వ్యవహరించుకుంటారు. విమర్శలు ప్రతివిమర్శలచే రోజులు వాడివేడిగా సాగుతాయి. చెడుని ఊహించుకుంటూ రోజులను వ్యర్థంచేసుకునే సూచనలున్నాయి. ముఖ్యమైన వ్యవహారాలలో దగ్గరివారి సూచనలకు ప్రాధాన్యత నీయుట మేలు. సూర్యారాధనకు ప్రాధాన్యతనీయండి. వీరికి శని, ఆది, సోమవారాలు అనువైనవి.



## మిథునం

**మృగశిర 3, 4పా, ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.** కార్యసిద్ధికై చేయు యత్నాలను కొనసాగించగల్గుతారు. ముఖ్యమైన వ్యవహారాలలో సాహసయత్నాలు ఉంటాయి. వృత్తి, ఉద్యోగాలందు అధికారులచే ప్రశంసలు పొందగలరు. నిర్మాణ పనులలో చురుకుగా వ్యవహరించుకోగలుగుతారు. కొన్ని నిర్ణయాలను ఆకస్మికంగా మార్పుచేసుకోవలసి వచ్చినా మంచిఫలితాలు పొందుతారు. గురు, శుక్రవారాలలో జాగ్రత్తలవసరం.



## కర్కాటకం

**పునర్వసు 4వ పా, పుష్యమి, ఆశ్లేష.** శుభకాలం. అభీష్టాలను నెరవేర్చుకోగల్గుతారు. విశేష వ్యవహారాలను చేపట్టగలరు. గతంలో పరిష్కారం కాని కొన్ని అంశాలలో అనుకూలతలు పొందుతారు. ఆర్థికపరమైన ఒడుదుడుకులు కొన్ని ఎదురైనా అవసరాలకు ఇబ్బందులు ఉండవు. సొంత ఆలోచనలకే ప్రాధాన్యతనీయండి. వృత్తి, ఉద్యోగాలందు మీ నిర్ణయాలకు గుర్తింపులు ఏర్పడతాయి. వీరు శని, ఆది వారాలందు అన్ని విషయాలలో మెలకువల పాటించుకోవాలి.



## సింహం

**మఘ, పూర్వఫల్గుని, ఉత్తరఫల్గుని 1వ పా.** పట్టుదలతో పనిచేయాలి. ముఖ్యం అనుకున్న పనుల్ని చేపట్టి పూర్తిచేసుకొనుట మేలవ్వగలదు. ఆర్థికంగా అంతంతమాత్రంగా ఉండగలదు. అధికారులతోను, వ్యవహారాలందును ఓర్పు, సహన ములతో వ్యవహరించుకోవాలి. బంధుమిత్రులచే ఉత్సాహపూరిత వార్తలుంటాయి. ఈ రాశివారికి గురు, శుక్ర, శని, ఆదివారాలు అనువైనవి.



## కన్య

**ఉత్తరఫల్గుని 2, 3, 4పా, హస్త, చిత్త 1, 2పా.** శుభకార్యాలోచనలతో కాలం గడుస్తుంది. ఆనందాన్ని, హుషారును ఇచ్చు కొన్ని సంఘటనలుంటాయి. ఖర్చులు కొన్ని ఊహించనివి ఉంటాయి. వృత్తి, వ్యాపారాలపట్ల మొక్కుబడితనాలు ప్రదర్శించగలరు. స్థిరాస్తుల ఏర్పాట్లకు, వాహన యంత్రాదుల మార్పులకు ఊహలు సాగుతాయి. పట్టుదలలు అవసరం. ఈ రాశివారికి శని, ఆది, సోమ, బుధవారాలు అనువైనవి.



## తుల

**చిత్త 3, 4పా, స్వాతి, విశాఖ 1, 2, 3పా.** ఈ వారమంతా మీకనుకూలప్రదంగా సాగుతుంది. ఆరోగ్య విషయంలో మేలుతనం ఏర్పడుతుంది. ఇంటా-బయటా నలుగురి సహకారాలు సిద్ధిస్తాయి. నిరుద్యోగులకు మేలుతనం ఏర్పడగలదు. బంధుమిత్రుల ప్రేమాభిమానాలను చవిచూడగలరు. ఆత్మవిశ్వాసం పెరుగుతుంది. విందు వినోదాలకంటే కర్తవ్యాలకు అంకితమగు సూచనలున్నాయి. వీరికి సుబ్రహ్మణ్యారాధన మరింత మేలునిస్తుంది. వీరు సోమ, బుధవారాలందు ముఖ్యమైన పనులను తలపెట్టుకోవాలి.



## వృశ్చికం

**విశాఖ 4వ పా, అనూరాధ, జ్యేష్ఠ.** వేగవంతం- అర్థవంతమైన నిర్ణయాలను తీసుకోగలరు. పనులని సకాలంలో పూర్తిచేసుకోగలరు. ఖర్చులుంటున్నా సాహసవంతంగా వ్యవహరించుకోగలరు. సొంత నిర్ణయాలకే ప్రాధాన్యతను ఇవ్వండి. క్రయ-విక్రయాలను అనుకూలంగా మార్పుచేసుకోగల్గుతారు. సంతానంచే సమస్యలు ఏర్పడినా పైకి రాకుండా కొన్ని జాగ్రత్తలు పాటించుకోవాలి. శివారాధనలకు ప్రాధాన్యతనీయండి. ఈ రాశివారికి గురు, శుక్రు, శనివారాలు అనువైనవి.



## ధనుస్సు

**మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1వ పా.** జన్మమందు చాతుర్గ్రహ కూటమిచే మొహమాటాలచే కొన్ని నష్టకష్టాలను చవిచూడవలసి రావచ్చును. శత్రుభావాలున్నవారితో నిర్లక్ష్యంగా వ్యవహరించకండి. వృత్తి, ఉద్యోగ, వ్యాపారాలందు శ్రద్ధాసక్తతలు చూపవలసి ఉంటుంది. చెల్లింపులను సకాలంలో పూర్తిచేసుకోగల్గుతారు. మీ బాధ్యతలను, పనులను ఇతరులకు అప్పగించకుండా మీ గోప్యతతో సాగండి. దూర ప్రాంతాలను చూసే అవకాశాలు, ఊహించని వ్యక్తులచే ప్రయోజనాలు ఏర్పడతాయి. వీరికి శని, ఆది, సోమవారాలు అనువైనవి.



## మకరం

**ఉత్తరాషాఢ 2, 3, 4పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2పా.** రోజులు నిరాశాజనకంగా సాగుతాయి. ఒంటరిపోరు చందమున ఉంటుంది. విమర్శలకు దూరంగా ఉండండి. అనారోగ్య భావాలను కొన్నిటిని ఎదుర్కోవలసి రావచ్చును. అధికారులచే ఒత్తిడులు, వృత్తి, వ్యాపారాలందు ఇచ్ఛతలు అంతంతమాత్రంగా ఉండుటవంటివి ఉంటాయి. ప్రయాణాలు సౌకర్యవంతంగా సాగుతాయి. సోదరవర్గంతో ఇచ్చిపుచ్చుకోవడాలు ఏర్పడతాయి. క్రయవిక్రయాలకు ఆలోచనలు అవసరం. ఈ రాశివారికి గురు, శుక్ర, సోమ, బుధవారాలు అనువైనవి.



## కుంభం

**ధనిష్ఠ 3, 4పా, శతతార, పూర్వాభాద్ర 1, 2, 3పా.** ప్రయత్నాలు అనుకూలంగా సాగుతాయి. ఖర్చులందు అనవసరమైనవి ఏర్పడకుండా ముందుచూపు అవసరం. అధికారులు, పెద్దలు వంటివారితో మెచ్చుకోలుతనాలుంటాయి. వృత్తి, వ్యాసకాలందు పుష్కలమైన అవకాశాలు ఏర్పడతాయి. విద్యా, వివాహాది విషయాలు అనుకూలంగా సాగుతాయి. పరపతి సౌకర్యాలు, ఋణదాతలు ఏర్పడుటవంటివి ఉంటాయి. నూతన వ్యక్తులతో పరిచయ భాగ్యాలు ఏర్పడతాయి. ఈ రాశివారికి శని, ఆది, సోమవారాలు అనువైనవి.



## మీనం

**పూర్వాభాద్ర 4వ పా, ఉత్తరాభాద్ర, రేవతి.** మీ ప్రయత్నాలకు, సంప్రదింపులను తోడుచేయాలి. బంధు-మిత్రుల రాకపోకలు ఉంటాయి. ఆరోగ్యం అనుకూలతలు ఉత్సాహాన్ని ఇవ్వగలవు. సంతానంనుండి శుభవార్తలు వింటారు. శ్రమలున్నా వృత్తి, ఉద్యోగాలందు సంతృప్తి సిద్ధించగలదు. ఆర్థికంగా ఒకింత మేలైన ఫలితాలు ఉంటాయి. సంతానార్థులకు తీపి కబుర్లు ఉంటాయి. బకాయిల వసూళ్ళ వంటివి ఏర్పడతాయి. నూతన వ్యక్తుల పరిచయ బాధ్యతలు సిద్ధిస్తాయి. వీరికి గురు, శుక్ర, సోమ, బుధవారాలు అనువైనవి.



డా॥జి. సమరం

# SEX AND సైకాలజీ

## Foreplay always helps the guy hold on longer

బి.కె. హైదరాబాద్

**చదువుకున్న స్త్రీలు కొందరు ఇంటికి, పిల్లలకే పరిమితం అయిపోతారు. ఉద్యోగం చేయలేకపోతున్నామని బాధపడతారు. దీనికేమైనా పరిష్కార మార్గం ఉందా?**

ఇంట్లో వంట పని, పిల్లల పని కూడా ఒక పెద్ద పనే. అది ఒక గొప్ప ఉద్యోగమే. మంచి నైపుణ్యంతో చేయవలసిన పనే. దాన్ని తక్కువగా భావించడం, చులకనగా చూడటం కరెక్టు కాదు.

ఆఫీసు పనికంటే ఈ పనే చాలా గొప్పది. అయినా ఎవరూ దాన్ని గుర్తించరు. అయితే ఏ మాత్రం అవకాశం ఉన్నా పార్ట్‌టైమ్ జాబ్‌గా తప్పకుండా ఏ ఆఫీసులోనో, ఏ స్కూల్లోనో పని చేయవచ్చు. అలాంటి అవకాశాలు చాలా ఉన్నాయి.

అటువంటప్పుడుతాముబయటికివెళ్ళి ఉద్యోగం చేస్తున్నామనే తృప్తీ ఉంటుంది,ఇంట్లో పిల్లలని, భర్తని చక్కగా చూసుకుంటున్నామనే ఆనందం ఉంటుంది. ఈ రోజుల్లో చాలామంది గృహిణులు చదువుకుని కూడా ఇంటికే పరిమితం అయిపోతున్నారు.

అలా ఉండనవసరంలేదు. ఒకవేళ బయట ఉద్యోగాలు కోరుకున్నరీతిలో దొరకకపోతే స్వయం ఉపాధిలో ఏదైనా ఇంట్లో ఉండే పనిచేయవచ్చు. అది కూడా పనే. అందుకని చదువుకుని కూడా ఉద్యోగం చేయలేకపోతున్నామని బాధపడనవసరంలేదు.

డి.ఎల్. కర్నూలు

**మగవాడు సెక్స్‌లో పాల్గొంటే వీర్యస్ఖలనం అయిపోతే మళ్ళీ సెక్స్‌లో పాల్గొనడానికి కొన్ని గంటలో, పూటలో పడుతుంది. స్త్రీలు సెక్స్‌లో వెంటవెంటనే పాల్గొనగలుగుతారు.**

**పాల్గొన్న ప్రతిసారీ భావప్రాప్తి పొందగలుగుతారు. మగవానికీ, స్త్రీకి ఎందుకిలా తేడా ఉంది?**

పురుషునిలో ఒకసారి వీర్యస్ఖలనం అయితే పురుషాంగంలోని పల్చని కండరాలు, వాటిని స్టిమ్యులేట్ చేసే నరాలు కెమికల్ యాక్షన్స్ ప్రకారంగా డీలా పడిపోతాయి. తిరిగి అవి రీచార్జ్ అవడానికి చాలా టైమ్ తీసుకుంటాయి.

ఒకసారి డీలాపడిన పరాలు తిరిగి యాక్టివ్ అయ్యే కాలాన్ని 'రిఫ్రాక్టరీ పిరియడ్' అంటారు. కాని స్త్రీలలో ఇటువంటి రిఫ్రాక్టరీ పిరియడ్ లేదు.

వాళ్ళల్లో వెంట వెంటనే కామనాడులు స్పందించే పరిస్థితి ఉంది. అందుకనే ఒకసారి సెక్స్ ముగిసినా మరుక్షణంలోనే మళ్ళీ సెక్స్‌లో పాల్గొనడం, సెక్స్ పరంగా సుఖప్రాప్తి పొందడం ఉంటుంది.

ఎస్.ఎల్. ఒంగోలు

**నాకు మెన్సస్ రావడానికి 10-15 రోజుల ముందు నుంచి ఒళ్ళంతా బరువెక్కుతుంది. కాళ్ళకి, పొట్టకి, ముఖానికి కొంత నీరు చేరుతుంది.**

**చిరాకు, కోపం,అతిగా అనిపిస్తాయి.మెన్సస్ అయిపోగానే నీరు తగ్గిపోతుంది. నేను మళ్ళీ శారీరకంగా, మానసికంగా మామూలు అయిపోతాను. ఎందుకు ఇటువంటి మార్పు కలుగుతోంది?**

కొందరు స్త్రీలల్లో మెన్సస్ రావడానికి 10-15 రోజుల ముందు నుంచి శారీరకంగా, మానసికంగా కొంత వైపరీత్యం ఏర్పడుతుంది.

పాదాలు ఉబ్బడం, ఒళ్ళు బరువెక్కడం, చిరాకు, కోపం, విసుగు, అలసట ఉంటాయి. దీన్నే ప్రిమెనుస్ట్రువల్ సిండ్రోమ్ అని అంటారు. మెన్సస్‌కి ముందు స్త్రీ శరీరంలో హార్మోన్ల అస్తవ్యస్తత ఏర్పడుతుంది.

దానివల్ల ఈ బాధలు కలుగుతాయి.ఈ బాధలని భరించనవసరంలేదు.

మెన్సస్ అయిన పదిహేనవ రోజు నుంచి పదిరోజుల పాటు ప్రొజెస్టిరోన్ హార్మోన్‌కి సంబంధించిన బిళ్ళలను రోజూ ఉదయం ఒకటి రాత్రి ఒకటి వేసుకుంటే హాయిగా ఉంటుంది.ఆరోజుల్లో ఆహారంలో ఉప్పు తగ్గించడం చాలా మంచిది.

సి.ఆర్.కె. నంద్యాల

**నా వయస్సు 47 సంవత్సరాలు. ఇప్పటికీ మావారు వారానికి మూడు, నాలుగు సార్లు సెక్స్‌లో పాల్గొంటారు. ఇటీవల కాలంలో సెక్స్‌లో పాల్గొన్నప్పుడు నాకు యోని మంటగా ఉంటోంది. సెక్స్‌లో పాల్గొనాలంటేనే భయం కలుగుతోంది.**

**మావారితో నా బాధగురించి చెప్పినా పట్టించుకోవడంలేదు. ఆయన సుఖం వదులుకోవడంలేదు. నాకు ఎందుకని యోనిలో మంట వస్తోంది. మా వారికి ఏమైనా రోగాలు ఉన్నాయా?**

సాధారణంగా స్త్రీలకి 45-50 సంవత్సరాలు వచ్చే సరికి మెనోపాజ్ వస్తుంది. మెనోపాజ్ దశ వచ్చిన స్త్రీలల్లో ఈస్ట్రోజన్ హార్మోను బాగా తగ్గిపోతుంది.

దాంతో యోని లోపల పొరలు పలచనైపోతాయి. సెక్స్‌లో పాల్గొంటే నొప్పి, మంట అనిపిస్తాయి. ఇది అతిసాధారణ విషయం.

అంతేగాని మీవారికి వ్యాధులు ఉండటం కాదు. యోనిలో మంట ఉందని సెక్స్‌కి దూరంగా ఉండనవసరం లేదు. డాక్టరుని సంప్రదించి మెనోపాజ్‌కి



Courtesy : MAXIM

# తొలినాళ్ళలో సరిగా తెలియక...

వివాహం తర్వాత జరిగే గొప్ప తతంగంకోసం ఆసక్తిగా ఎదురుచూసే అబ్బాయిలు, అమ్మాయిల్లో దాదాపుగా 80 శాతంమంది తొలిరోజు నిరుత్సాహాన్ని మూటగట్టుకుంటున్నారని గణాంకాలు చెపుతున్నాయి. వేలకు వేలు ఖర్చుపెట్టి హనీమూన్‌కి వెళ్ళాము కాని అక్కడ అనుభవించిందేమీ లేదు అంటున్నారు అమ్మాయిలు.

అలాగని వారి వైవాహిక జీవితమంతా నిరాశా, నిస్పృహలతో గడిచిందని అనలేము.తర్వాతి రోజుల్లో రెచ్చిపోయి లైంగిక ఆనందం అద్భుతంగా పొందుతున్నారు. దీనికి కారణం ఆ తొలిరాత్రుల గురించిన అతి ఆలోచనే. తొలిసారి లైంగిక అనుభవంలో 90 శాతం అబ్బాయిలది ఫెయిల్యూర్ అంటున్నారు.

దీనికి కారణాలు అనేకం. తొలినాళ్ళలో వుండే పలురకాల ఆలోచనలు, ఇతరులు చెప్పిన మాటలు, అనవసరంగా ఊహించుకున్నవి, చూసినవి వగైరాలన్నీ కలిసి సృష్టించే గందరగోళం తొలిరాత్రుల సమస్యను మరింత పెంచుతుంటాయి.

తొలిరాత్రి అనుభవం గురించి అమ్మాయిలు ఎక్కువగా భయపడతారన్నది అందరూ అనుకునే మాట. అందులో నిజం వుంది. వారి భయాలు బాధ గురించి, మగవాడి ప్రవర్తన గురించి, నాటివరకు సున్నితంగా చూసుకున్న శరీరాన్ని మరెవరో వచ్చి నలిపివేస్తారన్న ఆందోళన ఒకటి.

పురుషాంగ ప్రవేశం బాధాకరంగా వుంటుందని తోటివారు చెప్పిన మాటలు మరొకటి. అవి రెండూ వారిని ఆందోళనలోకి నెడతాయి.

మగవాడి ఆందోళన మరోరకం.తాను భార్యను సరిగ్గా తృప్తిపరచగలనా లేదా అనే ఆలోచన మగపిల్లలను వెంటాడుతూనే వుంటుంది. వారి అంగం సైజు మీద వారికుండే అనుమానం అంతా ఇంతా కాదు.

దీనికి తోడుగా తొలిరాత్రి అమ్మాయి నోటినుండి వ్యతిరేకపు మాటలు వెలువడినా, తనకేమీ సుఖం కలగలేదన్న విసుగు ప్రదర్శించినా ఇక మగవాడి పరిస్థితి మరింత దిగజారిపోతుంది. ఇటువంటి పరిస్థితికంతటికీ కారణం లైంగికపరంగా పరిజ్ఞానం సక్రమంగా లేకపోవటమే.

లైంగికంగా తృప్తి అంతా అంగంద్వారానే అనే ఒకే ఒక్క చిన్నపొరపాటు అభిప్రాయం వదిలించుకోనంతకాలం మగవాడికి తిప్పలు తప్పవు.ఆమె శరీరం గురించి, మనసుగురించి ముందుగా తెలుసుకుని, వాటిమీద విజయం సాధించినప్పుడు మిగిలిన సమస్యలన్నీ ఇట్టే పరిష్కారమవుతాయి.

ఆమెతో మాటలు, ఆమెను పొగడ్తలతో ముంచెత్తటం, శరీరభాగాలను చిలిపిగా తాకటం వంటి విషయాలు మరచిపోయి నేరుగా అంగానికి పని చెప్పేవారు తొలినాళ్ళలో ఇబ్బందులు తెచ్చుకుంటారు.

ఆ తొలినాటి అడ్డంకులు అధిగమించేందుకు కొంత సమయంపడుతుంది.ఆ అవకాశం అమ్మాయి ఇచ్చి,సహకరిస్తే సరి... లేకుంటే ఎన్నటికీ సరిగా పని చేయనివాడిగానే నిలిచిపోతాడు.

ఒక్కసారి విఫలమయ్యారని అంతటితో ఆగిపోకూడదు. సరిగా తెలుసుకుని, సక్రమంగా ఆచరించండి. అనవసరపు ఒత్తిడిని మనసుమీద పెంచుకుని లైంగిక సుఖానికి దూరం కావద్దు. ◆

చికిత్స పొందినట్లయితే యోనిలో మంట తొలగిపోతుంది. శృంగారంలో చక్కగా పాల్గొనవచ్చు.

బి.ఎమ్. హైదరాబాద్

*నేను ఉదయమే జాబ్‌కి వెళతాను. మధ్యాహ్నం పూట ఏదో కాస్త తినడం తప్ప కడుపునిండా తినడం ఉండదు.రాత్రి ఇంటికి వచ్చిన తర్వాత కడుపునిండా సుష్టుగా భోజనం చేస్తాను.*

*భోజనం చేసిన వెంటనే బెడ్‌మీద నడుం వాలుస్తాను. ఇంతలో మా ఆవిడ వచ్చి పక్కనే చేరుతుంది. భుక్తాయాసం ఉన్నప్పటికీ మా ఆవిడపక్కన చేరేసరికి శృంగారంలో పాల్గొనాలనిపిస్తుంది. వెంటనే శృంగారంలో పాల్గొంటాను.*

*కడుపునిండా భోజనం చేయగానే శృంగారంలో పాల్గొంటే ఏమైనా నష్టం కలుగుతుందా? సెక్స్ నరాలు దెబ్బతింటాయా?*

సాధారణంగా కడుపునిండా భోజనం చేసిన తర్వాత భుక్తాయాసం ఉంటుంది. దానివల్ల శృంగారంలో పాల్గొనడం కాస్త కష్టం అనిపిస్తుంది.

భుక్తాయాసం ఉన్నప్పటికీ సెక్స్‌లో పాల్గొనే ఆసక్తి, సామర్థ్యం ఉంటే పాల్గొనవచ్చు. ఏమీ అవదు. సెక్స్ నరాలు దెబ్బతినడం జరగదు.

ఎంతైనప్పటికీ భోజనం చేయగానే శృంగారంలో పాల్గొంటే కొంత ఇబ్బందిగానే ఉంటుంది. ఒక గంట ఆగి శృంగారంలో పాల్గొంటే ఇంకా బాగుంటుంది.

హెచ్.ఎమ్. విశాఖపట్నం

*వివాహేతర లైంగిక సంబంధాలకి సెక్స్ అధికంగా ఉండటమే కారణమా?*

వివాహేతర లైంగిక సంబంధాలు పెట్టుకునే వాళ్ళల్లో సెక్స్ అధికంగా ఉండటం కారణం కాదు. చాలామందిలో నిరంతరం సెక్స్‌లో కొత్తదనాన్ని చూడాలనే ఆరాటం ఉంటుంది.

ఇటువంటివాళ్ళకి కొత్తవాళ్ళతో సంబంధాలు కొత్త అనుభూతులు కలిగిస్తాయి. దాంతో మరింత కొత్త సంబంధాలకి ఆసక్తి చూపుతారు.

ఎక్కడో కొందరు భార్యవలన తృప్తి కలగకపోవడం వల్లనో, భర్తవల్ల తృప్తి కలగకపోవడంవల్లనో సెక్స్ సుఖంకోసం వివాహేతర లైంగిక సంబంధాలు పెట్టుకోవడం ఉంటుంది. కాని అధిక సంఖ్యాకుల్లో కొత్త అనుభవాలుకోసం ఆసక్తి ఉండటమే వివాహేతర లైంగిక సంబంధాలకి మూలం.

కె.ఎస్.కె. హైదరాబాద్

*నా భార్యకి సెక్స్‌లో పాల్గొనగానే విపరీతంగా తెలుపు అవుతుంది. నీళ్ళలాగా కారుతుంది.*

*మామూలు సమయంలో అలా తెలుపు అవడం ఉండదు. తెలుపు అవడంతో ఆమెలో సెక్సువల్ ఎగ్జైట్‌మెంట్ కూడా ఎక్కువైపోతుంది. నన్ను ఓవర్‌గా స్ట్రోక్స్ ఇస్తే తప్ప ఆమెకి తృప్తిఉండదు.*

*ఈ తెలుపు అవడం ఏమిటి, ఈ తెలుపుతో ఆమెలో సెక్స్ కోరిక ఎక్కువ అవడం ఏమిటి?*

*నాకు అంతుపట్టని మిస్టరీగా ఉంది. ఆమెకు సెక్స్‌లో పాల్గొన్నప్పుడు తెలుపు ఎక్కువ అవకుండా ఉండేమార్గం ఏమైనా ఉందా?*

కొందరు స్త్రీలు సెక్స్‌లో పాల్గొనగానే క్షణాల్లో ఎగ్జైట్ అవుతారు. దాంతో జననేంద్రియాల దగ్గర ఉండే రక్తనాళాలు క్షణాల్లో ఉబ్బిపోతాయి.

రక్తాధిక్యతతో నిండిపోతాయి. అంతేకాకుండా యోనిమార్గంలో ఉండే గ్లాండ్స్ బాగా స్రవిస్తాయి. ఉబ్బిన రక్తనాళాలవల్ల, స్పందించిన గ్లాండ్స్ వల్ల నీరులాగా కారిపోవడం ఉంటుంది.

సెక్స్ విషయంలో మనస్సు బాగా స్పందించడంతో శృంగారంలో బాగా థ్రిల్ పొందడం ఉంటుంది. ఇదేమీ జబ్బు కాదు. సహజంగా జరిగే ప్రక్రియ.

అంతేగాని ద్రవాలు ఎక్కువ స్రవించడంవల్ల సెక్స్ పెరిగిపోవడం కాదు. స్పందించే మనస్సు ఉన్నప్పుడు సెక్స్‌లో థ్రిల్ పొందడం, దాంతోపాటు ద్రవాలు ఊరడం ఉంటుంది.

ఇటువంటి పరిస్థితిని మందులద్వారానో, మరొక విధంగానో బంధించడం ఉండదు.

మీరు కూడా మీ ఆవిడతో సమానంగా సెక్స్‌లో ఎగ్జైట్ అవడం నేర్చుకోండి.

హెచ్.ఆర్. యలమంచిలి

*కొంతమంది స్త్రీలల్లో వక్షోజాలు పెద్దవిగా ఉంటాయి. మరికొందరివి చిన్నవిగా ఉంటాయి. వక్షోజాలు పెద్దవిగాఉంటే సెక్స్ ఎక్కువగా ఉన్నట్లా? వక్షోజాలు చిన్నవిగా ఉంటే సెక్స్ తక్కువగా ఉన్నట్లా?*

వక్షోజాల సైజునుబట్టి సెక్స్ ఎక్కువగా ఉండటం లేదా తక్కువగా ఉండటం జరగదు. సెక్స్ ఎక్కువగా ఉండటం, తక్కువగా ఉండటం ఆ స్త్రీ మనస్సును బట్టి, పరిస్థితులనుబట్టి ఉంటుంది.

వక్షోజాలు చిన్నవిగా ఉన్న స్త్రీలో చాలా ఎక్కువ సెక్స్ ఉండవచ్చు, వక్షోజాలు పెద్దవిగా ఉన్న స్త్రీలో సెక్స్ తక్కువ ఉండవచ్చు. అందుకని స్త్రీలోని సెక్స్‌ని వక్షోజాల సైజుబట్టి బేరీజు వేయకూడదు.



డా॥ జి. సమరం వాసవ్య నర్సింగ్‌హోమ్ బెంజిసర్కిల్ విజయవాడ 520 010 ఫోన్ 0866-2472370 E-mail drsamaram@hotmail.com www.gsamaram.com

దెబ్బ తగలవలసినచోట సరిగ్గా తగిలింది. వాచ్‌మేన్ అరవలేదు. కనీసం మూలగలేదు. చాపచుట్టలా నేలమీదకు జారిపోయాడు.

మావ్ అతన్ని లోపలికి లాగి ఒక మూలగా పడుకోబెట్టాడు. భవనంలో కొంచెం కూడా చడీచప్పుడు లేదు. అంత పెద్ద భవనంలో సెక్యూరిటీ కూడా పెద్దగా లేనట్టుగా కనిపించింది మావ్‌కు. అయినా అతను చాన్సెస్ తీసుకో దలచుకోలేదు. చేతిలో గన్ పట్టుకుని లోపలికి వెళ్ళాడు.

హాలు పూర్తిగా చీకటిలోకి మునిగిపోయింది. ఒక చిన్న జీరోవాట్ బల్బ్ మాత్రం గుడ్డిగా వెలుగుతూ చీకటిని పారద్రోలటానికి ప్రయత్నిస్తోంది.

# జై భారత్

## చిత్రా వెంకటేష్



గబగబ మేడమెట్లు ఎక్కి పైకి చేరుకున్నాడు మావ్. పొడుగ్గా ఉన్న కారిడార్. కారిడార్‌కు రెండు వైపుల వరుసగా గదులు ఉన్నాయి. అన్ని గదులు మామూలుగా తెరిచే ఉన్నాయి.

కారిడార్ చివరన ఒక ఇనుప తలుపు కనిపించింది. దానికి మాత్రం తాళం వేసి ఉంది.ఆ ఇనుపతలుపు దాటిన తరువాత ఇంకోగది వస్తుంది. అది మంత్రి పర్సనల్ గది. అందులో ఒక సేఫ్ ఉంది. ఆ సేఫ్‌లోనే మంత్రి తన ఇల్లీగల్ వ్యాపారానికి సంబంధించిన కొన్ని ముఖ్యమైన డాక్యుమెంట్స్ దాస్తాడు.

మావ్ ఇనుపతలుపులు దగ్గర నిలబడి జేబులోంచి స్కెలిటన్ తీశాడు. రెండు క్షణాలలో ఆ తాళం క్లిక్ మంటూ తెరుచుకుంది. గది తలుపులకు మాత్రం తాళం లేదు. మామూలుగా దగ్గరగా వేసివుంది.గదిలో లైటు వేసి చుట్టూ చూశాడు.

గదిలో ఒక మూలగా అతనికి కావల్సిన సేఫ్ కనిపించింది. దానికి తాళం వేసి ఉంది. అంతకుముందే మావ్ ఏజెంట్లు ఆ సేఫ్ డూప్లికేట్ తాళంచెవి తయారు చేసి మావ్‌కు ఇచ్చారు. అందుకే కొంచెం కూడా కష్ట పడకుండా సేఫ్ తెరవగలిగాడు మావ్. లోపల కొన్ని ముఖ్యమైన డాక్యుమెంట్స్ ఉన్నాయి. వాటితోపాటు నాన్ జుడీషియల్ స్టాంప్ పేపర్లు కనిపించాయి.

అవి అగ్రిమెంట్ తాలూకు పేపర్స్. వాటిని తీసి నింపాదిగా చదివాడు. అవి పూర్తిగా చదివేసరికి తల మీద పిడుగుపడినట్టుగా అదిరిపడ్డాడు మావ్.

కొన్నిక్షణాలపాటు అతని మైండ్ పూర్తిగాబ్లాంక్ అయిపోయింది. వృత్తిపరంగా ఎన్నో డక్కా ముక్కీలు తిన్నాడు అతను. అయినా ఆ కాగితాల్లో విషయాలు చదివి షాక్‌తో బిగుసుకుపోయాడు.

మంత్రికి మాఫియాతోమాత్రమే కాకుండా ప్రపంచంలో నెంబర్ వన్ ఆర్గనైజ్డ్ క్రైమ్ సిండికేట్ ట్రయడ్‌తో సత్‌సంబంధాలు ఉన్నాయి. ఈ భయంకరమైన నిజాన్ని ఆ కాగితాలు ఋజువుచేస్తున్నాయి.

గౌతమ్ బద్ధకంగా కళ్ళు తెరిచి పక్కకుచూశాడు. సుజి ఇంకా గాఢంగా నిద్రపోతోంది. చప్పుడు చెయ్యకుండా మెల్లగా మంచం దిగి తలుపు దగ్గరికి వెళ్ళాడు. మెల్లగా తలుపు తెరిచి చూశాడు.ఇంకా చైనీస్ మిలిట్రీ అధికారులు వెళ్ళలేదు. వాళ్ళ వాహనములు కాటేజీదగ్గర పార్క్‌చేసి వున్నాయి. అంతకుముందు కాపలాగా ఇద్దరు మిలిట్రీ జవాన్‌లు గేటుదగ్గర



ఒక్కరు ఆడే ఆటలే మెరుగైనవి... ఎందుకంటే జట్టుగా ఆడే ఆటలో ఆటగాడిని మరెవరో ఎంపిక చేస్తారు.

-సౌరవ్ గంగూలీ, మాజీ క్రికెటర్



ఉన్నారు. కాని ఇప్పుడు ఒక్కడు కూడా లేడు.

గౌతమ్ తన సెల్‌తీసి మిలిట్రీ వాహనాలను ఫోటో తీశాడు. వెంటనే వాటిని తన బాస్‌కు ఫార్వర్డ్ చేశాడు. అదృష్టవశాత్తూ సుజి ఇంకా నిద్రపోతోంది. ఆమెను డిస్టర్బ్ చెయ్యకుండా వెళ్ళి పక్కన పడుకున్నాడు.

గంటసేపైన తరువాత ఇద్దరూ లేచారు. తయారై రెస్టారెంటుకు వెళ్ళారు. ఇద్దరినీ చూసి పలకరింపుగా నవ్వింది పారు. సుజి, గౌతమ్ క్యాజువల్‌గా టేబుల్ దగ్గరికి వెళ్ళబోయారు. అప్పుడే బయట మిలట్రీ వాహనం ఆగిన చప్పుడు వినిపించింది.

అందులోంచి ఇద్దరు మిలిట్రీ అధికారులు దిగి హోటల్‌లోపలికొచ్చారు.వాళ్ళను చూడగానే భోజనం చేస్తున్నవాళ్ళంతా భయంతో బిగుసుకుపోయారు.

సుజికూడా ఫ్రీజ్‌అయింది.గౌతమ్‌కూడాలోలోపల భయపడ్డాడు. కాని పైకిమాత్రం మేకపోతు గాంభీర్యంవహిస్తూ క్యాజువల్‌గా ఉన్నాడు.

ఆ ఇద్దరు అధికారులు తిన్నగా పారుదగ్గరికెళ్ళారు. ఆమెను ఏదో అడిగారు. వాళ్ళు ఏం అడిగారో తెలియదుకాని పారుమాత్రం భయంతో వణికిపోతోంది. వాళ్ళకు మెల్లగా ఏదో సర్దిచెపుతోంది. రెండు క్షణాల తరువాత ఆ మిలిట్రీ అధికారులు వెళ్ళిపోయారు.

"ఏం జరిగింది... ఎందుకు అందరూ భయపడుతున్నారు" ఆశ్చర్యంగా అడిగాడు గౌతమ్.

ఎవరో చైనీస్ మిలిట్రీ ఏజెంటును దారుణంగా చంపి చెరువులో పడేశారు. అతని శవం సిటీకి దూరంగా ఒక చెరువులో దొరికింది. అతన్ని ఎవరు చంపారో ఎందుకు చంపారో తెలియదు. ఆ విషయం తెలుసుకోవటానికి అధికారులు ఇక్కడికి వచ్చారు.

ఎవరయినా కొత్త వ్యక్తులు అనుమానాస్పదంగా ఉన్నవాళ్ళు కనిపించారా అని పారుని అడిగారు.

ఎవరూ రాలేదని పారు చెప్పింది.

వాళ్ళు వెళ్ళిపోయారు... "వాళ్ళు చాలా మెల్లగా మాట్లాడుకున్నారు కదా. నీకు ఎలా వినిపించాయి" అని సందేహంగా అడిగాడు గౌతమ్.

"వాళ్ళ మాటలు నాకు వినిపించలేదు నిజమే. కాని ఈ కేసుగురించి నాకు ముందే తెలుసు. నిన్న నేను ఆఫీసులో ఉన్నప్పుడు ఈ ఏజెంటు చావు వార్త ఆఫీసుకు చేరింది. ఆ కాల్ నా సుపీరియర్ ఆఫీసర్ రిసీవ్ చేసుకున్నాడు. ఆ సమయంలో నేను ఆ ఆఫీసర్ పక్కనే ఉన్నాను. ఇప్పుడు వచ్చిన మిలిట్రీ అధికారులు కూడా నాకు తెలుసు.

వాళ్ళు మా డిపార్ట్‌మెంట్‌లోనే పనిచేస్తున్నారు. చచ్చిపోయిన ఏజెంట్ కేసు వీళ్ళు పరిశోధన చేస్తున్నారు. వీళ్ళు మా డిపార్ట్‌మెంట్ డైరెక్టర్‌కు కాకుండా మావ్‌కు రిపోర్ట్ చేస్తారు.

"పేరుకు మాత్రమే అతను డైరెక్టర్. నిర్ణయాలన్నీ మావ్ తీసుకుంటాడు. అతని మాటలకు ఎవరూ ఎదురుచెప్పరు. చివరకు సంబంధిత మంత్రి కూడా మావ్ సూచనలను పాటిస్తాడు.

దానికి కారణాలు చాలా ఉన్నాయి. కాని చెప్పుకోవలసింది మాత్రం ముఖ్యంగా రెండు. మావ్ నీతీ నిజాయితీ. వృత్తిపట్ల అతని అంకితభావం.

దేశం అంటే అతనికి చాలా ఇష్టం, గౌరవం. దేశం కోసం ఏమైనా చేస్తాడు. ఎంతకైనా తెగిస్తాడు.

ఇటీవలే జరిగిన ఒక ఉదాహరణ చెబుతాను. ఒక మంత్రికి మాఫియాతో సంబంధం వుందని మావ్‌కి చూచాయిగా తెలిసింది. మావ్‌కు అనుమానం అంటూ రాకూడదు. వచ్చిందీ అంటే దాని అంతు చూసేదాకా విడిచిపెట్టడు"

"తన ఏజెంట్ల సహాయంతో ఆ మంత్రిగురించి వాకబు చేయించాడు. ఆ మంత్రికి ఖచ్చితంగా మాఫియాతో సంబంధం ఉందని ఆధారాలు సంపాదించాడు. నిజానికి ప్రోటోకాల్ ప్రకారం ఆ ఆధారాలను డిపార్ట్‌మెంట్ డైరెక్టర్‌కు ఇవ్వాలి.

కాని మావ్ అలా చెయ్యలేదు. తన సేఫ్‌లో పెట్టుకున్నాడు. దానికి కారణం అతనికి బొత్తిగా డైరెక్టర్ నిజాయితీమీద నమ్మకం లేకపోవటమే"

"ఇంతకీ చనిపోయిన ఆ ఏజెంట్ పేరేమిటి" అని అడిగాడు గౌతమ్.

"పింగ్‌పాంగ్" అంది సుజి.

కమ్చీదెబ్బతిన్నట్టు ఒక్కసారిగా ఉలిక్కిపడ్డాడు గౌతమ్. "అతన్ని ఎవరు చంపిఉంటారని మీరు అనుకుంటున్నారు" అని అడిగాడు.

"ఖచ్చితంగా తెలియదు. శత్రువులు ఎవరో ఆ పని చేసివుంటారని మావ్ భావిస్తున్నాడు. శత్రువులు అంటే విదేశీ ఏజెంట్లు అన్నమాట. మా దేశంలో చాలామంది విదేశీఏజెంట్లు ఉన్నారు. ముఖ్యంగా మీ దేశపు ఏజెంట్లు చాలామంది ఉన్నారు.

**(5) జరిగిన కథ**

గౌతమ్ తన ప్రియురాలు సుజితో లవర్స్ పార్క్ చేరుకుంటాడు. అక్కడికి మిలట్రీ అధికారి మావ్ కూడా వస్తాడు.

గౌతమ్ సుజీలిద్దరూ ఇండియన్‌వంటకాలు లభించే పారు రెస్టారెంట్‌లోకి వస్తారు. అక్కడ భోజనం చేసినతర్వాత గెస్ట్‌హౌస్‌కి వచ్చేస్తారు. ఉదయం వెళ్ళేటప్పుడు ఉన్న మిలట్రీ జవాన్‌లు సాయంత్రం వాళ్ళు తిరిగొచ్చేంతవరకు అక్కడే ఉండటం గమనిస్తాడు గౌతమ్.

బీజింగ్ ఎయిర్‌పోర్ట్‌లో దిగిన ప్రద్యుమన్ తనని పికప్ చేసుకునే మనిషికోసం ఎదురు చూస్తుంటాడు. ఈలోగా అక్కడ వున్న సెక్యూరిటీ గార్డ్స్ డ్రగ్స్ స్మగ్లింగ్ ఆరోపణతో ఒక వ్యక్తిని అదుపులోకి తీసుకోవటం చూస్తాడు.

చైనాలో డ్రగ్స్ స్మగ్లింగ్‌ని తీవ్రమైన నేరంగా పరిగణిస్తారు. విచారణలో ఆ నేరం రుజువైతే ఉరిశిక్షని వెంటనే అమలుచేస్తారు.

'ఆర్ యూ ప్రద్యుమన్' అని ఒక గొంతు వినిపిస్తుంది. అటుగా చూస్తాడు ప్రద్యుమన్.

ఇక జరగబోయేది చదవండి.



## ఎన్ని చేసినా...

'కంచె' తర్వాత కెరీర్ పరుగు అందుకోలేదు. 'ఓం నమో వెంకటేశాయ' తరువాతా ఊపులేదు. ఇక ఒద్దికగా, పద్ధతిగా వుంటే కుదరదనుకుంటూ అందాల హద్దులకు తెరలేపేసింది ప్రగ్యాజైశ్వాల్.

'జయ జానకి నాయిక', 'నక్షత్రం' సినిమాల్లో దాచేసిన అందాల రుచి చూపించింది. అయినా ఎవరూ పట్టించుకున్నట్లు కనపడలా.

ఒక్క 'ఆచారి అమెరికా యాత్ర' తప్ప చేతిలో సినిమాలు ఏవీ లేవు. అయినా తిరుగులేని దీక్షతో ఫోటోషూట్‌లు లాగించేసి బ్యాక్‌లెస్ అందాలతో జనాన్ని మర్చిపోనివ్వని ప్రయత్నాల్లో పడింది.

అయినా ఫోటోషూట్స్‌తో అవకాశాలు వస్తే అందరూ అదే బాట పట్టేయరూ!

వాళ్ళలో ఎవరో ఈ పాడుపని చేసివుంటారని మావ్ అనుకుంటున్నాడు. ఏది ఏమైనా కాని వాళ్ళు చాలా పెద్ద తప్పు చేశారు. తమను ఎప్పుడూ ఎవరూ పట్టుకోలేరని అనుకునివుండవచ్చు.

కాని అది చాలా పెద్ద పొరపాటు. వాళ్ళు ఎక్కడున్నా ఎక్కడ దాక్కున్నా మావ్ వెతికిపట్టుకుంటాడు. చివరకు పాతాళంలో ఉన్నా బయటకు లాగుతాడు. ఇదిమాత్రం నిజం. ఒకసారి వాళ్ళు పట్టుబడిన తరువాత ఆ దేవుడు కూడా వాళ్ళను రక్షించలేడు. మావ్ చేతిలో చిత్రవధ అనుభవిస్తారు. సరే ఈ విషయాలు పక్కన పెట్టు. ఈ రోజు మన ప్రోగ్రామ్ ఏమిటి"

"నీ ఇష్టం సుజీ. నువ్వు ఎక్కడికి అంటే అక్కడికి నేను రెడీ" అన్నాడు గౌతమ్.

"ముందు భోజనం సంగతి చూద్దాం. తరువాత ఏం చెయ్యాలో ఆలోచిద్దాం" అంది సుజి.

ఇద్దరూ పారు రెస్టారెంటులో భోజనానికి కూర్చున్నారు. సుజి నవ్వుతూ కబుర్లు చెపుతోంది. కాని గౌతమ్ మాత్రం అన్యమనస్కంగా వింటున్నాడు. సుజితో అతను పూర్తిగా ఎంజాయ్ చెయ్యలేకపోతున్నాడు. దానికి కారణం పింగ్‌పాంగ్ చావు.

నిజానికి ఆ ఏజెంటును చంపింది గౌతమ్. ఐదు రోజులకు ముందు గౌతమ్‌కు అతని బాస్‌నుంచి కాల్ వచ్చింది. అతనే పింగ్‌పాంగ్ గురించి సమాచారం ఇచ్చాడు. ఒక పెద్ద సూపర్ మార్కెట్టులో పింగ్‌పాంగ్ అనే చైనీస్ ఏజెంట్ పనిచేస్తున్నాడని అతనికి బ్లాక్ కోబ్రా గురించి తెలిసివుండవచ్చని గౌతమ్ బాస్ చెప్పాడు.

ఆ రోజునుంచి గౌతమ్, పింగ్‌పాంగ్‌ను నీడలా వెంటాడటం మొదలుపెట్టాడు. పింగ్‌పాంగ్‌ను ఆ సూపర్ బజార్‌లో అపాయింట్ చేసింది మావ్. అది పెద్ద డిపార్ట్‌మెంటల్ స్టోర్స్. పైగా మిలిట్రీ కంటోన్మెంట్ ఏరియాకు చాలా దగ్గరగా ఉంది.

సహజంగానే చాలామంది మిలిట్రీ అధికారులు ఆ షాపుకు వచ్చి వస్తువులు కొంటుంటారు. తమ కొలీగ్స్ తోటి మిలిట్రీ అధికారులను కలుసుకున్నప్పుడు సహజంగానే బ్లాక్ కోబ్రాగురించి చర్చించుకుంటారు. ఈ విషయం మావ్‌కు తెలుసు.

వాళ్ళలో ఎవరైనా అధికారి పొరపాటున బ్లాక్‌కోబ్రా గురించి మాట్లాడుకోవచ్చు. డబుల్ క్రాస్ చెయ్యటానికి ప్రయత్నించవచ్చని అనుమానంపడ్డాడు మావ్. ఆ అనుమానం తీర్చుకోవటానికి పింగ్‌పాంగ్‌నేర్పాటు చేశాడు.వాళ్ళ మాటల్ని రహస్యంగా వినటానికి పింగ్‌పాంగ్‌ను ఆ సూపర్‌బజార్‌లో నియమించాడు.

ఒకవైపు పనిచేస్తూనే ఇంకోవైపు రహస్యంగా వాళ్ళ మాటలను వినేవాడు పింగ్‌పాంగ్. ఎవరిమీద అయినా అనుమానంవస్తే వెంటనేమావ్‌కు రిపోర్ట్‌చేసేవాడు.

ప్రతిరోజూ ఉదయం పదిగంటలకు స్టోర్స్‌కు వచ్చేవాడు పింగ్‌పాంగ్. సాయంత్రం అయిదుగంటల వరకు అక్కడ పనిచేసేవాడు. తరువాత తీరుబడిగా ఇంటికి బయలుదేరేవాడు.

అతని ఇంటికి, సూపర్‌బజార్‌కు పెద్ద దూరంలేదు. పదినిమిషాలు నడిస్తే చాలు అతని ఇంటికి చేరుకోవచ్చు. అయితే చాలారోజులవరకు పింగ్‌పాంగ్ అతనికి ఒంటరిగా దొరకలేదు. ప్రతిరోజూ మధ్య దారిలో ఎవరో అతని స్నేహితుడు వచ్చి కలిసేవాడు.

ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటూ చాలాసేపు రోడ్డు మీద గడిపేవారు.

ఇలా చాలా రోజులుగా సాగుతోంది. మూడు రోజులకు ముందు గౌతమ్ యధాప్రకారము పింగ్‌పాంగ్‌ను అనుసరిస్తున్నాడు. కాని ఆ రోజు ఆశ్చర్యంగా ఎవరూ అతన్ని మధ్యదారిలో కలవలేదు. పింగ్‌పాంగ్ తిన్నగా తన ఇంటికి వెళ్ళాడు.

అతన్ని వెంటాడుతూ వెళ్ళిన గౌతమ్ లోపలికి వెళ్ళకుండా బయట నిలబడ్డాడు.

పావుగంట తరువాత పింగ్ తన తల్లి తండ్రితో బయటకువచ్చాడు. ఇంటికి తాళంవేసి ఎవరికో సెల్ ఫోన్‌లో కాల్‌చేశాడు. పదినిమిషాలతరువాత ఒక క్యాబ్ వచ్చి అతని ఇంటిముందు ఆగింది. ముగ్గురూ ఆ క్యాబ్‌లో ఎక్కడికో వెళ్ళిపోయారు.

గౌతమ్ వెంటనే మారుతాళంచెవితో అతని ఇంటి తలుపులు తెరిచాడు. తలుపులు దగ్గరగా వేసి లోపలికి వెళ్ళాడు. సిస్టమేటిక్‌గా వెతకటం మొదలెట్టాడు. బీరువాలో అతనికి ఒక ఫైలు కొన్ని ఫోటోలు కనిపించాయి. ఆత్రంగా ఆ ఫోటోలందుకుని చూశాడు.

అంతే. ఒక సునామీ అల తాకినట్టు కంపించిపోయాడు గౌతమ్. అవి గౌతమ్ ఫోటోలు. తన ఫోటోలు పింగ్‌పాంగ్ దగ్గర వున్నాయంటే పింగ్ పాంగ్‌కు తనమీద అనుమానం కల్గివుండాలి.

వీటితోపాటు ఖచ్చితంగా తనగురించి రిపోర్ట్ కూడా ఉండి ఉండాలి. వెంటనే ఫోటోలదగ్గర ఉన్న ఫైలు తీసి చూశాడు. అతని అనుమానం నిజమైంది. అందులో గౌతమ్ గురించి పూర్తిగా రిపోర్ట్ ఉంది.

చివరగా గౌతమ్ మామూలు ఎంప్లాయ్ కాదని అతను భారతప్రభుత్వం ప్రత్యేకంగా నియమించిన ఏజెంట్ అని ఉంది.కింద పింగ్‌పాంగ్‌సంతకం ఉంది. అంటే దీన్నిబట్టి తను పింగ్‌పాంగ్‌ను అనుసరిస్తున్న విషయం అతను ముందే గ్రహించాడు.

తన గురించి రహస్యంగా వాకబుచేసి అసలు విషయం తెలుసుకున్నాడు. తను ఏజెంట్ అన్న విషయం ఎంబసీలో పనిచేస్తున్న తన బాస్ ప్రకాశ్‌కు తప్ప ఇంకెవరికీ తెలియదు. చివరకు తన గరల్ ఫ్రెండ్ సుజికి కూడా తెలియదు.

అలాంటిది పింగ్‌పాంగ్‌కు ఎలా తెలిసింది. సింగ్ చెప్పే అవకాశం లేదు. అతను చాలా నిజాయితీపరుడు. దేశభక్తుడు. ఇక మిగిలింది ప్రకాశ్. అతనికి మాత్రమే తనగురించి చెప్పే అవకాశం ఉంది.

ఎంతో కష్టపడి తయారుచేసిన రిపోర్ట్స్ ఫోటోలు తన ఇంట్లోనే పెట్టుకున్నాడు పింగ్ పాంగ్.కాని డిపార్ట్‌మెంట్‌కు పంపించలేదు.అంటే మావ్‌కు తనవిషయం తెలిసిఉండకపోవచ్చు. అలా అనుకోవటానికి కూడా



**అవినీతిని అంతం చేయకుండా స్వచ్ఛమైన పాలన అందించటం కుదరదు.**

*-సర్బానంద సోనోవాల్, అసోం సి.ఎమ్.*



**చుట్టూ పదిమంది సెక్యూరిటీని పెట్టుకుని పబ్లిక్‌ని బెదిరిద్దామన్నది లాలూప్రసాద్ యాదవ్ ఎత్తుగడ.**

*-నితీష్‌కుమార్, బీహార్ సి.ఎమ్.*

వీలులేదు. ముందు మావ్‌కు తనగురించి మెసేజ్ పంపించివుండవచ్చు. తర్వాత తీరికగా ఫైల్ ఫోటోలు పంపించాలని పింగ్‌పాంగ్ అనుకునివుండవచ్చు. కొన్నిక్షణాలపాటు బుర్రపనిచెయ్యలేదు గౌతమ్‌కు.

తరువాత తేరుకుని ఫైలు ఫోటోలు తీసుకున్నాడు. ఫోటోలు జేబులో పెట్టుకుని ఫైలు తీసుకుని బయలు దేరబోయాడు. అప్పుడే బయట అడుగుల చప్పుడు వినిపించింది. బయటకెళ్ళిన పింగ్‌పాంగ్ వచ్చినట్టు న్నాడు. తనవాళ్ళతోపాటు అతనుకూడా వెళ్ళాడని అనుకున్నాడు. తిరిగిరావటానికి కొంచెంసేపు పడు తుందని అనుకున్నాడు.

కాని ఇంత తొందరగా వస్తాడని ఎంతమాత్రం ఊహించలేదు గౌతమ్.చప్పున ఫైల్‌ను బెడ్‌రూమ్‌లో మంచంకింద దాచేశాడు. జేబులోంచి రివాల్వర్ తీసి తలుపు వెనుక నక్కాడు.

ప్రద్యుమన్ తయారయి హాలులో కూర్చున్నాడు. ఇంకో గంటలో అతను ఉద్యోగలో చేర బోతున్నాడు. అప్పుడే బయట ఏదో హడావిడి జరుగు తున్నట్టు తోచింది. బయటకు వెళ్ళిచూశాడు.

ఎదురుగా రోడ్డుమీద కొన్ని మిలిట్రీ వాహనాలు ఆగివున్నాయి. అందులో చాలామంది మిలిట్రీ అధి కారులు కూర్చునివున్నారు. వాళ్ళు ఎవరికోసమో ఎదురుచూస్తున్నట్టుగా కనిపించారు.

అందరిదగ్గర సబ్‌మెషిన్‌గన్స్ ఉన్నాయి.

ఇంతలో నిన్న ప్రద్యుమన్‌ను క్వార్టర్స్‌కు తీసుకు వచ్చిన అధికారి వచ్చాడు.

తనతో రమ్మని సైగచేశాడు. ఇంటికి తాళం వేసి అతని వెంట నడిచాడు ప్రద్యుమన్. లోపలకు వెళు తున్నకొద్దీ ఇంకా ఎక్కువ హడావిడి కనిపించింది. చాలామంది మిలిట్రీ జవాన్లు గుంపులుగుంపులుగా నిలబడి మాట్లాడుకుంటున్నారు.

"ఏమిటి ఈ హడావిడి. ఎవరికోసం ఎదురుచూస్తు న్నారు మీరంతా" అడిగాడు ప్రద్యుమన్.

"ఈ రోజునుంచి అఫీషియల్‌గా ఇంగ్లీష్‌క్లాసులు ప్రారంభంకాబోతున్నాయి. దాన్ని ప్రారంభించటానికి కెప్టెన్ మావ్ వస్తున్నారు" అన్నాడు అతను. ఆ మాట వినగానే ప్రద్యుమన్ ఉలిక్కిపడ్డాడు.

కొంచెంసేపయినతరువాత ఇద్దరూ విశాలమైన ఆడిటోరియంలోకి ప్రవేశించారు. అప్పటికే చాలా మంది మిలిట్రీ అధికారులు కూర్చునివున్నారు. వాళ్ళకెదురుగా పెద్ద డయాస్ ఉంది. దానిమీద ఒక పెద్ద టేబుల్,కొన్ని కుర్చీలున్నాయి. "ప్రస్తుతం మీరిక్కడ కూర్చోండి. మావ్ వచ్చినతరువాత మిమ్మల్ని ప్రత్యేకంగా పిలుస్తారు" అని చెప్పి తన సహచరులతో మాట్లాడటానికి వెళ్ళిపోయాడు ఆ అధికారి. ఒంటరిగా కూర్చున్నాడు ప్రద్యుమన్. అతను ఎంతోసేపు ఆగవలసిన అవసరం లేకుండా పోయింది. పదినిమిషాల తరువాత ఆడిటోరియం ముందు ఒక మిలిట్రీ జీపు ఆగింది.

అందులోంచి ముందు ఇద్దరు మిలిట్రీ అధికా రులు దిగారు. తరువాత నింపాదిగా మావ్ దిగాడు. హాలులో కూర్చున్నవాళ్ళంతా మర్యాదగా లేచి నిల బడ్డారు.ప్రద్యుమన్ కూడా లేచాడు.

మావ్ గురించి రికార్డ్స్‌లో చదివాడు అతను,కాని ఎప్పుడూ చూడలేదు. కాని అతనిగురించి పూర్తిగా తెలుసుకున్నాడు ప్రద్యుమన్. ప్రపంచంలో నెంబర్ వన్ ఏజెంట్ అని మావ్‌కు పేరు ఉంది.

అందుకే మావ్ ఎత్తుగా, బలంగా ఉంటాడనిఅను కున్నాడు. కాని అతని ఊహకు విరుద్ధంగా చాలా మామూలుగా ఉన్నాడు మావ్. సన్నగా, పొడుగ్గా, రివటలా ఉన్నాడు. ఫుల్ సూట్ వేసుకున్నాడు.

ఆ సూట్ వెనుక బలమైన శరీరం దాగివుందని ప్రద్యుమన్‌కు తెలుసు. మావ్ మరికొంతమంది అధి కారులు డయాస్ మీదకు వెళ్ళి నిలబడ్డారు.

మామూలు సభ ఫార్మాలిటీస్ పూర్తయినతరువాత మావ్ మాట్లాడటం మొదలుపెట్టాడు."కామ్రేడ్స్ ఈ రోజు ఇక్కడ ఇంగ్లీషు పాఠాలు ప్రారంభించటంనాకు చాలా సంతోషంగా ఉంది.

ప్రపంచభాషఅయిన ఇంగ్లీష్‌కు ఎంత ప్రాధాన్యత ఉందో మీకు తెలుసు. వ్యాపార వాణిజ్యరంగంలోనే కాకుండా డిఫెన్స్ రంగాలలో కూడా ఇంగ్లీష్ భాష ఎంతో ప్రాముఖ్యతను సంతరించుకుంది. ఇంగ్లీష్ రాకపోతే మనం అభివృద్ధిని సాధించలేం. ఇతర దేశాలతో పోటీపడలేం. ముఖ్యంగా ఇతర దేశాలతో స్నేహసంబంధాలు సాధ్యంకాదు.

ఒక్కమాటలో చెప్పాలంటే ఇంగ్లీష్ రాకపోతే మనుగడ అసలు లేదు. ఈ విషయం గుర్తించిన ప్రభుత్వం మన మిలిట్రీ అధికారులకు ఇంగ్లీష్ నేర్పించాలని నిశ్చయించుకుంది.ఈ భాషను పెద్దపెద్ద అధికారులు మాత్రమే కాకుండా మామూలు మిలిట్రీ జవాన్లుకూడా తప్పకుండా నేర్చుకుని తీరాలి.

ఆ మేరకు ప్రభుత్వం చట్టంకూడా చేసింది. అందుకే మంచి ఇంగ్లీష్ ట్యూటర్‌కోసం ప్రపంచంలో అన్ని పత్రికలలో ప్రకటనలు ఇచ్చింది"

"చాలా దేశాల్లో ఈ ప్రకటనకు పెద్ద స్పందన రాలేదు. కాని ఇండియాలో మాత్రం విశేషంగా స్పందనవచ్చింది. ఆ దేశంలో బాగా చదువుకున్న ఇంగ్లీష్ ప్రొఫెసర్స్ చాలామంది ఈ పోస్ట్‌కు అప్లయ్ చేశారు. వాళ్ళందరినీ కూడా ఇంటర్వ్యూ చేశాం. వాళ్ళలో ఒక వ్యక్తిని సెలక్ట్ చేశాడు మన అధికారి. అతనే ప్రద్యుమన్.

ప్రద్యుమన్‌కు ఇంగ్లీష్‌భాషలో ప్రావీణ్యంమాత్రమే కాకుండా గొప్ప కమ్యూనికేషన్ స్కిల్స్‌కూడా ఉన్నాయి. చాలా చక్కగా మాట్లాడతాడు. అందంగా, సింపుల్‌గా, చక్కగా రాస్తాడు కూడా. అందుకే అధికారి అతన్ని సెలెక్ట్ చేసి ఇక్కడికి పంపించాడు. అది గతం"

"ప్రస్తుతానికి వస్తే ప్రద్యుమన్ ఇప్పుడు ఇక్కడే ఉన్నాడు. అతన్ని అందరికీ పరిచయం చేస్తాను"అని తన పక్కన ఉన్న అధికారితో ఏదో చెప్పాడు మావ్.



## పూర్తి అంకితభావం

ప్రేమలో వైఫల్యాలు వున్నా కెరీర్ పరుగులో మాత్రం పదిహేనేళ్ళుగా ముందు వుంటూనే ఉంది నయనతార. పారితోషికం విషయంలోనూ వెనక్కి తగ్గడంలేదు.

దక్షిణాది అగ్రనాయికగా గుర్తింపు కొట్టేసింది. ఆమె తాజా తమిళ సినిమా 'ఆరమ్'బాక్సాఫీస్ వద్ద సంచలనం రేపుతోంది.సక్సెస్‌గురించి నయనను కదిలిస్తే,కళ్ళలో వెలుగులు కమ్మేశాయి.

"ఏ సినిమాను అంగీకరించినా పూర్తి అంకిత భావంతో పనిచేస్తాను. ఏ రోజూ నేను ఆత్మవిశ్వాసాన్ని కోల్పోను. నటన అని కాదు, జీవితంలో ఏ పని చేసినా ఇదే ధోరణితో వ్యవహరిస్తాను" అని చెప్పింది. నయన చేతిలో ప్రస్తుతం ఒకటీ రెండూ కాదు, అరడజను సినిమాలున్నాయి.

## నటనకు బ్రేక్

'చిన్నారి పెళ్ళికూతురు' అవికాగోర్ వెండితెరకు దూసుకువచ్చింది కాని, అవకాశాలు నిల్. ఇప్పటి దాకా తన ప్రయత్నాలు సాగిస్తూ వచ్చిన అవిక ఇక లాభంలేదనుకుందో ఏమోకాని, 'సినిమాల్లో నటించను' అంటూ ఓ స్టేట్‌మెంట్ విసిరింది.

పైగా నటనపట్ల ఆసక్తి లేదని, ఇక తన దృష్టి అంతా దర్శకత్వం వహించడంపైనే అనికూడా పనిలోపనిగా చెప్పేసింది.

నటనకు శాశ్వతంగా స్వస్తి చెప్పడంలేదని, తాత్కాలిక విరామం అంటూ ఎందుకైనా మంచిదన్నట్లు ముందు జాగ్రత్తగా చెప్పుకున్నది.

ఈలోగా ఏవైనా మంచి అవకాశాలు తలుపు తడితే అభిప్రాయం మార్చుకుంటుందేమోలే!



ఆ అధికారి ప్రద్యుమన్ వైపు చూసి డయాస్ మీదకు రమ్మని సైగ చేశాడు. ఇద్దరు జవాన్లు ప్రద్యుమన్‌ను మర్యాదగా డయాస్ మీదకు తీసుకువెళ్ళారు.

"వీరే కామ్రేడ్ ప్రద్యుమన్. మన కొత్త ఇంగ్లీష్ ట్యూటర్. వీరికి ఘనంగా స్వాగతం చెప్పండి" అని చైనీస్‌భాషలో చెప్పాడు మావ్.

కూర్చున్నవాళ్ళంతా నవ్వుతూ లేచి చప్పట్లు కొట్టారు. ఆ తరువాత ప్రద్యుమన్ మాట్లాడాడు. "దేశాన్ని రక్షించే మిలిట్రీ అధికారులకు ఇంగ్లీష్ నేర్పిస్తున్నందుకు నాకు ఆనందంగాను, గర్వంగానూ ఉంది. ఇది నా అదృష్టంగా భావిస్తున్నాను.

ఈ గొప్ప అవకాశం ఇచ్చిన చైనా ప్రభుత్వానికి నా కృతజ్ఞతలు తెలియచేసుకుంటున్నాను. మీరందరూ నామీద పెట్టుకున్న నమ్మకాన్ని వమ్ముచెయ్యను. ఇంతకంటే నేను ఇంకేం చెప్పలేను సెలవు" అని పూర్తిచేశాడు ప్రద్యుమన్.

అందరూ అభినందిస్తూ చప్పట్లు కొట్టారు. లాంఛనంగా ఇంగ్లీష్ క్లాసులు ప్రారంభించినతరువాత మావ్ హడావిడిగా వెళ్ళిపోయాడు. అతను వెళ్ళిపోవటంతో అధికారులందరూ రిలాక్స్ అయ్యారు.

ఆ తరువాత వెంటనే క్లాసులు మొదలుపెట్టాడు ప్రద్యుమన్. సాయంత్రం నాలుగు గంటలవరకు క్లాసులు తీసుకున్నాడు. అధికారులు గుంపులు గుంపులుగా వస్తున్నారు. పాఠాలు చెప్పించుకుని వెళుతున్నారు. ఎవరికి తీరిక ఉన్నప్పుడు వాళ్ళు వస్తున్నారు.

ఈ తతంగం నాలుగు గంటల వరకు సాగింది. ఆ టైమ్ తరువాత ఎవరూ రాలేదు. ప్రద్యుమన్ తన క్వార్టర్స్ చేరుకున్నాడు. పుస్తకాలు టేబుల్‌మీద పెట్టి అలసటగా మంచంమీద కూర్చున్నాడు.

కడుపులో ఆకలి ఆవురు ఆవురంటోంది. ఉదయం హడావిడిగా బయలుదేరటంతో టిఫిన్ తినే టైమ్‌కూడా లేకపోయింది. విశ్రాంతి లేకుండా క్లాసులు తీసుకోవటం వల్ల భోజనానికి వెళ్ళే టైమ్ దొరకలేదు. అప్రయత్నంగా తల్లి-చెల్లెలు గుర్తుకువచ్చారు అతనికి.

చైనా చేరినవెంటనే వాళ్ళకు కాల్‌చేస్తానని చెప్పాడు. కాని కంగారులో హడావిడిలో కాల్‌చెయ్యటం మరచిపోయాడు. వెంటనే సెల్ తీసి ఇంటికి కాల్ చేశాడు.

"ఎలా ఉన్నావు బాబూ, నీ దగ్గరనుంచి కాల్‌రాకపోయేసరికి చాలా కంగారుపడ్డాను" అంది అతని తల్లి.

"నేను చాలా సంతోషంగా, ఆనందంగా ఉన్నాను. వెంటనే ఉద్యోగంలో చేరటంవల్ల నీతో మాట్లాడటానికి వీలు లేకుండాపోయింది.ఏం అనుకోకు.డబ్బుఏమైనా కావాలంటే చెప్పు పంపిస్తాను. స్వాతి ఎలా ఉంది కాలేజీకి వెళుతోందా" అడిగాడు.

"చక్కగా వెళుతోంది. ఈ రోజు కూడా వెళ్ళింది. ఇంకా రాలేదు. వచ్చిన వెంటనే నీకు కాల్ చెయ్యమని చెపుతాను" అంది తల్లి.

"అలాగే వీలుచూసుకుని మళ్ళీ కాల్ చేస్తాను. ఉంటాను బై" అని లైన్ కట్‌చేశాడు ప్రద్యుమన్.

అప్పుడే మెల్లగా చీకటిపడుతోంది. భోజనం చెయ్యటానికి ఇంకా టైమ్ ఉంది. ఈలోగా ఒక కప్పు కాఫీ తాగాలనిపించింది అతనికి. కిచెన్‌లోకి వెళ్ళి కాఫీ చేసుకుని హాలులోకి వచ్చాడు. అప్పుడే అతని క్వార్టర్ ముందు వాహనం ఆగిన చప్పుడు వినిపించింది.

ఎవరొచ్చారు అనుకుంటూ వెళ్ళి తలుపు తీశాడు. ఎదురుగా ఒక మిలిట్రీ అధికారి కనిపించాడు.

"మిస్టర్ ప్రద్యుమన్ నా పేరు లీ. మీతో కొంచెం మాట్లాడాలి. లోపలికి పదండి" అన్నాడు అతను.

"చెప్పండి..." అన్నాడు ప్రద్యుమన్ లోపలికి వచ్చిన తరువాత.

"పెద్ద విషయం కాదు. నాకు రోజూ క్లాసులకు రావటానికి వీలుపడదు. అందుకే సాయంత్రం ఒక గంటసేపు మీరు వీలుచూసుకుని నాకు పాఠం చెప్పండి చాలు" అన్నాడు లీ. "తప్పకుండా, అది నా డ్యూటీ. మీకు ఏ టైమ్ అనుకూలంగా ఉంటుందో చెప్పండి" అని అన్నాడు ప్రద్యుమన్.

"అయిదుగంటలైతే నాకు సౌకర్యంగా ఉంటుంది. ఆ టైమ్‌కు రమ్మంటారా, మీకు అభ్యంతరం లేదు కదా" అన్నాడు లీ."నాటెటాల్ మీరు ఎప్పుడు వచ్చినా నేను చెప్పటానికి సిద్ధం. అందుకే కదా, మీరు నాకు జీతం ఇస్తున్నది" అన్నాడు ప్రద్యుమన్.

"చాలా సంతోషం.ఆ సమయంలో ఇంట్లో ఎవరూ ఉండకుండా చూడండి" అన్నాడు లీ.

"నాకు ఈ ఊరు చాలా కొత్త. స్నేహితులు కాని, పరిచయస్థులు కాని ఎవరూ లేరు. నేనుతప్ప ఈ ఇంట్లో ఎవరూ ఉండరు. మీరు నిరభ్యంతరంగా రావచ్చు" అన్నాడు ప్రద్యుమన్.

"గుడ్. అయితే రేపటినుంచి వస్తాను. ఈ విషయంమాత్రం ఎవరికీ చెప్పకండి" అనిచెప్పి వెళ్ళిపోయాడు లీ. వెంటనే ప్రద్యుమన్ క్వార్టర్స్ తాళంవేసి సింగ్ రెస్టారెంటుకు వెళ్ళాడు.

"రేపు ఆదివారం కదా, నీ ప్రోగ్రామ్ ఏమిటి" అని అడిగాడు సింగ్.

"ఈ దేశానికి కొత్తవాడిని. నాకంటూ ప్రత్యేకంగా ప్రోగ్రాం ఏముంటుంది. హాయిగా నీ క్యాంటిన్‌లో కడుపునిండా తిని క్వార్టర్స్‌లో రెస్ట్ తీసుకుంటాను" అన్నాడు ప్రద్యుమన్.

"ఐతే నాతో వస్తావా" ఆత్రంగా అడిగాడు సింగ్.

"ఎక్కడికి"

"రేపు మా ఇంట్లో చిన్న ఫంక్షన్ ఉంది.బాగా దగ్గర వాళ్ళను, పరిచయస్థులను మాత్రమే పిలిచాను. నువ్వుకూడా వస్తే బాగుంటుంది.పైగా నా భార్యకూడా సంతోషపడుతుంది" అని అన్నాడు సింగ్.

"నాకు తాగుడలవాటులేదు. మీకు ఏ విధంగానూ కంపెనీ ఇవ్వలేను" అన్నాడు.

"ఏం ఫర్వాలేదు బాయ్. నువ్వు వస్తే చాలు.మాకు అంతకంటే కావల్సింది ఏంలేదు. ఐనా ఒంటరిగా కూర్చుని ఏం చేస్తావు. నలుగురితో కలిసి తిరిగితే టైంపాస్ అవుతుంది. హోమ్‌సిక్ కూడా పోతుంది"

**ఇంకా ఉంది**



నేను రాజకీయాలలోకి రావటంలేదు... ఆ ఆలోచనకు నా భార్య అనుమతి లేదు.

-రఘురామ్ రాజన్
రిజర్వ్ బ్యాంక్ మాజీ గవర్నర్

సురేష్ పద్మనాభన్

Cell : 81860 00039 www.themoneyworkshop.com






# ఐ లవ్ మనీ

భారతీయ సంప్రదాయంలో ఇల్లాలు లక్ష్మీదేవి వంటిది. లక్ష్మీదేవిని ఇంటిలోకి స్వాగతించే శక్తిగలది ఇల్లాలే. సంపద సృష్టిలో ఆమె బాధ్యత విస్మరించలేనిది.






స్వాతి సపరివార పత్రిక 29.12.2017




రాత్రి గడిచి ఉదయం రాబోతోంది. ఇంకా సూర్యోదయం కాలేదు.

కాని ఆ ఇంటి ఇల్లాలు మాత్రం అప్పటికే నిద్ర లేచింది. ఇంటిముందు చీపురుతో చిమ్మి, కసువు ఎత్తి పోసి, కళ్ళాపి చల్లి ముగ్గుపెట్టింది.

ఇలా పనిచేసుకుంటూనే కొత్త ఉదయానికి స్వాగత ప్రార్థనలు చేస్తోంది. పెరటిలోని తులసిమొక్కకు నీరు పోసి ఆ కోట ముందు ముగ్గులు దిద్దింది. ఇంట్లోకి వచ్చి ఇంటిలోపలిభాగం శుభ్రంచేసి, స్నానమాచరించి అప్పుడు పూజగదిలోకి అడుగుపెట్టింది. పెరటిలోని పూలచెట్లనుండి కోసిన పూలతో పూజగదిని అలంకరించి దీపం వెలిగించింది.

అప్పుడు తన భర్తక్షేమం కాంక్షిస్తూ ప్రార్థనచేసింది. కుటుంబసభ్యులందరి క్షేమం కోరుతూ ప్రార్థనలు చేసింది. ఆమె పూజ ముగిసేసరికి ఇంటి వాతావరణమే మారిపోయి ప్రశాంతత నిండింది.

అప్పుడు ఆ ఇంటి వాతావరణంలో వున్న ఆకర్షణ ఎటువంటిదంటే సంపదలనొసగే లక్ష్మీదేవి ఆ ఇంటిలో వచ్చి వుండిపోవాలి అని అనుకుంటుంది. ఇంటికోసం ఆడవారు

Faith keeps the man who has faith in him.

## ఇది చదివినవారికి డబ్బు వశమవుతుంది

చేసే సేవలని అంచనావేయటం చాలా కష్టం.అంతే కాదు ఇంటికోసం అంతగా పాటుపడే ఆడవారిని గృహిణి అనటం పొరపాటు.

వారిని గృహఅధికారిణి అనో లేదా గృహనిర్మాత అనో అంటే ఎంతో సమంజసంగా వుంటుంది.

**ఇం**టి బాధ్యత మొత్తం ఆమే చూసుకుంటుంది. పిల్లల అవసరాలు, వంట, ఇంకా ఎన్నో చిన్నా పెద్దా పనులు ఆమె చేస్తుంది. ఇలా ఇంటి పనులతోపాటుగా ఉద్యోగ బాధ్యతలు లేదా ఇతర వ్యాపారవృత్తులను కూడా నిర్వహించే ఆడవారు వున్నారు.

ఆ ఆడవారి సమర్థతకు జోహార్లు. ఇంట్లో భర్తకు లేదా పిల్లలకు జబ్బుచేస్తే వారికి శ్రద్ధగా సేవలు చేస్తుంది. అసలు త్యాగానికి మరోరూపంగా, భక్తికి ప్రతీకగా ఆమె నిలుస్తుంది.

భర్త తన శక్తియుక్తులను ఉపయోగించి కుటుంబానికి అవసరమైన డబ్బుసమకూర్చటం లేదా సంపదను సృష్టించటం చేయగలుగుతాడు. ఆ సంపద సృష్టిలో ఆమె బాధ్యత విస్మరించలేనిది. భారతీయ సంప్రదాయంలో ఇల్లాలు లక్ష్మీదేవివంటిది. ఆమె మనసు నొప్పించకుండా జాగ్రత్తగా చూసుకోండి అని పెద్దలు చెపుతారు. లక్ష్మీదేవిని ఇంటిలోకి స్వాగతించే శక్తిగలది ఇల్లాలే.

(వచ్చేవారం వస్తా)

కామెడీ కథ

# లాస్య మా పెళ్ళికి వచ్చిందోచ్!

"నీ పెళ్ళి నీకు గొప్ప. కాబోయే నీ భార్యకిగొప్ప. కాని మాకు గొప్పది అవ్వదు కదా!"

మిత్రుడి మాటలకు నివ్వెరబోయాడు సూరిపండు.

"అదేంట్రా అలా అంటావ్. నేన్నీ ఫ్రెండుని కాదా? మనం నిక్కర్లేసినప్పట్నుంచి కలిసి తిరుగుతున్నాం తెలుసా?" అన్నాడు సూరిపండు.

"కాదనటంలేదురా. ఉన్న సంగతి చెబుతున్నా. పోయింది. "బెస్ట్ ఫ్రెండ్‌వి అంటే నువ్వేరా. ఎవర్ని పిలవమంటావో అదీ నువ్వేచెప్పరా. మా మావగారికి పొలిటికల్ కనెక్షన్లు బాగా ఉన్నాయి. ఒకరిద్దరు మంత్రుల్ని పిలవమని చెప్పనా?"

నోరు చప్పరించేశాడు మిత్రుడు. "వాళ్ళొస్తే వాళ్ళ వెంట వాళ్ళ పార్టీ వాళ్ళే వస్తారు. వాళ్ళకే జైజైలు కొడతారు. వాళ్ళకీ, వాళ్ళతో వచ్చే పోలీసులకీ మర్యాదలు పెళ్ళి న్యూసూ అన్నిట్లోమార్మోగిపోతాయి. కాని నన్ను సినిమావాళ్ళు ఎరగనే ఎరగరు. నేనెవరి అభిమాన సంఘం వాడినీ కాదు. మరి నా పెళ్ళికి వస్తారం




మా అందరి దృష్టి భోజనాల మీదే ఉంటుంది. పది రకాలతో వడ్డించారంటే 'ఆహా పెళ్ళి' 'ఓహో పెళ్ళి' అని చెప్పుకుంటాం. అలా కాకుండా నీ పెళ్ళి అందరికీ గొప్పగా అన్పించాలంటే, అంతా ఎప్పటికీ గొప్పగా చెప్పుకోవాలంటే ఏదోగొప్ప ప్రత్యేకత ఉండాలి! ఎప్పటికీ మరచిపోనట్టుగా ఉండాలి!"

బుర్ర గోక్కుంటూ, "డొంక తిరుగుడొద్దు. చెప్పాలనుకున్నదేదో సూటిగా చెప్పేసెయ్" అన్నాడు.

"ఎవరైనా వీవీఐపీఅంటే మంత్రిగారో మరో ప్రముఖుడో ఎవరో ఒక సెలబ్రిటీ నీ పెళ్ళికి వచ్చారనుకో, నా సామిరంగా సీన్ ఎలాఉంటుందో ఊహించుకో. ఆ తర్వాత ఊళ్ళో ఎన్నిపెళ్ళిళ్ళు జరిగినా ప్రతి పెళ్ళిలోనూ నీ పెళ్ళిగురించే మాట్లాడుకుంటారు"

సూరిపండు ముఖం మహదానందంతో వెలిగి చేసేసరికి మీ మావగారి తలప్రాణం తోకకొస్తుంది"

"ఊరికే నసతో చంపక నీ బుర్రని తొలుస్తున్న పురుగుపేరేంటో త్వరగా బయటపెట్టరా బాబూ"

"అక్కడికే వస్తున్నా. మీ మావగారికి గుంజు బాగా ఉంది గనుక ఒక సినిమా స్టార్ని నీ పెళ్ళికి పిలవమని గట్టిగా పట్టుపట్టు. పెళ్ళికి ముందు నువ్వేదడిగినాగి ఇచ్చేస్తాడు" "వావ్!" వాటేసుకున్నాడు మిత్రుడ్ని.

"అప్పుడు పత్రికలవాళ్ళు, టీవీ వాళ్ళు అమాంతం వచ్చి పడతారు. మాతో కలిసి దిగిన ఫొటోలూ, మా

**సింహప్రసాద్**

టావా?" సందేహం వెలిబుచ్చాడు సూరిపండు.

"నీ ముఖం కాదు, డబ్బుముఖం చూసి ఎగిరి మరీ వచ్చేస్తారు" చిద్విలాసంగా నవ్వాడు.

"ఎలాగెలాగ?" అడిగాడు సూరిపండు.

"ఇవాళ రేపు ప్రతీదానికీ రేట్ల బోర్డులు పెట్టేశారు సినిమావాళ్ళు. రిబ్బన్ కటింగ్‌కి వస్తే ఇంత. పెళ్ళికి వస్తే అంత. పెళ్ళిలో రికార్డింగ్‌డ్యాన్స్ చేస్తే మరింత"చెప్పాడు సూరిపండు స్నేహితుడు.

"డ్యాన్సులు కూడా చేస్తారా...?" ఆశ్చర్యార్థకంగా ముఖం పెట్టాడు సూరిపండు.

"పండూ! పింకునోట్లు ఎవర్నైనా జంపింగులు చేయిస్తాయిరా. డబ్బు పారెయ్యాలి గాని హెయిర్ కటింగ్ సెలూన్ ఓపెనింగుకి సైతం నటీమణులు

వచ్చేస్తారు" అన్నాడు సూరిపండు స్నేహితుడు.

"ఇంకేం చెప్పొద్దు. ఎంత ఒత్తిడైనా సరే తెచ్చి మావగార్ని ఒప్పించేస్తాను. ప్రముఖ నటినో నటుడ్నో నా పెళ్ళికి రప్పిస్తాను. బంధుమిత్రులంతా మూర్ఛ పోయేలా నా పెళ్ళి జరుగుతుంది.

"చూడు" చిన్న సైజు ఛాలెంజ్ విసిరాడు.

తిన్నగా కాబోయే మావగారింటికెళ్ళి కాబోయే భార్య సుమకి తన ఆలోచన వివరించి మరీ చెప్పాడు సూరిపండు. సంగతి వింటూనే ఆమె ఓ ఎక్సైట్ అయిపోయింది. అమాంతం అతడ్ని ముద్దు పెట్టేసుకుంది. "ఎంత గొప్ప ఐడియా! ఈ ఐడియా మన పెళ్ళి తీరుతెన్నుల్ని మార్చేస్తుంది" అంటూ ఉబ్బి తబ్బిబ్బైపోయింది సుమ.

"మన పెళ్ళికి గ్లామర్ తీసుకురావాలనే నా తాపత్రయం" ఫోజు కొట్టాడు.

"ఎవర్ని పిలుద్దామంటావ్?"

"ఫేడవుట్ ఐనవాళ్ళుతప్ప ఎవరైనా నాకు ఓకే"

"యంగ్ ఎనర్జిటిక్ హీరో సోమేష్‌ని పిలుద్దామా? అతడంటే నాకెంతో ఇష్టం. అసలు అతడ్నే పెళ్ళి చేసుకుందామని కలలు కన్నాను. కాని ప్చ్... అతడికి ఇద్దరు పిల్లలంట!" అంది సుమ.

సుమ ఎంతో బాధపడిపోతోంటే సూరిపండు ముఖం మాడినదోసెలా అయిపోయింది అన్నాడు.

"వద్దు వద్దు అతడొద్దు. ఆ ఊసులు ఇంకెప్పుడూ నా దగ్గరే కాదు ఎవరి దగ్గరా ఎత్తకు. నీకు లవ్ ఎఫైర్ ఉందని అంతా చెవులు కొరుక్కుంటారు. అది నేను వినలేను, భరించలేను" వికారంగా ముఖం పెట్టుకుని అన్నాడు సూరిపండు.

ఆమె భయపడినట్టు నటిస్తూ లెంపలేసుకుంది. "చెప్పన్లేగాని, ఎవర్ని పిలిస్తే బావుంటుందంటావ్?"

"ఎవరైనా అందాల యువనటిని పిలుద్దాం. ఆవిడైతే కుర్రకారు, పెద్దకారు అని లేకుండా అంతా ఎగబడ్తారు. ఈలలేసి నానా హంగామా చేస్తారు"

బుంగమూతి పెట్టుకుని "నీ అభిమాన నటిని పిలవకూడదు మరి" అంది.

"నాకసలు అభిమాన నటీనటులే లేరు. ఒట్టు" అంటూ తలమీద చెయ్యిపెట్టుకున్నాడు.

"సరే అయితే మా నాన్నగార్ని అడుగుదాం పద. చాలా ఖర్చవుతుందంటారేమో" సందేహిస్తూ అంది.

"మన పెళ్ళి జరగాలంటే ఆ మాత్రం ఖర్చు భరించాల్సిందే" సర్రున గుర్రున చూసింది.

"కట్నం బదులు ఈ ఖర్చు పెట్టమంటున్నావా? అలా అయితే నాకీ పెళ్ళొద్దు. కట్నం పుచ్చుకునే వాడ్ని పెళ్ళిచేసుకోనని ఇంటర్లో ఉండగానే ప్రతిజ్ఞచేశాను తెలుసా?"

"అహహ అబ్బెబ్బే అలాంటిదేం కాదు. ఇదివరకే చెప్పానుగా. కట్నం తీసుకునేవాడు గాడిద అనే నా నమ్మకమూనూ. కాని ఈ ఖర్చు వేరు. ఇది భోజనాలఖర్చు. పెళ్ళిమంటపం ఖర్చు, బ్యాండ్‌మేళం ఖర్చు లాంటిదే సుమా. నన్ను నమ్ము" ప్రాధేయపడ్డాడు సూరిపండు.

## కళ్ళకు కనెక్ట్ అవుతారు

కళ్ళతోనే కబుర్లు చెప్పగల అనుఇమ్మాన్యుయేల్ చేతినిండా సినిమాలే. కళ్ళే తన ఎసెట్స్ అని కించిత్ గర్వంతో చెప్తున్నది కూడా.

"నా కళ్ళే నాకు ప్లస్. భారతీయ సినీ ప్రేక్షకుల కళ్ళూ ఎక్కువ కనెక్ట్ అవుతుంటాయి. నేనుకూడా కళ్ళతో హావభావాలు ప్రకటించడం ముఖ్యమని భావిస్తాను. ఎంతో జాగ్రత్త తీసుకుని ఎక్స్‌ప్రెషన్లు వ్యక్తం చేయాల్సివుంటుంది.

కళ్ళతో బాగా నటించగలగడాన్ని సీనియర్ తారలనుంచి నేర్చుకున్నాను" అని చెప్తున్న అనుఇమ్మాన్యుయేల్ 'అజ్ఞాతవాసి' సినిమాకోసం డబ్బింగ్‌కూడా చెప్తోంది.



ఆపైన తండ్రి ఆఫీసుగదిలోకి సూరిపండుని తీసుకెళ్ళింది. సుమ తండ్రి సుందర్రావు వ్యాపారస్తుడు. అపరాల హోల్‌సేల్ వ్యాపారం చేస్తూంటాడు.

"రావోయ్ రా అల్లుడూ. పెళ్ళి పనులు ఎందాకా వచ్చాయి" "చకచకా జరుగుతున్నాయి అంకుల్"

"ఏవిటిద్దరూ కలిసికట్టుగా వచ్చారు? హనీమూన్ ప్యాకేజ్ గురించి మాట్లాడ్డానికా?"

"కాదు నాన్నగారూ. మా పెళ్ళి అందరి పెళ్ళిలా సాదాసీదాగా తూతూ మంత్రంలాగా జరక్కూడదు. పదేళ్ళదాకా అంతా మా పెళ్ళి గురించే చెప్పుకోవాలి. అంత గ్రాండ్‌గా జరగాలి. అందుకని ఓ ప్రముఖ సినిమా నటిని గెస్ట్‌గా పిలిస్తే బావుంటుందంటున్నారు మీ అల్లుడు గారు..." అంది సుమ.

"పిలవటానికేం పిలవొచ్చు. ఒక్కర్నేం ఖర్మ సినిమావాళ్ళందర్నీ పిలవొచ్చు. మనం పిలవగానే రావడానికి వాళ్ళేం పనీపాటాలేనివాళ్ళు కాదుగా!"

"పారితోషికం ఇస్తే పరుగెత్తుకుని వచ్చేస్తారంట" సూరిపండు వంక మిర్రి చూశాడు సుందర్రావు.

"ఎదురు డబ్బిచ్చి పిలవాలన్న మాట. పిలిచామే అనుకో, వాళ్ళొచ్చి వాళ్ళ హంగూఆర్భాటంచూపించి" ఆ పై మాటలు మింగేశాడు. అతడికి లాస్య గుర్తొచ్చింది. ఆ వెంటనే ఆమె సెక్సీ ఫిగరు కళ్ళముందు మెరిసింది. లాస్య అంటే సుందర్రావుకి ఎంతో ఇష్టం. ఇదివరకు ఎన్నడూ టీవీముఖంచూసేవాడు కాదు.

ఒకసారి లాస్య యాంకరింగ్‌చేస్తున్న ఓ ప్రోగ్రాం చూశాడు. నడకలో హావభావాల్లో సెక్సీతనం ఒలకబోయటం చూసి అమాంతం ఆమె వీరాభిమానిగా మారిపోయాడు.



టాలెంట్, మెరిట్ ఆధారంగా అవకాశాలు అందించే ఏకైక పరిశ్రమ సినీపరిశ్రమ.

-రాణీముఖర్జీ, నటి

అదిగో అప్పట్నుంచి ఆమెప్రోగ్రాంచూడటం అతడికి ఒక తప్పనిసరి కార్యక్రమం అయిపోయింది.

ఆమె ఈమధ్య సినిమాల్లో నటిస్తోంది. ఎక్కువగా ఐటమ్ సాంగ్స్ చేస్తూ జనాన్ని వెర్రెక్కిస్తోంది. అఫ్‌కోర్స్, ఆమె సినిమాలన్నీ ఒక్కోటీ రెండేసి సార్లుచొప్పున చూశాడు సుందర్రావు.

"పెళ్ళి కుదిరాక నువ్వడిగిన మొదటి కోరిక గనుక ఒప్పేసుకుంటున్నాను అల్లుడూ. నా మిత్రుడొకరికి లాస్య తెలుసు. బుల్లితెర నటి గనుక తక్కువలో వస్తుంది. ఆమెని పిలిచేద్దాం" చిన్న అబద్ధం జోడించాడు. "గ్రేట్ అంకుల్. మీరు నిజంగా గ్రేటే. ఉత్త గ్రేట్ కాదు గ్రేటెస్ట్" పొగిడాడు సూరిపండు.

సుమమాత్రం తండ్రివంక పిసరంత అనుమానంగా చూసింది. పుట్టినరోజుకికూడా అదనంగా ఒక్క రూపాయి ఖర్చుపెట్టనిఅతడు, సినిమా నటిని పిలవడానికి ఒప్పుకోవడం ఆమెకి నమ్మశక్యంగా లేదు.

అడిగీ అడగంగానే లాస్యని పిలుద్దామనడంలో తండ్రి ఉద్దేశాన్ని శంకించకుండా ఉండలేకపోయింది. ఆమె అంటే అతడికెంత ప్రత్యేకమైన 'ఇదో' ఆమె గమనిస్తూనే ఉంది. 'తల్లికి అన్యాయం చేస్తున్నానా' అని ఓ పక్కన మనస్సు పీకుతుంటే అంది "ఆవిడైతే పెళ్ళికొచ్చి నాలుగు అక్షింతలేసి వెళ్ళిపోతే చాలు. గంటలకొద్దీ ఉండక్కర్లేదు"

"అలాగే మాట్లాడదాం. అల్లుడు గారు అలుగుతారేమోనని ఒప్పుకుంటున్నానంతే" అంటూ పరోక్ష క్లారిఫికేషనూ ఇచ్చాడు.

"త్వరగా లాస్య ప్రోగ్రామ్ కన్ఫర్మ్ చేయండి అంకుల్. ఫ్రెండ్స్‌కి చెప్పాలి" అన్నాడు సూరిపండు.

## హృదయానికి దగ్గరగా

**బాలీవుడ్**కు పరుగుపెట్టేసి, అక్కడ మంచి బాట పరుచుకునే ప్రయత్నంలోపడ్డ తాప్సీపన్ను తెలుగులోనూ ఒకటీ, అరా సినిమాలు చేయడానికి మొగ్గుచూపుతున్నది.

చానాళ్ళతర్వాత 'ఆనందో బ్రహ్మ' సినిమాచేసి, మరో చిత్రానికి సంతకాలు చేసింది. బాలీవుడ్‌లో బిజీ షెడ్యూల్ ఉన్నప్పటికీ వీలయినంతవరకు తెలుగులో నటించడానికి ప్రయత్నిస్తానంటున్నది. తెలుగు సినిమా తన హృదయానికి దగ్గరగా రావడమే ఇందుకు కారణం అని చెప్తోంది.

"నా సినీప్రయాణాన్ని ఇక్కడే ప్రారంభించాను. ఇక్కడ చేసే చిత్రాలు అంతగా లేకపోవచ్చు కాని, పూర్తిగా మానేయను.

మంచి స్క్రిప్టులు, పాత్రలకు నేనెప్పుడూ ఓపెన్‌గా వుంటాను" అని తెలిపింది తాప్సీ.



మరి రెండ్రోజులకే సినీనటి లాస్య వారి పెళ్ళికి వస్తున్నట్టు పనిగట్టుకునివచ్చి మరీచెప్పాడు సుందర్రావు. ఎగిరి గంతేశాడు సూరిపండు. మావగారిని కావలించుకున్నంత పనిచేశాడు.

ఆ వెంటనే ఆ వార్తని ఫేస్‌బుక్‌లో వాట్సాప్‌లోని అన్ని గ్రూపుల్లో చకచకా పోస్టు చేసేశాడు. ఎందుకైనా మంచిదని ఆవిడ ఫోటో కూడా పెట్టాడు. అంతటితో ఆగకుండా ముఖ్యమిత్రులకు ఫోన్లుచేసి మరీచెప్పాడు. అంతా 'గ్రేట్' అంటూ పొగిడేస్తోంటే ఏనుగెక్కినట్టుగా పొంగిపోయాడు. శుభలేఖకన్నా ముందు వార్త బంధుమిత్రులందరికీ చేరిపోయింది.

"మధ్యలో ఈ సినిమా ఆవిడగోలేంటి?" ముఖంచిట్లించింది సుందర్రావుభార్య.

"అల్లుడు సరదా పడ్డాళ్ళే. మనకూ మన వ్యాపారాలకీ ఫ్రీ పబ్లిసిటీ వస్తుందని ఒప్పుకున్నా" ముఖం చాటేస్తూ చెప్పాడు సుందర్రావు.

"ఊరికే ఎందుకొస్తుంది? ఆవిడగారికి ఇల్లూ పిల్లలూ లేరా?"

"అదేమో గాని బోల్డంత బిజీ మనిషి. డిమాండు ఎక్కువ గనుకే అయి... అర లక్ష ఇస్తున్నాను" అన్నాడు ఐదుని 'అర'చేసేస్తూ. లేకపోతే ఆవిడ నెత్తిమీద మిగిలిన కాసింతజుట్టూ పీకి పందిరెయ్యడం ఖాయం!

"అలా వచ్చి, తన చీర నగలూ వగలూ చూపి, ఇలా వెళ్ళినందుకు యాభైవేలు ధారబోయాలా?" బుగ్గలు నొక్కుకుంది.

"సినిమా గ్లామరే. మనకీ లాభమేనే పిచ్చి మొద్దూ" అన్నాడు తప్ప వివరాలు ఏకరువు పెట్టలేదు. బంధుమిత్ర వర్గాల్లో ఆ వార్త సంచలనం సృష్టిస్తోంటే, స్థానికపత్రికావిలేకర్లు ముందుగానే బాక్సుకట్టి మరీ వార్తని భుజాల మీద మోసేశారు.

దాంతో పెళ్ళికి పిలిచిన వారికన్నా పిలవని వారు రెట్టింపుమంది వచ్చిపడ్డారు. వారిలో బంధుమిత్రులకన్నా లాస్య అభిమానులే ఎక్కువమంది ఉన్నారు. వచ్చినవారుమొదట భోజనాల మీద దాడి చేశారు. మగ పెళ్ళివారు ఊరేగింపుగా వచ్చేసరికే చాలా ఆహారపదార్థాలు హుష్‌కాకి అయిపోయాయంటే ఏ రేంజ్‌లో వచ్చారో అర్థం చేసుకోవచ్చు.

పెళ్ళి తంతు మొదలయ్యింది. కానెవ్వరూ కుదురుగా కూర్చోలేదు. పెళ్ళి చూడటమూ లేదు.

'లాస్య వచ్చిందా?' 'లాస్య ఎక్కడదిగింది?' 'లాస్య ఎప్పుడొస్తుంది?' 'ప్రస్తుతం లాస్య ఏ ఏసినిమాల్లో నటిస్తోంది?' అంటూలాస్య జపంచేస్తూ ఎంతోబిజీగా కలతిరుగుతున్నారంతా.

ఎట్టకేలకు లాస్య వచ్చింది. ఆమెని చూసి మూర్ఛపోబోయి నిలదొక్కుకున్నారంతా. సినిమాల్లోనూ టీవీల్లోనూ కన్పించేలా చిట్టిపొట్టి డ్రెస్సులు వేసుకోలేదు. పట్టుచీర కట్టుకుని నిండుగా ఉంది.

రాత్రి తొమ్మిదవుతున్నా సరే నల్ల కళ్ళజోడు ధరించింది. హైహీల్స్ చప్పుడు చేసుకుంటూ, సగం జుట్టుని భుజాల ముందుకి వేసుకుని వచ్చింది. రాణీగార్లా హుందాగా చిరునవ్వుల వరం ఉచితంగా పంచిస్తూ వయ్యారంగా నడిచి వచ్చింది.

ఆమెనిచూడటానికి జనం ఎగబడగా నలుగురు బౌన్సర్లు అందర్నీ అదిలిస్తూ దూరంగా తోసేశారు. పాపం, ఆహ్వానించడానికి ఎదురొచ్చిన సుందర్రావునీ దృఢహస్తాలతో ఝళిపించి ఎడంగా తోసేశారు.

ఆమెని కుదిర్చిన మధ్యవర్తి తనని ఆమెకి గొప్పగా పరిచయంచేస్తే బాగుణ్ణని అతగాడి కోసం ఆశగా వెదికాడు సుందర్రావు. అతడి జాడ కన్పించలేదు. ఆవిడని దగ్గరగా చూడాలని, మాట్లాడాలని ఉవ్విళ్ళూరుతున్న అతడి మీద చల్లని నీళ్ళు కుమ్మరించినట్టు నీరు కారిపోయాడు.

ఆలస్యం చేస్తే ఒక్క ఫోటో జ్ఞాపకమూ ఉండదని భయపడి అందర్నీ తోసుకుంటూనే పెళ్ళి మండపం దగ్గరకి పరుగెత్తాడు సుందర్రావు. ఆసరికే లాస్య మండపం మీదకెక్కింది. సుమ, సూరిపండుల మీద పూలు, అక్షింతలూ చల్లి ప్రెస్‌కీ, పెళ్ళి ఫోటోగ్రాఫర్లకీ ఫోజులిస్తోంది. ఎలాగోలా గ్రూపు ఫోటోలో దూరాలని సుందర్రావు ప్రయత్నించాడు గాని బంధుమిత్రులు దడి కట్టేసి లోపలికి రానివ్వలేదు.

మంటపం మీది జనం కదిలేసరికి ఇదే అదనని తోసుకుని ముందుకెళ్ళాడు సుందర్రావు. కాని లాస్య వచ్చినంత వేగంగానూ వెళ్ళిపోతూ కన్పించింది. జనం పోలోమంటూ ఆమె వెంటపడ్డారు.

కలవరపడుతున్నసుందర్రావునిచూసి, "ఈవిడ్నా మీరు సొల్లు కారుస్తూ టీవీలో చూసేదీ! రోడ్డు పక్క అప్పలమ్మలా ఉంది!" అందతడి భార్య. ఆ మాటలు విన్పించుకోకుండా జనంతో బాటే పరుగెట్టాడు. "ముహూర్తం టైమైంది. జీలకర్రాబెల్లం ఒకరి తలపైఒకరు పెట్టుకోవాలి.ఎదురెదురుగాకూర్చోండి" అంటూ పురోహితుడు హడావిడిచేశాడు.

వధూవరులు బుద్ధిగా కూర్చున్నారు కాని మండపంలో గాని, హాలులో కాని జనం సాక్ష్యానిక్కూడా ఒక్కరూ లేరు. బిక్క మొహాలు పెట్టి బిక్కుబిక్కుమంటూ వాళ్ళు దిక్కులు చూస్తోంటే పురోహితుడి సెల్ ఖంగుమని మోగింది.

"నాన్నా, లాస్యగారితోసెల్ఫీ దిగావా, లేదా?" ఆయన పుత్రరత్నం ఆరా తీశాడు.

"పెళ్ళి గొడవలో పడి మరిచిపోయాన్రా ఇదిగో వెళ్తున్నా" అంటూ జీలకర్ర బెల్లాలని వధూవరుల చేతుల్లో పెట్టినవాడే ఆ సంగతి మరిచి ఒక్కంగలో మండపంలోంచి జంప్ చేసి బైటికి పరుగుతీశాడు.

'గొప్పపెళ్ళి' 'పెళ్ళి గొప్పగా జరగటంఅంటే ఇదా?' అనుకుంటూ సూరిపండు, సుమ వాళ్ళంతట వాళ్ళే ఒకరి తలమీద ఒకరు జీలకర్ర బెల్లం మిశ్రమాన్ని పెట్టుకుని ఒకరి కళ్ళల్లోకి ఒకరు శుభముహూర్తవేళ దిగులుగావెక్కిళ్ళుపడుతూ చూసుకున్నారు! "ఇలా జరిగిందేమిటి...?" బేలగా అడిగింది సుమ.

"ఏ పెళ్ళిలోనైనా వరుడూ వధువే హీరోహీరోయిన్లు. అలాకాదని బైటి హీరో, హీరోయిన్లనో పిలిస్తే, అసలు వాళ్ళు వట్టిజీరోలైపోతారని మా బాగా తెలిసొచ్చింది!" ముక్కు ఎగబీలుస్తూ జవాబిచ్చాడు సూరిపండు! ⓢ



**2018 కల్లా మా రాష్ట్రాన్ని నక్సల్స్ ప్రభావితం లేని రాష్ట్రంగా రూపొందిస్తా.**

-రఘుబర్‌దాస్, జార్ఖండ్ సి.ఎమ్.



Courtesy : MISIMI

# సత్యాన్వేషణ

## బైబిలు వాక్కు

(క్రిస్మస్ : 25.12.2017)

తాను చేసిన తప్పువద్దకు అజ్ఞాని మరల తనే వస్తాడు. దేవుని శక్తి తప్ప మరో శక్తి లేదు.
ప్రపంచాన్ని జయించినా ఆత్మ నష్టపోయినతర్వాత ఆ మనిషికి కలిగే లాభమేమిటి?
మంచిఆహారపుఅలవాట్లు బాల్యంలోనే వస్తాయి.
పుచ్చుకోవడంకంటే ఇవ్వటమే సంతోషకరం.
ఆనందంగా ఇచ్చేవాడ్ని దేవుడు ప్రేమిస్తాడు.
చివరివరకు సహనంగా వుండేవాడే రక్షించబడతాడు. శత్రుత్వం, కోపం జీవితాన్ని కుదిస్తాయి.
పతనానికి ముందుగా అహంకారం నడుస్తుంది.
దేవుడంటే భయమే జ్ఞానికి మొదలు.
దేవుడే కాంతి. దేవుడే ప్రేమ.
దేవుడే జీవితం. □

## సమాధానకర్త

యేసు శిశువుగా పుట్టెను. కుమారుడు అనుగ్రహింపబడెను. ఆయన భుజము బరువుగా ఉంది. రాజ్య భారం భుజంమీద మోపబడింది.

ఆశ్చర్యకరుడు, ఆలోచనకర్త, బలవంతుడు, నిత్యుడు అగు తండ్రి, సమాధానకర్తయగు అధిపతి అని పేరు పెట్టబడును.దేవత్వముయొక్క సర్వ పరిపూర్ణత క్రీస్తునందు నివసించుచున్నది. నిరాక్షేపంగా దైవభక్తిని గూర్చిన మర్మము గొప్పదై వుంది.

యోహాను చెబుతున్నాడు- అబ్రహాము పుట్టక మునుపే నేను ఉన్నానని మీతో నిశ్చయంగా చెబుతున్నాను అని యేసు చెప్పెనని.అందరికొరకు విమోచన క్రయ సొత్తుగా తన్ను తానే సమర్పించుకున్నాడు. విమోచనమనగా పాపక్షమాపణ. □

{ విశ్వాసం! విశ్వాసం! ఆత్మవిశ్వాసం!
భగవంతునిపై విశ్వాసం! ఇదే ఔన్నత్య రహస్యం! }

## దేవుని వాక్యము



గడ్డి ఎండిపోవును. చెరువు నీరు ఆవిరగును. పువ్వు వాడిపోవును. చెట్టు నశించిపోవును. మరి దేవుని వాక్యము నిత్యము నిలుచును.

ఆకాశము, భూమి గతించిపోయిననేగాని ధర్మశాస్త్రమంతం నెరవేరువరకు దానినుండి ఒక పొల్లైనను,సున్నా అయినను తప్పిపోదని యేసు చెబుతూ- నాయందే నిలిచియుండండి!- మనుష్యుని అంతర కోరికనుబట్టి ప్రవచనము కలగలేదు.

పరిశుద్ధాత్మవలన ప్రేరేపింపబడినవారై దేవుని మూలముగా పలికిరి. యెహోవా ఆత్మ నా ద్వారా పలుకుచున్నాడు. ఆయన వాక్కు నా నోట ఉంది! రక్తంలో ముంచబడిన వస్త్రం ఆయన ధరించి వుంచెను. ఆదియందు వాక్యముండెను.

వాక్యము దేవునియొద్ద వుండెను. ఆ వాక్యం దేవుడైయుండెను. కృపాసత్య సంపూర్ణుడుగా మన మధ్య ఉన్న ఆయనే యేసుక్రీస్తు.

'ఓ పాపక్షమాపణ కోరు జీవులారా నాయందే నిలిచివుండండి అని ఏసు చెప్పాడు. □

## శైవపాశురాలు తిరువెంబావై

వైష్ణవులు గోదాదేవి రచించిన పాశురాలని ఎలా శ్రీమహావిష్ణువుని ఉద్దేశించి గానంచేస్తారో అదేతీరుగా శంకరుణ్ణి ఉద్దేశించి గానంచేసిన పాశురాలు కూడా ఉన్నాయి. వైష్ణవ పాశురాలని 'తిరుప్పావై' అని పిలిస్తే, శైవపాశురాలని 'తిరువెంబావై' అని పిలుస్తారు.

ఈ పాశురాలని రచించి గానం చేసినది మాణిక్య వాచకర్.చిదంబరం గుడిలో నమశ్శివాయ మంత్రాన్ని కొన్ని సంవత్సరాలపాటు చేసి చేసి అదే దేవాలయంలో ఈ 'తిరువెంబావై'ని రసరమ్యంగా రచించి గానం చేస్తూండేవాడు.

ఆయన నిజనామం ఎవరికీ తెలియదు. మాణిక్యంలా అందరినీ ఆకర్షించే తీరు మృదు మధురభాషణాన్ని చేస్తూండే కారణంగా ఆయన్ని 'మాణిక్య వాచకర్' అని పిలుస్తూంటే అదే బలపడిపోయింది అసలు పేరుగా.9వ శతాబ్ది తమిళ కవి ఈయన. □

## మొక్కుబడి

సహజంగా ఏదో కష్టం వచ్చిన సందర్భంలో ఓ మొక్కుని మొక్కుకుంటాం. అనుకున్న పని సవ్యంగా ముగిసిపోయాక, అప్పుడు దేవుడితో బేరాలు మొదలెడతాం. వెంటనే నీ దర్శనానికి రావాలని అనుకున్నానుగాని ఏదో ముఖ్యమైన కారణంవల్ల రాలేకపోతున్నామంటూ మొరపెట్టుకుంటూ మొత్తానికి ఆ మొక్కుని దాదాపుగా మర్చిపోతాం.

మళ్ళీ కష్టం రాగానే, అప్పుడు గుర్తొస్తుంది పాత మొక్కు. మొక్కు అనేది మొక్కుకునేప్పుడే ఫలాని రోజులోగా తీరుస్తానంటూ మొక్కుకుని తీరాలి.

మొక్కు అనేది ఓ ఋణంలాంటిది. తీసుకునేప్పుడే తిరిగి మొక్కు తీర్చుకునే సమయాన్ని కూడా చెప్పుకుంటూ మొక్కుకోవాలి.



# రాజప్రతినిధి గుత్రాలు

చిత్రసేనుడు మహేంద్రదేశాన్ని పాలించే రోజుల్లో ఆ దేశంలో పాడిపంటలు సమృద్ధిగా ఉండటంతో పాటు వర్తక వ్యాపారాలు బాగా అభివృద్ధి అయ్యాయి. దేశంలో ఆహారంతో పాటు వెండి, బంగారాలూ, రత్నాలూ సమృద్ధిగా ఉండేవి.



దీని ఫలితంగా కొన్నివర్తక కేంద్రాలు మహానగరాలుగా పెరిగాయి. ఇలా పెరిగిపోయిన నగరాలలో పౌర జీవితమూ, పరిపాలనా విధానాలూ వేరుగా ఉండేటట్టు చూడవలసివచ్చింది రాజుకు. అందుకోసం అలాటి నగరాలలో రాజప్రతినిధుల పరిపాలన ఏర్పరచాలనుకున్నాడు రాజు.

ఆ రాజప్రతినిధులను ఎన్నుకునే బాధ్యత నగరపౌరులకే వదిలితే, సరి అయిన రాజప్రతినిధులు నియామకమవుతారనీ, వాళ్ళ పరిపాలనను తాను అప్పుడప్పుడూ సమీక్షచేస్తూ ఉండవచ్చుననీ చిత్రసేనుడుఅభిప్రాయపడ్డాడు.

మహేంద్రదేశంలో రాజధాని తరువాత అంత పెద్ద నగరం ఆనందపురం. అక్కడ మొట్టమొదట రాజప్రతినిధికి ఎన్నికజరిపి, తన పథకం ఎలా పని చేసేదీ చూడాలని రాజు నిర్ణయించాడు.ఆనందపురం చాలా పెద్ద వాణిజ్య కేంద్రం. అక్కడి జనసంఖ్య పదిలక్షలు. ఆ నగరంలో అనేక గొప్ప భవనాలూ, విశాలమైన రాజమార్గాలూ ఉన్నాయి.

అక్కడ విదేశీయుల రాకపోకలు విస్తారంగా ఉంటాయి.

చిత్రసేనుడు తన నిర్ణయాన్ని మహామంత్రి చతురుడికిచెప్పాడు.

"అంతా ఒకే కుదురులో జీవించే జాతులవాళ్ళు తమనాయకుణ్ణిఎన్నుకున్నట్టుగా మహానగర వాసులు తమ పాలకుణ్ణి ఎన్నుకోగలరని తోచదు. సమర్థుడని తోచినవాణ్ణి మీరే నాయకుడుగా నియమిస్తే బాగుంటుందని నా అభిప్రాయం" అన్నాడు మంత్రి.

చతురుడి సలహా చిత్రసేనుడికి నచ్చలేదు. నగర పాలకుణ్ణి ఏర్పాటు చేస్తున్నది నగరవాసుల సౌకర్యార్థం. తమ సౌకర్యాలు నగరవాసులకే బాగా తెలుస్తాయి. వాటికోసం కృషి చేయగలవాణ్ణే వాళ్ళు ఎన్నుకుంటారు. ఇందులో పొరపాటు జరిగే అవకాశం ఏమున్నదీ?

పదిలక్షలమంది ఒకణ్ణి ఎన్నుకోవటంలో కొన్ని చిక్కులున్నాయి. అందుచేత చిత్రసేనుడు ఆనందపురాన్ని పన్నెండు పేటలుగా విభజించి, ఒక్కొక్క పేటకూ ఒక్కొక్క పాలకుణ్ణి ఎన్నుకోమంటే ప్రజలు సులువుగా ఎన్నుకుంటారు.

ఆ పన్నెండుమందీ కలిసి తమ నాయకుణ్ణి ఎన్నుకుంటే అతను నగరపాలకుడుగా ఉంటాడు; మిగిలినవాళ్ళు అతని కింద ఉపపాలకులుగా ఉండి, అతనికి సహాయంచేస్తూ ఉంటారు.



ఈ ఏర్పాటు గురించి ఆనందపురంలో ప్రకటన జరిగింది. వెంటనే ఎన్నికల సంరంభం సాగింది.

ఆనందపురంలో సుచారుడు అనే విద్యావంతుడు ఉన్నాడు. అతను ఆ నగరంలోనే పుట్టి పెరిగినవాడు. అతనికి ఆ నగరమే పంచప్రాణాలు.అతను ఆ నగర జీవితాన్ని క్రమబద్ధం చెయ్యటానికి ఎంతో కృషిచేశాడు.అక్కడ ఇప్పుడు ప్రత్యేక పరిపాలన ఏర్పడబోతున్నదంటే నగరజీవితం ఇంకా అభివృద్ధి చేయవచ్చునని అతనికి అనిపించింది.

అతనుకూడా రాజప్రతినిధి ఎన్నికకు నిలబడదలిచాడు.

అతని నాయకత్వాన ఒక యువకుల సేన కూడా ఉన్నది.

సుచారుడిలాగే అనేకమంది పేరుపడ్డ ధనికులూ, వర్తకులూ ఎన్నికల్లో ఆసక్తి ప్రదర్శించారు. నూతనంగా ఏర్పడే పరిపాలనలో తమకు ప్రాముఖ్యంఉండాలని వారికోరిక.

అందుచేత వాళ్ళు ప్రజలకు విచ్చలవిడిగా డబ్బు పంచిపెట్టి,తమ దగ్గిరవాళ్ళనూ, తమ చెప్పుచేతలలో ఉండేవాళ్ళనూ ఎన్నికలలో గెలిపించారు. పన్నెండుమంది విద్యాహీనులూ, విలాసపురుషులూ ఉపరాజప్రతినిధులుగా ఎన్నికయ్యారు. సుచారుడికీ, అతని అనుచరులకూ ఘోరపరాజయం కలిగింది.

సుచారుడి పరాజయం రాజును కూడా కలవరపరిచింది.

రాజప్రతినిధి కావటానికి అతని కన్న అర్హుడులేడని రాజుకు తెలుసును. అంతతోపోక, పన్నెండుమంది భ్రష్టులు ఎన్నికలలో నెగ్గారు!

మంత్రి చతురుడు రాజుతో, "మహారాజా, నిక్షేపంలాంటి నగరాన్ని ఈ మూర్ఖులచేతిలో పెట్టకండి. ప్రజలు తమకు మేలుచేసేవారిని ఎన్నుకోలేరని రుజువయింది కదా! తమరే తగినవాణ్ణి చూసి-" అని ప్రారంభించాడు.

ఆయన మాట పూర్తికాకుండానే రాజు, "ప్రజలకు అతనిపట్ల విశ్వాసం లేదని రుజువైంది. సుచారుడు దీక్షగలవాడు కావచ్చు. కాని ధనంగలవాడు కాదు. ప్రజలు ధనవంతులను ఎన్నుకున్నారు. ఎలాకాదనగలం?" అన్నాడు.

ఐతే రాజప్రతినిధి ఎన్నిక మాత్రం ఎంత కాలానికి జరగలేదు.

ఉపరాజ ప్రతినిధులు పన్నెండు మందిలో ప్రతి ఒక్కడికీ తానే రాజప్రతినిధి కావాలని ఉన్నది. అందుచేత వారు తమ నాయకుణ్ణి ఎన్నుకోలేకపోయారు. నెలరోజులు గడిచింది.



ఎన్నిక ఎందుకు జరగటంలేదో తెలుసుకుందామని రాజు తన మంత్రితో సహా ఆనందపురం వచ్చి, ఉపరాజ ప్రతినిధులను సమావేశపరచి, "మీకు వచ్చిన సమస్య ఏమిటి?" అని అడిగాడు.

"మహారాజా, తమరుఎలానూ రానే వచ్చారు గనక, మాలో ఒకరిని రాజప్రతినిధిగా తమరే నిర్ణయించండి"అన్నారు వాళ్ళు. తరువాత ఆయన ఆ పన్నెండు మందిలోనూ కాస్త కంటికి నదరుగా కనిపించే ధనగుప్తుడు అనేవాణ్ణి రాజప్రతినిధిగా నియమించి, తన రాజధానికి తిరిగి వెళ్ళాడు.

ప్రత్యేక నగర పరిపాలన ఏర్పడటంతో కొత్త సమస్యలు బయలుదేరాయి.ప్రతిఒక పేటవాళ్ళూ తమకు కొత్త సౌకర్యాలు కావాలని తమ తమ ప్రతినిధులను పీడించసాగారు. ఒక పేటలో ఏదైనా ఒకఅభివృద్ధి కార్యక్రమం ప్రారంభించిన మరుక్షణం మరికొన్ని పేటల్లో ఆందోళనప్రారంభమయ్యేది.

ప్రజలలో ఈ ఆందోళనలు రెచ్చగొట్టుతున్నది ఉపరాజప్రతినిధులేనని ధనగుప్తుడికి తెలుసు: వారంతా తనకు సహాయకులుకారు, ప్రత్యర్థులు.



వాళ్ళు తనకు తెచ్చిపెట్టే సమస్యలను ఎలా పరిష్కరించుకోవాలో ధనగుప్తుడికి తెలియదు.

అందుచేత అతను సమస్య వచ్చినప్పుడల్లా రాజధానికి వెళ్ళి రాజును సంప్రదించసాగాడు. ధనగుప్తుడు రాజ ప్రతినిధిగా ఉండటానికి పనికిరాని వాడని రాజు త్వరలోనే గ్రహించాడు.

అయినప్పటికీ ఆయన చతురుడి ముందు ఓటమి అంగీకరించలేక, ధనగుప్తుడు వచ్చినప్పుడల్లా అతనికి రాజనీతి బోధిస్తూ వచ్చాడు. అయితే రాజనీతి ధనగుప్తుడి బుర్రకు ఏమాత్రమూ ఎక్కేది కాదు; అతనికి తెలిసినదల్లా ప్రతిసమస్యకూ పరిష్కారం రాజాగారి నుంచి తెలుసుకోవటమే.

రాజు నిర్ణయాలు అమలుచెయ్యటం అతనికి క్షేమంగా కనపడింది. అయితే ధనగుప్తుడికి ఒక పెద్ద చిక్కు వచ్చిపడింది. ఆనందపురానికీ, రాజధానికీ మధ్య చాలా దూరం ఉన్నది. మంచి గుర్రం మీద రోజున్నర ప్రయాణం.

కనీసం వారానికి ఒకసారి ప్రయాణంచెయ్యాలి.ధనగుప్తుడు తన ప్రయాణాలకు నెలకు రెండుగుర్రాలను ప్రజల ద్రవ్యంతో కొనేవాడు.

అతనివద్ద ఎనిమిది మేలుజాతి గుర్రాలున్నాయి. నగర పరిపాలన యావత్తూ ఆ గుర్రాల ఆరోగ్యం పైనే ఆధారపడి ఉన్నది మరి.

ఒక సంవత్సరం పూర్తికాగానే ధనగుప్తుడు తన నివేదికలను తీసుకుపోయి రాజుగారికి సమర్పించాడు. ఆ నివేదికలలో రాజుకు కొత్తవిషయాలేమీ కనిపించలేదు. అమలుజరిగినవన్నీ తననిర్ణయాలే.ఎటొచ్చీ, అన్నిటికన్నా పెద్ద ఖర్చు పద్దు మహారాజుతో సంప్రదింపుల కింద కనపడింది.

ఏ అభివృద్ధి పథకానికీ అంత ఖర్చు కాలేదు. మహామంత్రి చతురుడుతన వెంటే ఉండటంచేత రాజు రాజ ప్రతినిధిని ఆ ఖర్చు వివరాలు అడగలేదు. తరువాత రాజు మంత్రితో, "ధనగుప్తుడు చాలా నమ్మకమైన వాడు. అతను తన అధికారాన్ని ఏమాత్రమూ దుర్వినియోగ పరచినట్టు కనపడదు" అన్నాడు.

చతురుడు నవ్వి, "అతను అధికారాన్ని వినియోగించినదేమున్నది? అన్నీ మీరు చేసిన నిర్ణయాలే గద! అందుకే మీతో సంప్రదింపులకు అయినఖర్చు అభివృద్ధిపథకాలఖర్చులన్నిటినీ మించిఉన్నది" అన్నాడు.

చిత్రసేనుడికి కొంచెం చురుకు తగిలింది. ఆయన మంత్రితో, "ఆనందపురం పరిస్థితి స్వయంగా చూడాలని ఉన్నది. ఒక పర్యాయం మనం మారువేషాలలో వెళ్ళి, నగర పర్యటనచేసి వద్దామా?" అన్నాడు.

ఇద్దరూ మారువేషాలతో ఆనందపురంలో తిరుగుతూ, నగర వైభవాన్ని చూసి ఆశ్చర్యపడ్డారు.

వీధివీధికి వైద్యశాలలూ, మంచి నీటి బావులూ ఉన్నాయి. దుకాణాలన్నీ ఒక పద్ధతిలో ఉన్నాయి.



చిత్రసేనుడు దారేపొయ్యే ఒక మనిషిని పలకరించి, "మీ రాజప్రతినిధి మంచి సమర్థుడులాగున్నాడే? ఈ వైద్యశాలలూ, ప్రజాసౌకర్యాలూ రాజధానిలోకూడా లేవు" అన్నాడు.

దానికా మనిషి, "అయ్యా, మీరీ నగరానికి కొత్తలాగుంది. ఈ సౌకర్యాలు మాకు రాజప్రతినిధి రాక పూర్వమే ఉన్నాయి. సుచారుడూ, అతని యువసేనా ఈ నగరాన్ని ఏనాడో తీర్చిదిద్దారు. ఇక ధనగుప్తుడు గారి పరిపాలన అంటారా? అందులో మేం సుఖపడాలంటే గుర్రాలమై పుట్టాలి!" అని వెళ్ళిపోయాడు.

ధనగుప్తుడి పరిపాలనకూ, గుర్రాలకూ సంబంధం ఏమిటో రాజుకు అర్థంకాక, మంత్రికేసి ప్రశ్నార్థకంగా చూశాడు. చతురుడికి ఆ సంగతి అర్థం అయ్యినట్టు కనపడలేదు.

తర్వాత వాళ్ళు నగరంలోనిఅనేక మంది పౌరులను కలిసి చూశారు. దాదాపు అందరూ గుర్రాల ప్రస్తావన తెచ్చినవాళ్ళే.అనంతరంవాళ్ళుసుచారుణ్ణి కూడా కలుసుకున్నారు.

"మీరు నగరానికి చాలా సేవచేశారుట. ఈ మాట చాలామంది నగరవాసులు చెప్పారు. అయినా ప్రజలు మిమ్మల్ని ఎందుకు ఎన్నుకోలేదు?" అని చిత్రసేనుడు సుచారుణ్ణి అడిగాడు.

"నేను ఎన్నికలకోసం ప్రజాసేవ మొదలుపెట్టినవాణ్ణి కాను. అందుచేత, నన్ను ఎన్నుకోకపోయినా నేను ప్రజాసేవమాననని ప్రజలకితెలుసు. వాళ్ళుతమకుడబ్బిచ్చినవారిని ఎన్నుకున్నారు" అన్నాడు సుచారుడు.

"అలాంటప్పుడు మీరు ఎన్నికల్లో ఎందుకు నిలబడ్డారు?" అన్నాడు రాజు.

"అధికారంలో ఉంటే ప్రజలకు మరింతగా సేవచేయుగలనేమోనని!" అని సుచారుడు జవాబుచెప్పాడు.

"పదవిలో ఉన్నవారికంటే మీరే ఎక్కువగాప్రజాసేవచేస్తున్నారు. నగరంచూసిన ఎవరికైనా ఆ సంగతి తెలుస్తుంది" అన్నాడు రాజు.

"మీరు పొరబడుతున్నారు. ఇన్నేళ్ళుగా నా యువసేన ప్రజలకు ఏర్పరచిన సదుపాయాలు. ధనగుప్తుడు ఆరునెలల్లో గుర్రాలకు కలిగించిన సదుపాయాలలో సగమైనా ఉండవు. ఎలాగైనా ప్రజల జీవనస్థాయిని ఆ గుర్రాల జీవనస్థాయికి పెంచటం సాధ్యమవుతుందా అని చూస్తున్నాను" అన్నాడు సుచారుడు.

"నగరంలో ఎవరినికదిలించినా రాజప్రతినిధి గుర్రాలమాటే తెస్తున్నారు"

సుచారుడు రాజుతో ధనగుప్తుడి గుర్రాలను గురించి వివరంగా చెప్పి,

"అతనుమాత్రం ఏం చేస్తాడు? స్వయంగా ఏ నిర్ణయమూ చెయ్యలేడు. తోటి ఉపరాజప్రతినిధులు తనమాట వినేటట్టు చేసుకోలేడు. ప్రతి చిన్నవిషయాన్నీ రాజుగారితో సంప్రదించాల్సిందే! ఈ భాగ్యానికి రాజుగారు ఒక రాజప్రతినిధిని ఎందుకు నియమించాడా అని నాకు ఆశ్చర్యం కలుగుతుంది" అన్నాడు.

రాజు వెంటనే అధికారరీత్యా వెళ్ళి ధనగుప్తుడు తన అశ్వాలకోసం చేసిన ఏర్పాట్లు స్వయంగా చూశాడు.

తనతో సంప్రదించటానికి ధనగుప్తుడు అంత ఖర్చు ఎందుకుచేశాడో ఆయనకు అర్థమయింది.

రాజధనాన్ని ప్రజలకోసం కంటే గుర్రాలకోసం ఎక్కువగా ఖర్చు పెట్టే మూర్ఖుణ్ణి ఇంతకాలం నగరపాలకుడుగా కొనసాగనిచ్చినందుకు రాజు తననుతానే నిందించుకున్నాడు.

ఆయన వెంటనే ధనగుప్తుణ్ణి పదవిలోనుంచి తొలగించి, అతనిస్థానంలో సుచారుణ్ణి రాజప్రతి నిధిగా నియమించి, ఉపప్రతినిధులను నియమించే పని అతనికే అప్పగించాడు.

మరుసటి సంవత్సరం సుచారుడు రాజుకు సమర్పించిన నివేదికలో రాజుతో సంప్రదింపుల ఖర్చుపద్దే లేదు.

**వసుంధర**



# వసంతసేనా చారుదత్తం

ఇలందర్

"మిత్రమా! రాజుకంటికి బలం లేదు. అది నిజం చూడలేదు. వాస్తవాన్ని గ్రహించలేదు. దీనంగా చెప్పడమేగానీ, నీచమైన చావు తప్పదు!"

"అయ్యయ్యో! ఎంత కష్టం వచ్చిపడింది. కుజుడు విరోధి. బృహస్పతి బలహీనుడు కాగా, వారి ప్రక్క ఇంకో గ్రహం తోకచుక్కలా వచ్చిపడింది" తన మనసులోని మాటని పైకనేశాడు ప్రధాన న్యాయమూర్తి.

శ్రేష్ఠి ధనదత్తు మైత్రేయుని దగ్గరున్న ఆభరణాలను సేన తల్లికిచ్చి, "ఏమమ్మా! శ్రద్ధగా చూచి, ఇవి నీ కూతురివేనా? అవునో, కాదో చెప్పు" అని అడిగాడు. "ఆవిడ ఆ నగలను చూసి, పోలికవుంది. కానీ అవి కావు" అని అంది. చారుదత్తుడ్ని రక్షించడానికే ఆమె అలా అంది.

"ఓసీ, ముసలిదానా! కళ్ళతో ఒప్పుకుంటున్నావు. నోటితో కాదంటున్నావు" ఆక్రోశంగా అన్నాడు శకారుడు.

వసంతసేన తల్లి కోపంగా అతడ్ని అంది! "పో చెడుగా!"

"అమ్మా! మరోమారు శ్రద్ధగా చూసి చెప్పు" అన్నాడు శోధనకుడు.

"అయ్యా! అగసాలి నేర్పువల్ల కంటికెంత ఇంపుగా వున్నాయి, అని చూస్తున్నాను. కానీ ఆమెవికావు" అందామె.

"శ్రేష్ఠి! చూడు! చేసిన వస్తువు గుణంలో రూపంలో ఇంకో వస్తువును పోలవచ్చు. సామాన్యంగా శిల్పులు ఒకరి పనిని ఒకరు అనుసరిస్తుంటారు కదా!" అన్నాడు న్యాయమూర్తి.

"అయితే ఈ వస్తువులు ఆర్యచారుదత్తుడివా?" అడిగాడు శోధకుడు.

"కాదు, కాదు, కాదు" అన్నాడు చారుదత్తుడు.

"అయితే ఎవరివి?"

"ఈమె పుత్రికవి" అయితే ఆమె శరీరంనుంచీ ఇవి ఎలా బయటికి వచ్చాయి?"

"ఎలావచ్చాయంటే" అని చారుదత్తుడు తడబడ్డాడు. "ఆర్య చారుదత్తా! ఇక్కడ నిజం చెప్పితీరాలి. చూడు, సత్యంవల్లసుఖం జరుగుతుంది. నిజం చెబితే పాపంవుండదు.

సత్యం అనే దానిలో రెండే అక్షరాలు ఉన్నా దాన్ని అసత్యంతో కప్పలేవు" అన్నాడు శోధనకుడు.

"ఆ నగల విషయం నాకు తెలియదు. వాటిని వసంతసేనకు ఇచ్చేందుకే మైత్రేయుడు వెళ్ళాడు" అన్నాడు చారుదత్తుడు.

"తోటలోకెళ్ళి ముందు చంపేశావు. మోసం చెయ్యడానికే అసలు నిజం దాచిపెడుతున్నావు" అన్నాడు శకారుడు.





"ఆర్య చారుదత్తా! నీ శరీరం ఎంత మెత్తదైనా దయలేని కొరడాలు నిస్పందేహంగా దానిమీద పడతాయి" అన్నాడు న్యాయమూర్తి.

"పాతుమ్మలు పుట్టని కులంలో పుట్టాను. నేను పాపం చెయ్యలేదు. పాపం చేశానని మీరనుకుంటే, నేను పాపిని కానని చెప్పినా లాభంలేదు. వసంతసేనను నేను ప్రేమించడం వాస్తవం.

ఆమెలేని జీవితం నాకెందుకు? అయ్యో! వెయ్యి మాటలెందుకు! ఇహపరలోక జ్ఞానంలేని క్రూరాత్ముణ్ణినేను,



ఆ స్త్రీరత్నాన్ని... తక్కినమాట ఇతడు చెబుతాడు" అన్నాడు చారుదత్తుడు.

"చంపాడు. ఓరీ,నువ్వు కూడా చెప్పు, చంపాననీ" అన్నాడు శకారుడు.

"నువ్వు చెబుతున్నావు గదా!" అన్నాడు నిరాశతో చారుదత్తుడు.

"వినండి! వినండి! ఇతడే చంపాడు. ఇతని వల్లనే సందేహ నివారణ య్యింది. ఈ దరిద్ర చారుదత్తుడి శరీరాన్ని దండించండి" అన్నాడు శకారుడు.

"శోధనకా! రాజశ్యాలకుడు చెప్పినట్టు చెయ్యి. రాజభటులారా! ఈ చారుదత్తుడ్ని బంధించండి" ఆజ్ఞాపించాడు న్యాయమూర్తి.

"అయ్యలారా!మన్నించండి,మన్నించండి. నా బిడ్డ పోతేపోయింది. ఈ చిరంజీవిని బ్రతకనివ్వండి. ఇది వాది ప్రతివాదుల వ్యవహారం. నేను వాదిని కనుక ఇతడ్ని విడిచిపెట్టండి" అంది వసంతసేన తల్లి.

"పుట్టు దాసీ, పో, వీడితో నీకేంపని?" అన్నాడు శకారుడు.

"అమ్మా వెళ్ళిపో. రాజభటులారా! ఈమెనిబయటికిపంపండి"అన్నాడు.

"అయ్యో నాయనా చారుదత్తా! ఈ శకారుడే నా కూతుర్ని ఏమో చేసి, ఈ నింద నీపైమోపుతున్నట్లుంది!దేవుడా!" అని కన్నీరుకారుస్తూ ఆమె ఇంటికి బయలుదేరింది. నేను వీడికి తగిన శాస్తే చేశాననుకొని శకారుడు కూడా అక్కడినుండి వెళ్ళిపోయాడు.

"ఆర్యచారుదత్తా! వ్యవహారం నిర్ణయం చేసేవరకే మా పెత్తనం. తక్కినది రాజు నిర్ణయం. శోధనకా! పాలకరాజుతో ఈయన విషయం విన్నవించు. పాపి అయినా బ్రాహ్మడ్ని చంపరాదనీ మనుధర్మం. ఆ ధర్మాన్ని అనుసరించీ, ఈయనకు దేశబహిష్కారం చేయడం మంచిదనే సూచనచేశాననీ చెప్పు" అన్నాడు ప్రధాన న్యాయమూర్తి.

శోధనకుడు రాజు దగ్గరికెళ్ళి చారుదత్తుడి విషయం తెలిపాడు.

"తుచ్ఛమైన ధనంకోసం వసంతసేనను అతడు చంపాడు గనుక, ఆ నగలు అతడి మెడలో వేసి, డప్పు వాయిస్తూ, దక్షిణ స్మశానానికి తీసికెళ్ళి తలారులకు చెప్పిచంపండి. ఇంకెవరైనా ఇట్టి కానిపని చేస్తే వారికీ ఇదే దండననీ చాటండి!" అని తీర్పిచ్చాడు రాజు.

శోధనకుడు వచ్చి రాజు తీర్పుని న్యాయస్థానంలో వినిపించాడు.

"ఆహా! ఈ పాలకరాజు ఎంత అవివేకి? మంత్రులు ఇలాంటి వ్యవహారాగ్నిలో తోస్తే, ఏమీ తోచక రాజులు ఇట్టి నిర్ణయాలు చేయడంలో ఆశ్చర్యమేముంది? న్యాయవిచారణను సరిగా నెరవేర్చలేక తెల్లకాకులను నమ్మే ఇట్టి న్యాయాధికారులవల్ల వేలకొద్దీ అమా

14

## జరిగిన కథ

న్యాయస్థానానికి వెళతాడు శకారుడు. వసంతసేనను ఎవరో చంపారని చెబుతాడు.

వసంతసేన తల్లిని పిలిపిస్తాడు న్యాయాధికారి. తన కూతురు చారుదత్తుని ఇంటికి వెళ్ళినట్లు చెబుతుందామె.

చారుదత్తుడు న్యాయస్థానానికి రప్పించబడతాడు.

వసంత సేనను నీవు బంగారు నగలకోసం చంపావంటూ నింద వేస్తాడు శకారుడు.

అందుకు ఒప్పుకోడు చారుదత్తుడు. నీవే ఏదో చేశావంటాడతను. చారుదత్తుడు నేరం చేశాడంటే న్యాయాధికారి, వసంతసేన తల్లి నమ్మలేకపోతారు.

న్యాయస్థానంలో చారుదత్తుడ్ని విచారిస్తున్నారని తెలిసి అతని స్నేహితుడు మైత్రేయుడు పరుగున వచ్చేస్తాడు.

మైత్రేయుడు శకారుడి జుట్టు పట్టుకుని కర్రతో బాదుతాడు. ఆ సమయంలో వసంతసేన నగలు బయటపడతాయి. ఇక ఆ తరువాత జరగబోయేది చదవండి.



## పేర్లు చెప్పలేం

సినిమాలు, వాటి విజయాలు, కెరీర్ వంటివి పక్కనాపెడితేరాధికా ఆప్టే మిగతా విషయాల్లోనే ఎక్కువగా వార్తల్లో ఉంటుంది. ఇటీవల లైంగిక వేధింపుల గురించి ఆమె చేసిన వ్యాఖ్యలు మరింత సంచలనం అయ్యాయి.

సినీ పరిశ్రమలో మహిళలపై మాత్రమే లైంగిక వేధింపులంటే ఒప్పుకోనని, ఈ చిట్టాలో చిన్నారులు, మగవారుకూడా ఉన్నారంటూపేర్కొని దుమ్మురేపింది.

"ఇబ్బందిపెట్టినవారి పేర్లు చెప్తే ఇంకేమైనా ఉందా! అలా చేస్తే మేము బతికిఉండగలమా?" అంటూ ఇంకోమారు పరోక్షంగా దెప్పిపొడిచింది రాధికా ఆప్టే.

యకులు చంపబడతారు.

మిత్రమా! మైత్రేయా! నడు. ధూతాంబకు నా మాటగా తుది నమస్కారం చెప్పు. నా బిడ్డ రోహసేనుడ్ని కనిపెట్టి చూడు" అన్నాడు విచారంతో చారుదత్తుడు.

"మొదలు విరిగిపోతే, తక్కిన చెట్టుకు రక్షణేదీ?" అని బాధపడ్డాడు మైత్రేయుడు.

"కాదయ్యా, కాదు! ఈలోకం విడిచిన జనులకు ప్రతిబింబం వంటివాడు నా పుత్రుడు. నా మీదవుండే స్నేహం రోహసేనుడి మీద వుంచు" అన్నాడు చారుదత్తుడు.

"మిత్రమా! నేను నీకింత నెచ్చెలిగా ఉండి,ప్రాణాలెట్లానిలుపుకోగలనూ?"

"రోహసేనుడ్ని నాకొకసారి చూపించు"

"సరే సరే" అని అక్కడినుండి వెళ్ళాడు మైత్రేయుడు.

"ఎవరక్కడ? తలారులను రమ్మనండి" అంటూ ఆజ్ఞాపించాడు ప్రధానన్యాయమూర్తి.

"అయ్యా ఇలా రండి!" పిలిచాడు శోధనకుడు.

ఆకాశంవైపుకు చూస్తూ,"నా వ్యవహార విచారణవిషయం నీటితోగాని, తక్కెడతోగాని, అగ్నితోగాని, నడిపి-న్యాయప్రకారం అప్పుడు నన్ను రంపంతో కొయవచ్చు. కానీ నాకు నిష్కారణ వైరి అయినవాడి మాటవిని, బ్రాహ్మణ్ణి, నన్ను చంపుతున్నావు.

రాజా! పుత్రపౌత్రులతో సహా నీవు నరకంలో పుడతావు సుమా!

ఇదిగో వస్తున్నాను" అని ఆవేశంగా అరిచాడు చారుదత్తుడు.

చారుదత్తుడి రెండుచేతుల్ని విరిచి కట్టి, రెండువైపులా తలార్లు పురవీధి గుండా నడిపించుకుంటూ తీసుకొని వెళుతుంటే, పురజనులు విడ్డూరంగా చూస్తూ నిలుచుండిపోయారు.

"ఎందుకు శిక్షపడిందో, ఏం చేశాడీయన? ఎందుకు శిక్షపడింది" అని జనం మాట్లాడుకుంటున్నారు.

"ఎందుకు సంపుతున్నారనీ అడక్కండి. కొత్తనేరగాణ్ణిసంపడంలోమా అంతవోళ్ళు మరిలేరు. తల కొట్టేయడంలో, కొర్రు ఎక్కించడంలో ఏమీ ఆలస్యం చెయ్యం. ఆఁ అయ్యా తప్పుకోండి. తప్పుకోండి. పాపం ఈ సారుదత్తుడ్ని మేం గన్నేరు పూలదండేసి తీసుకుపోతావుంటే నూనె తగ్గిన దివ్వె లాగ అల్లాఅల్లా దిగనారిపోతున్నాడు.

అని ఒక తలారి జనాలను ముందుకు కదలమనీ అరుస్తున్నాడు.

చారుదత్తుడు నడుస్తుంటే, అతడి వెనకే జనాలు కూడా స్మశానం వైపుకు నడుస్తున్నారు.

కన్నీళ్ళతో తడిసి, బూడిదతోనిండి, స్మశాన పుష్పమాల వేసుకొని, ఎర్ర గంధం పూసుకున్న చారుదత్తుడి శరీరాన్ని చూసి, ఈ కాకులు కఠినంగా కూస్తూ, బలిసినకూడులా స్వేచ్ఛగా తినడానికి చూస్తున్నాయా అన్నట్లున్నాయి వారి చూపులు!

"అయ్యా, తప్పుకోండి. తప్పుకోండి. ఈ దొడ్డ సెట్టును కాలం గండ్రగొడ్డలై నరుకుతావుంటే, ఏం సూత్తారు? రావయ్యా, సారుదత్తా! రా!" అని మరో తలారి అరుస్తున్నాడు.

'నేనిట్టి దశ అనుభవిస్తున్నానంటే, మనుష్యుల విధి ఎంత ఊహించరానిది! ఒంటి నిండా పిండిపూసి ఎర్రగంధపు చేతులద్ది నన్ను పశువును చేశారు. ఆహా! ఏమీ, మనుష్యుల హెచ్చుతగ్గులు! ఈ పౌరులు ఇట్టి నా విధిని చూసి 'ఛీ ఛీ' అని కన్నీళ్ళు రాలుస్తున్నారే' అని చారుదత్తుడు అనుకున్నాడు.

"అయ్యా! ఏం చూస్తారూ? తప్పుకోండి. రాజ్జెం పోగొట్టుకున్న రాజును, ఆవు కాన్పును, సుక్కల పాటును, మంచివోడి సావును సూడకూడదు" అని అదిలిస్తున్నారు తలార్లు.

మేడలమీద నిలుచున్న స్త్రీలు సగం తెరచిన కిటికీలలో ముఖాలుపెట్టి, "అయ్యో! చారుదత్తా!" అంటూ నీటి గొట్టాలలాగ కన్నీరు కారు స్తున్నారు.

"ఒరేయ్! ఆకాసంలో సూడు, సూడు, ఆకాశం ఏడుస్తున్నట్లు ఉండాది! గాచారంవల్ల ఊరికల్లాపెద్ద మనిషి సనిపోతావుంటే, మబ్బులేని పిడుగు పడుతున్నదా? అన్నట్లుండాది!" అన్నాడు ఒక తలారి.

"అవును, ఆడోరి కళ్ళల్లోంచికన్నీళ్ళు వర్షిస్తున్నాయి. ఈయణ్ణి తీస్కపోతావుంటే, ఈ జనం రాల్చిన కన్నీళ్ళతో దారిమీదినుంచి దుమ్మురేగడం లేదు" అని రెండో తలారి అన్నాడు.

ఒక తలారి డప్పుకొట్టడం మొదలుపెట్టాడు. "అయ్యల్లారా! వినండి, వినండి! బేహారి ఇనయదత్తుడి మనవడు, సాగరదత్తుడి కొడుకు, ఈ సారుదత్తుడు. ఈయన సచ్చు డబ్బుకోసరం సానివడును వసంతసేన్ని పుష్పకరండం తోట్లోకి తీసికెళ్ళి, బలవంతానా సేతుల్తో సంపి, కాని పనిని సేసినాడని దొంగసొత్తుతోకూడా పట్టుకున్నారు. తనుగూడా ఒప్పుగున్నారు.

కనుక, పాలకరాజుగారు ఈయన్ని సంపుమని ఆనతిచ్చారు. ఇంకోరెవరైనా ఇట్లాంటి పనిసేత్తే, ఆరిని కూడా రాజుగోరిల్లాగే దండిత్తారనీ సెలవిచ్చారు" అని అతడు చాటింపు వేశాడు.

ఆ మాటలు విన్న చారుదత్తుడు, "పూర్వం వేదఘోషతో సభ విరాజిల్లుతుండగా, నూరు యజ్ఞాలు చేసి, నా వంశం పవిత్రమయ్యింది.

ఇప్పుడు నా మరణదశలో ఈ చెప్పరానివారు పాపపువాక్కులు ఘోషిస్తున్నారు"అనుకుంటూ, ఆ మాటలు వినలేక చెవులు మూసుకున్నాడు.

"తప్పుకోండయ్యా, తప్పుకోండి. మంచిగుణాల పోగు, ఒకరి కష్టాలకి అడ్డుపడేవాడు, బంగారానికి మించిన నగ! ఊరివేలుపులకి తీసుకుపోతున్నాం! ఈలోకంలో అందరూ సుకంగా ఉన్నోరి సేమం అడిగేవోరే! కట్టంలో వుంటే ఉపకారం సేసేవోడెవ్వడూ ఉండడు" అంటూ బాధతో మరోతలారి ప్రకటించాడు.

ఆ ప్రకటన విన్న జనాలు ఒక్కొక్కరే వెళ్ళిపోసాగారు. చారుదత్తుని మిత్రులైతే ముఖంమీద గుడ్డకప్పుకొని, దూరంగా పారిపోవడాన్ని చూసినచారుదత్తుడు, "సుఖంగా వుంటే పరుడు కూడా బంధువవుతాడు. కష్టంలోవుంటే మిత్రులు కూడా దూరంగా పోతారు" అని బాధపడ్డాడు.

దక్షిణ స్మశానంలోకి చారుదత్తుడ్ని తలారులు ఒంటరిగానే తీసికెళ్ళారు. జనాలని రావద్దనీ హెచ్చరించారు.

"అందర్నీ పంపేశాం. పిట్టమనిషి లేడు. ఇక సావు గుర్తులు గల ఈయన్ని తీసికెళదాం!" అని ఒక తలారి మరో



పరిశ్రమలవారిని బెంగాల్‌వైపు వెళ్ళవద్దని కేంద్రం చెపుతున్నది. ఇది అప్రకటిత అత్యవసర పరిస్థితి వాతావరణం.

-మమతా బెనర్జీ, బెంగాల్ సి.ఎమ్.

తలారితో అన్నాడు.

"ఏమయ్యా! కులపెద్దవు నీవు.నిన్ను నేను ఒకకోరికకోరుతున్నాను"అన్నాడు చారుదత్తుడు.

"ఏమిటీ? మేము నీ కోరిక తీరిసే పాటోళ్ళమా?" అన్నాడు తలారి.

"పాపం శాంతించుగాక!వీడు చండాలుడైనా పాలకరాజు కంటే నయం" అనుకున్నాడు చారుదత్తుడు.

"ఏమోయ్, పరలోకానికి పోయే నేనే ఒకసారి నా పుత్రుడి ముఖం చూడాలని కోరుతున్నాను" దీనంగా అడిగాడు చారుదత్తుడు.

"సరేనయ్యా!"అంటూ ఒక తలారి వెళ్ళాడు చారుదత్తుడి కొడుకుని పిలుచుకొని వచ్చేందుకు. మైత్రేయుడు చారుదత్తుడి కుమారిడిని వెంట బెట్టుకొనిఅక్కడికి తలారి వెంటవచ్చాడు.

"ఇదిగో, చూసుకో నీ కొడుకు మొగం. అయ్యా, ఇల్లారా! అబ్బాయీ! ఇల్లాగారావయ్యా" అన్నాడు తలారి.

"నాయనా! తొందరగా పద, నీ తండ్రిని చంపడానికి తీసుకుపోతున్నారు" అన్నాడు మైత్రేయుడు.

"అయ్యో బిడ్డా, హా! మైత్రేయా! ఎంత కష్టం! పరలోకంలో చాలాకాలం దాహంతో ఉంటాను. అక్కడ ఎంత కష్టం! అక్కడ నాకు స్వల్పమైన నీ తిలోదకమే భోజనం అవుతుంది. ఇప్పుడు నా కుమారుడికి ఏమియ్యను?" తనను చూసుకొని,

యజ్ఞోపవీతం చూసి, "బంగారం లేదు. ముత్యాలు లేవు! దేవతలకును, పితృదేవులకును ప్రేమ భాగమ్మొలిచ్చు పవిత్రమూర్తి" అంటూ జందెంతీసి మైత్రేయుడికిచ్చాడు చారుదత్తుడు.

"ఏమిరోయ్,ఈయనా గౌరవం, మర్యాదా అన్నీ తుడిసిపెట్టుకుపోయాననుకుంటున్నావా?తలవంచి దండం బెట్టదగ్గవాడు. సెంద్రున్ని రాగువు పట్టుగున్నా సెయ్యేత్తి మొక్కుతారు గదరా!" అని ఒకతలారి, మరోతలారితో అన్నాడు.

"ఏమర్రా! మా తండ్రిని ఎక్కడికి తీసికెళుతున్నారు?" అని అడిగాడు రోహసేనుడు.

"మెడలో ఎర్రగన్నేరు పూదండ వేసుకొని భుజంమీద శూలమూ, మనస్సులో దుఃఖమూ పెట్టుగుని- మేకయజ్ఞంలో వధ్యస్థానానికి పోతున్నట్టుపోతున్నాను" అన్నాడు బాధతో.

"కుర్రనాయనా! మేం సెండాల కులంలో బుట్టినా నిజంగా సెండాలులం గాం. వోళ్లైతే మంచివోర్ని హింస బెడతారో ఆరే సెండాలులనుకో!" అన్నాడొక తలారి.

"అయితే మీరెందుకు మా తండ్రిని చంపుతారు?" అడిగాడు రోహసేనుడు.

"మా నాయనే! దీంట్లో తప్పొప్పులన్నీ యీ సిచ్చ ఏసిన మారాజుదిగానీ, మేం ఏం సెయ్యగలం సెప్పు!" అన్నాడు మరో తలారి.

"నన్ను చంపి, మా తండ్రిని విడవండి"

"బాబా! ఇలా ముద్దు ముద్దు మాటలాడతా కలకాలం బ్రతకాలి నాయనా, నువ్వు!" చారుదత్తుడు కన్నీళ్ళతో తన కుమారుడ్ని కౌగిలించుకుకొని, "ఈ పుత్ర ప్రేమ ధనికులకు, దరిద్రులకూ సమానమేగదా! ఈ పుత్రస్పర్శ మనస్సుకు మంచి గంధము, వట్టివేళ్ళు లేని చల్లనిపూత!" అన్నాడు

"నాయనలారా! నా ప్రియ మిత్రుడు చారుదత్తుడ్ని విడవండి. ఆయనకు బదులుగా నన్ను చంపండి!" అనీ మైత్రేయుడు తలారులను వేడుకోసాగాడు.

"పాపం శమించుగాక!" అన్నాడు చారుదత్తుడు. అంతవరకూ అక్కడ కనిపించని జనం ఒక్కొక్కరే మళ్ళీ అక్కడ గుమికూడారు.

"తొలగండయ్యా!తొలగండి!తాడు తెగినూతులో మునిగిపోతూవున్న బంగారపు కడవలా, కాని మాటపడి బతుకుమీద ఆస జారిపోయిన యీయన్ని ఏం సూత్తారు?" అరుస్తున్నాడొక తలారి. అంతమంది జనం ముందు చారుదత్తుడ్ని వధించడమెట్లా అన్న ప్రశ్న అతడిని తొలిచేస్తోంది.

"సరే, మళ్ళా సాటింపెయ్యాలి" అంటూ మరో తలారి మునుపటి చాటింపే వేశాడు. దురదృష్టంవల్ల తటస్థించిన ఈ దుర్దశను అనుభవిస్తున్నాను. దీనికి ఫలితం మరణమని కూడా తెలుసు.

కానీ ఈ దిక్కుమాలిన చాటింపు మళ్ళీమళ్ళీ వినవలసివచ్చినందుకే నా మనస్సు పరితపిస్తోంది.

ఇంతకంటే వేరే నరకం వుండబోదనిపించిందీ చారుదత్తుడికి! మైత్రేయుడు మిత్రుడి స్థితిని, తన దగ్గర వున్న పసివాడినిచూసి, పగవాడికియ్యాడా ఇలాంటి స్థితిరాకూడదనీ ఏడుస్తుండిపోయాడు. ఆ శ్మశానానికి దగ్గర్లోని మేడమీదే శకారుడు బంధించిన బండివాడు ఉన్నాడు.

అతడికా చాటింపు వినిపించింది. అతడు తొట్రుపాటుతో "ఏమీ! నిరపరాధి చారుదత్తుడు చావుకు సిద్ధమయ్యాడా? నేరస్థుడైన తన యజమాని సంకెళ్ళతో తనని కట్టివేశాడు గదా!" అనుకొని, అతడు గట్టిగా కేకలు వేయసాగాడు.

కానీ అవి శూన్యంలోకలిసిపోయాయి. "వినండయ్యా, వినండి. పాపాత్ముణ్ణి. నేను బండి మార్పిడివల్ల వసంతసేనను పుష్పకరండకం తోటలోకి తీసికెళ్ళాను. అప్పుడు మా యజమాని, తనని కామించమనీ బలవంతంచేసి, వసంతసేనను చంపాడు.

ఈ సత్పురుషుడు నిరపరాధి!" అని బండివాడు అరవసాగాడు.

"ఏమీ! దూరమైపోవడంవల్ల ఎవ్వడూ వినిపించుకోవడంలేదే!ఏం చెయ్యను?" అని అతడు చింతించసాగాడు. చివరికి ఓ నిర్ణయానికొచ్చాడు.

ఆ మేడ పైభాగంనుంచి ఈ పాత కిటికీలోంచి కిందపడతాను. ఉత్తములకు ఆశ్రయమైన ఈ చారుదత్తుడు మరణించడంకన్నా నేను చావడమే మంచిది. ఇందువల్ల నేను పోయినా నాకు ఉత్తమలోకం దక్కుతుంది" అనుకొని, కిటికీలోనుంచి ఒక్కసారిగా క్రిందికి దూకాడు.

అతడు క్రిందపడ్డాడు కానీ, గాయాలేంకాలేదు. క్రింద పరిచివున్న గడ్డిమీద పడినందుకు అతడు సంతోషించాడు. అలా క్రిందికి దూకడంవల్ల అతడ్ని బంధించిన తాళ్ళు ఒదులై, సులభంగానే బంధనాలు తొలగిపోయాయి.

## ఖరీదైన తార

**టాలీవుడ్**లో సరైన అవకాశాలు రాక కోలీవుడ్ చెక్కేసి అక్కడ ఆరాధ్యతార అయిపోయినహన్సిక తన రేంజ్‌ను మరింత పెంచుకోవాలని ఆరాటపడుతున్నది.

పారితోషికాన్నిభారీగా పెంచేయడాన్ని పక్కనపెడితే, ఎక్కడికి వెళ్ళినా మందీమార్బలంతో వచ్చేసి నిర్మాత నెత్తిన భారం వేస్తున్నది.

షూటింగ్ సమయాల్లో హన్సిక స్థాయి అన్నింటా ఫైవ్‌స్టారే. తనకు ఒక్కదానికే కాదు, రూములు, తిండి అన్నీ ఆమె వెంట వున్న వారికీ తప్పవు. ఫ్లైట్ టికెట్స్ సరేసరి. షూటింగ్ మొదలైన దగ్గర నుంచీ ప్యాకప్ చెప్పేవరకు హన్సికకు, ఆమెవెంట వున్నవారికి చెల్లించాల్సిన సొమ్ములు కళ్ళు తిరిగేలా వుంటున్నాయన్న టాక్ సర్వత్రా వినపడుతున్నది.





రాజకీయంగా ఎవరు ఏమి చెప్పినా ఉగ్రవాదం పెనుభూతం అనేది తిరుగులేని వాస్తవం.

-అమితాబ్‌బచ్చన్, నటుడు

అంతే, అతడు తలారుల చాటింపు వినిపించిన వైపునకు పరిగెత్తసాగాడు. తలారులున్న చోటికివెళ్ళి, జనాలను తోసుకుంటూ ముందుకువెళ్ళి "ఓహో! తలారులారా! చోటివ్వండి, చోటివ్వండి" అని అరిచాడు బండివాడు.

"వోడయ్యా, ఇతగాడు? సోటిమ్మంటూ అరుస్తున్నాడు" అంటూ తలారి బండివాణ్ణి చూశాడు.

చారుదత్తుడు అతడ్నిచూసి, "ఏమీ! ఎవడితడు? యమపాశాలకు చిక్కిన నా వద్దకు ఎండిపోయిన చేను మీదకు ద్రోణమేఘం వచ్చినట్లు వస్తున్నాడు" అని అనుకున్నాడు.

"ఏమోయీ? విన్నారా? నాకు చావంటే భయంలేదుగానీ, కీర్తిమలినం అయ్యిందనీ విచారిస్తున్నాను.

ఈ అపకీర్తిపోతే, నాకు పుత్రోత్సాహం అంత సంతోషం ఇస్తుంది.

అంతేకాదు, నిష్కారణ వైరి, నీచుడు,అల్పబుద్ధి,పాపి అయిన వాడు విషబాణంతో కొట్టి, అపకీర్తిపాలు చేశాడు.

నేను చేయని అభియోగం నాపై పడింది. నేను హంతకుణ్ణికాదు. నేను నా ప్రియ వసంతసేనను చంపలేదు.

నేను వసంతసేనను ప్రేమించడమే నేరమైతే, నేనీ శిక్షను అంగీకరిస్తాను. సాక్ష్యాన్ని బట్టి నేరారోపణ నాపై మోపబడింది.

చావు ముందు ఎట్టివాడైనా అబద్ధం చెప్పడు. నేను నిరపరాధిని! నిరపరాధిని!" అంటూ అరిచాడు చారుదత్తుడు. అక్కడ గుమిగూడిన జనం ఆ విషయమే మాట్లాడుకోసాగారు.

"అవును, ఆర్య చారుదత్తుడు నిరపరాధి! అసలు హంతకుడు శకారుడు" అరిచాడు బండివాడు. "తావరకయ్యా! నువ్వు సెప్పేది నిజమేనా?" అడిగాడొక తలారి.

"పరమసత్యం. ఎవరితో చెప్పవద్దని, మా యజమాని తన మేడమీది పై భాగంలో నన్ను సంకెళ్ళతో కట్టి పడేశాడు" అని బండివాడన్నాడు. అతడి కాళ్ళకు తెగివున్న తాళ్ళను చూస్తున్నారందరు. ఆ విషయమై ఇద్దరు తలార్లు ఏంచెయ్యాలనీ మాట్లాడుకోసాగారు.

కొంచెం చేదుగా, పుల్లగా వుండే మాంసంతో, పప్పుతో, చేపలకూరతో, చెక్కెర పొంగలితో తన ఇంట్లో సన్న బియ్యం అన్నం తిన్నాడు శకారుడు.

జనాల అరుపుల మధ్య బండివాడి మాటలు, తలారుల మాటలు కలగలిసి అతడికి వినిపిస్తున్నాయి.

మరోవైపు మరణవాద్యాల చప్పుడు గట్టిగా వినబడుతోంది.

అక్కడ ఏదో జరుగుతోంది. ఆ దరిద్ర చారుదత్తుడ్ని వధ్యస్థలం దగ్గరికి తీసికెళ్ళినట్లున్నారు. అతడు చస్తుండగా తను చూడాలనుకున్నాడతను. చారుదత్తుడి మరణం అతడి మనస్సుకు సంతోషం కలిగిస్తోంది.

మరణించే విరోధిని చూసినవాడికి ఇంకో జన్మలో కంటి జబ్బుఉండదనీ పెద్దలు చెప్పే విషయం అతడికి ఆ క్షణంలో గుర్తుకొచ్చింది.

అతడు తన ఇంటిబయట నుంచే చూస్తున్నాడు అక్కడ జరిగే తతంగాన్నంతా! ఆ చారుదత్తుడ్ని వధ్యస్థానానికి తీసికెళుతుంటే, ఇంత జనసమ్మర్దమేమిటనీ అతడికి చిరాకేసింది.

కొత్తఎద్దులాగా ఇతణ్ణీఅలంకరించి దక్షిణంగా తీసుకుపోతున్నారనీ అతడు రాక్షసానందం అనుభవిస్తున్నాడు.

తన మేడ దగ్గర చాటింపు ఎందుకాగిందో చూద్దామన్న అతడు మేడ మీదికెళ్ళి చూస్తే, బండివాడు అక్కడ కనిపించలేకపోయేటప్పటికి అతడికి ముచ్చెమటలు పోశాయి.

వాడేమయ్యాడో తెలుసుకోవాలనుకుని, తలారులు ఉన్న వైపుకు కదిలాడతను!

ఇంకా ఉంది



యు.పి.ఎ. 2 సమయానికే గర్వం పెరిగింది అనుకుంటే నరేంద్రమోడీకి గర్వం అత్యధికంగా వుంది.

-డెరిక్ ఓ బ్రియాన్, టి.ఎమ్.సి. ఎమ్.పి.

# ఫర్ U

Today is yesterday's pupil.

## గోల్డెన్ గ్రామ్

పెసలుతో చేసుకునే వంటకాలు అనేకం ఉంటాయి. ఇవన్నీ రుచికరమైనవే కాదు, పోషక భరితమైనవికూడా. పెసల్లో పీచు లభిస్తుంది. యాంటీ ఆక్సిడెంట్స్ పుష్కలంగా వుంటాయి. వీటిల్లో లభించే పోషకాల దృష్ట్యా 'గోల్డెన్‌గ్రామ్'గా వ్యవహరిస్తూ ఉంటారు.

పెసల్లో లభించే పీచు జీర్ణవ్యవస్థకు ప్రయోజనకరంగా వుంటుంది. కండరాలు, రక్తనాళాలకు కావాల్సిన పోషకాలు ఉంటాయి. విటమిన్ 'సి' అత్యధికంగా వుంటుంది కాబట్టి వార్ధక్య లక్షణాలను వాయిదా వేయగల గుణం కలిగివుంటుంది. రోగనిరోధకశక్తిని పెంచుతాయి. రక్తంలో చక్కెర స్థాయిలను సమతౌల్యపరుస్తాయి కాబట్టి డయాబెటిస్‌గలవారికి మంచి ఆహారం. ◆

## హియరింగ్ ఎయిడ్స్

వినికిడి సరిగ్గా లేకపోతే చికాకుగా అనిపిస్తుంది. వినికిడి తగ్గినవారు హియరింగ్ ఎయిడ్స్ వాడడంవల్ల మెదడు పనితీరు మెరుగవుతుందని అధ్యయనాలు పేర్కొంటున్నాయి. వినికిడి తగ్గినవారు అస్సలు హియరింగ్ ఎయిడ్స్ వాడకపోవడంవల్ల వారి జ్ఞాపకశక్తి, ఎటెన్షన్ వంటివి తగ్గిపోతాయి.

ఎదుటివారు మాట్లాడే విషయాన్ని అర్థంచేసుకోవడానికి వినికిడి శక్తి కోల్పోయినవాళ్ళు ఎక్కువగా మెదడుపై భారాన్ని వేస్తుంటారు.

దీనివల్ల జ్ఞాపకశక్తి సంబంధిత సామర్థ్యాలు తగ్గిపోతాయని విస్తృత అధ్యయనాల్లో గుర్తించారు. అదే, వినికిడి యంత్రాలు వాడడంవల్ల ఈ సమస్యలు ఉత్పన్నం కావు. ◆

## నిద్రాభంగం

ఇటీవలి కాలంలో చిన్నపిల్లలు, టీనేజీ పిల్లల్లో నిద్ర బాగా తగ్గిపోతున్నది. వారి గదుల్లో స్మార్ట్‌ఫోన్లూ, కంప్యూటర్లు, వీడియోగేమ్‌లతో ఎక్కువసేపు కాలక్షేపం చేయడమే ఇందుకు కారణమవుతున్నది. వీటివల్ల నిద్ర చాలదు. తరచూ నిద్రా భంగానికి గురవుతుంటారు.

నిద్రలేమివల్ల వారిలో అసహనం పెరుగుతుంది. ఇది ఇతర మానసిక వ్యాధులకు దారితీస్తున్నదని నిపుణులు హెచ్చరిస్తున్నారు. పిల్లలు పడుకునే గదుల్లో అవేమీ లేకుండా చేయాలని మానసిక నిపుణులు సూచిస్తున్నారు. ◆



Courtesy : UNISHKURI

## లేబుల్ చదవాలి

ఇది ఆరోగ్యకరం అనుకుంటూ చాలావాటిని కొనేస్తుంటాం. అయితే వాటిని కొనే ముందు ఏ విధంగా 'ఆరోగ్యవంతం' అనే విషయాన్నితెలుసుకోవాలి. అలా తెలుసుకోవాలంటే సదరు ప్యాకేజ్డ్ ఫుడ్ ప్యాకెట్స్‌పై వుండే లేబుల్‌ను తప్పనిసరిగా చదివే అలవాటు చేసుకోవాలి. ప్రతి ప్యాక్‌పైనా పోషకాల తాలూకు సమాచారం వుంటుంది.

తయారీలో వాడిన పదార్థాల జాబితా వుంటుంది. వాటిని చదివి, విశ్లేషించుకోవడంవల్ల ఆ ఆహారం ఆరోగ్యపూరిత ఛాయిస్ అవునో కాదో అర్థం అవుతుంది. షుగర్, సోడియం, ఫ్యాట్, పూర్తిస్థాయి ఎనర్జీ వంటివి ఏ మోతాదులో వుంటాయో తెలుస్తుంది. ప్యాక్‌పైగలలేబుల్‌నుచదివి,ప్యాక్డ్‌ఫుడ్ తినొచ్చా? లేదా? అన్న నిర్ణయాన్ని తీసుకోవచ్చు. ◆

## రాత్రివేళ వద్దు

అన్ని సీజన్లలో, ప్రతి ఒక్కరికీ అందుబాటులో వుండే పండు అరటి. శారీరక రోగనిరోధక వ్యవస్థను బలోపేతం చేయడంలో అరటిపండు కీలకంగా వుంటుంది. కండరాలను బలోపేతం చేస్తుంది. అరటిపండులో పీచు జీర్ణవ్యవస్థకు ప్రయోజనకరమైనది. సహజ యాంటాసిడ్‌గా పనిచేసే గుణం ఉంటుంది. కడుపులో మంటగా ఉన్నప్పుడు ఓ అరటిపండు తింటే ఉపశమనంగా ఉంటుంది. పొటాషియం అత్యధికంగా లభిస్తుంది.

ఇన్ని సుగుణాలుగల అరటిపండును రాత్రి పడుకునే ముందు సాధారణంగా చాలామంది తింటుంటారు. అయితే ఈ పండును రాత్రి భోజనంచేసిన తర్వాతకంటే మధ్యాహ్న సమయంలో తినడం మంచిది. ఖాళీ కడుపుతో తినకూడదు. ఈ పండును రాత్రివేళ తినడంవల్ల ఊపిరితిత్తుల్లో మ్యూకస్ ఏర్పడి, జలుబుచేసే అవకాశాలు ఉంటాయి. ◆

## అంజీర్‌తో ఆరోగ్యం

డ్రైఫ్రూట్స్‌లో అంజీర్ గురించి ఎక్కువమంది పట్టించుకోరు కాని, వీటిలో అనేక ఆరోగ్య ప్రయోజనాలుంటాయి. ఐరన్ పుష్కలంగా లభిస్తుంది కాబట్టి రక్తహీనతతో బాధపడేవారికి మంచి ఆహారం. పీచు ఎక్కువగా లభిస్తుంది.

ఫ్యాట్ నామమాత్రంగా వుంటుంది. పొటాషియం ఎక్కువగా, సోడియం తక్కువగా వుంటుంది కనుక, రక్తపోటు నియంత్రణలో ఉపకరిస్తుంది.

క్యాల్షియంపాళ్ళుకూడా ఎక్కువే. ఇది ఎముక పుష్టికి దోహదపడుతుంది. ఇన్ని పోషకాలున్నందున చక్కని రోగనిరోధకశక్తిని అందించగలదు.


Courtesy: WOMAN'S ERA

అయితే ఈ విషయంలో పురుషులు ఆధిపత్య ధోరణి ప్రదర్శిస్తారని, అందుకే వారు భార్యలను నిర్లక్ష్యంగా చూస్తారు అన్నది శాస్త్రవేత్తలు చెప్పే మాట.

అటువంటి పరిస్థితి దాదాపు 80 శాతం మంది మహిళలకు ఎదురవుతుంటుందనేది అంచనా. ఆత్మగౌరవంలేకుండా జీవించాల్సిన పరిస్థితి సంసారంలో ఏర్పడేవరకు వేచివుండగా, తమసంసారపు నిబంధనలను తామే తిరిగి రాసుకునే స్థితికి మహిళలు రావాలన్నది సూచన. పలువురు మహిళల అనుభవాలను క్రోడీకరించినతరువాత వారు కొన్ని మార్గదర్శకాలను రూపొందించారు.

# నీవు నేను సమానం

- జోడు గుర్రాలు... భార్య-భర్త
- మాటకు విలువ ఉండాలి
- మెప్పు కరువైతే ముప్పు
- తీసిపారవేత ధోరణి

సంసారం ఒక రథంవంటిది. ఆ రథంలాగే గుర్రాలవంటివారు భార్య, భర్త. ఆ దంపతుల మధ్య అనుబంధం, అవగాహన సంసార రథానికి ఇరుసువంటివి. సంసార రథం సజావుగా సాగాలంటే దంపతులనే గుర్రాలు సమంగా పరిగెట్టాలి.

ఒకరు ముందుకు లాగినా, మరొకరు వెనక్కి లాగినా సంసార రథం ఒక పక్కకి ఒరిగిపోతుంది.వారి వేగంలో తేడా ఉంటే సంసార రథం పూర్తిగా కిందపడి దెబ్బతింటుంది. అందుకే ఒక వాహనానికి కందెన సరిగా వుందో లేదో అని పరిశీలించి, ఎప్పటికప్పుడు కందెన పెట్టినట్టే సంసారమనే వాహనానికి, దాని గమనానికి భార్యాభర్తల బంధాన్ని పరిశీలించుకుని, పొరపాటుగా ఉన్నదానిని చక్కదిద్దుకోవాల్సివుంటుంది.

పాతికేళ్ళపాటు విడివిడిగా, భిన్న కుటుంబ వాతావరణాలలో పెరిగిన స్త్రీ, పురుషులు వివాహమనే తంతుతో సంసారం మొదలుపెడతారు. నాటివరకు వారి ఆలోచనలు వేరు. లక్ష్యాలు భిన్నమైనవి. ఎంచుకునే గమ్యంకూడా భిన్నంగా ఉంటుంది.

అటువంటివన్నీ పక్కనపెట్టి, ఇద్దరూ కలిసి ఒకటిగా వ్యవహరించటం మొదలుపెట్టాలి. ఇది ఒక పెద్ద రాజీ. జీవితంలో ఎంతోమందిలో, ఎన్నో రకాలుగా రాజీపడుతూ ముందుకు వెళతారు.

## తన ధోరణిలోనే

భార్యాభర్తల మధ్య రాజీ అనేది ఒక చిత్రమైన వ్యవహారం. సరిగా ఎవరిదగ్గర రాజీ అవసరమో అక్కడ రాజీపడటానికి అహం అడ్డువస్తుంది.

తన మాటేనెగ్గాలన్న పట్టుదలలు పెంచుకుంటారు. చిన్న చిన్న అంశాలు చిరాకును పెంచుతుంటాయి. వాటిని ఎలా పరిష్కరించుకుంటారనేదానిమీదే వారి దాంపత్యం ఆధారపడుతుంది. కలిసివున్నప్పుడు ఒకరిగురించి మరొకరికి బాగా తెల్సినపుడు లోపాలు బాగా కనిపిస్తాయి, వారిమీద ఒక విధమయిన కోపం, చిరాకు పెరుగుతాయనేది ఇంగ్లీష్‌వారి మాట.

ఆ మాట వివాహబంధంలోకి దిగినతరువాత బాగా పెరుగుతుందని, వివాహబంధానికి ముందు మాటపట్టింపులు తక్కువని, సర్దుకుపోవటం ఎక్కువని అంటారు వారు.

మానసిక శాస్త్రవేత్తలు స్త్రీ-పురుష బంధాలలో విభేదాలకు దారితీసే అంశాలుగా కొన్నింటిని గుర్తించారు. అందులో ఒకరు రెండవవారిని 'పరవాలేదులే... నేను ఏం చేసినా చెల్లిపోతుంది... నోరు విప్పకుండా పడివుంటారు' అని భావించటం ముఖ్యమైనది.

అవతలివారి మాటకు విలువ ఇవ్వకుండా తన ధోరణిలోనే తాను వ్యవహరించటం దంపతుల్లో ఏ ఒక్కరు చేసినా సంసారంలో తిప్పలు తప్పవు.

## మాటకు విలువ

తన మాటకు విలువ ఇవ్వరని, తనను సంప్రదించటం జరగటంలేదని చాలామంది ఆడవారు ఫిర్యాదు చేస్తుంటారు. సంసారం ప్రారంభం దశలో ఇద్దరం సమస్థాయిలో ఉండేవారు.

అన్నిరకాలుగా సంప్రదింపులతో ఒక నిర్ణయానికి వచ్చేవారం. కాని ఆ తర్వాత క్రమంగా పరిస్థితులు మారిపోయాయి. పిల్లలు పుట్టి ఆమె దృష్టి పిల్లల పెంపకంవైపు మరలగానే కుటుంబ నిర్ణయాల విషయంలో క్రమంగా భర్తదే పైచేయి అవటం మొదలవుతుంది అనేది ఆడవారి ఫిర్యాదు.

నాటివరకు 'మేము' 'మాది' అన్న ప్రవర్తనలో ఉన్న భర్త 'నేను' అనేది పెరుగుతుంది. తాను నిర్ణయం తీసుకుంటే భార్య అనుసరించవలసిన పరిస్థితిని సృష్టిస్తారు. ఒకప్పుడు ఇటువంటి వాతావరణాన్ని స్త్రీలు సులభంగానే అంగీకరించారు.

కాని విద్యార్హతలు సమమై, ఉద్యోగ బాధ్యతలు ఒకలాంటివై, పరిజ్ఞానం పెరిగినతర్వాత నిర్ణయాధికారంలో పాలుపంచుకోవాలని ఆమె అనుకుంటూ, తగిన గుర్తింపు, గౌరవం, అవకాశం ఇవ్వనపుడు మానసికంగా ఘర్షణకు గురవుతున్నారు. ఈ పరిస్థితికి పరిష్కారంగా దాంపత్య జీవిత ప్రారంభంలోనే

భార్యాభర్తలిద్దరూ ఒక అవగాహనకు రావటం అవసర మన్నది సామాజిక, మానసిక నిపుణుల సలహా.

సంసారానికి, వ్యక్తిగతంగా ప్రభావితం చేసే ప్రతి అంశంలో నిర్ణయం సమిష్టిగా జరగాలన్న ఆలోచన దంపతులు స్థిరపరచుకుంటే సమస్య జటిలమవ్వదు. తగినంత సమయమివ్వకపోవటం భర్తలు చేసేరెండవ పొరపాటు. తనకోసం ఎంతసేపయినా అలా ఎదురు చూస్తూవుండటం ఆమె బాధ్యతనుకుంటారు.

ఆ నమ్మకంతో ఆమె ఎదురుచూడటాన్ని పెద్ద అంశంగా పట్టించుకోరు. అదేవిధంగా ఆమెతో సంప్రదించకుండా ఏవో కార్యక్రమాలను నిర్ణయించి, గబగబా తయారవమని ఒత్తిడి తెస్తారు.

తాను నిర్ణయించిన విషయాలకే ప్రాధాన్యతగాని, ఆమె నిర్ణయించిన వాటికి విలువ లేదన్నట్టుగా ప్రవర్తిస్తారు. తాను పెట్టిన ప్రోగ్రామ్‌లకు ఆలస్యంగా ఇంటికి రావటం ఆయనకు అలవాటయిపోయిందని వాపోతుంటారు భార్యలు.

ఈ విషయంలో భర్తను తప్పుపట్టేముందు భార్యలు తమ గత ప్రవర్తనను ఒక్కసారి సమీక్షించుకోవాలంటారు వైవాహిక అంశాలలో సలహాదారులు. భర్త తరపువారి ఇంటికి వెళ్ళటానికి ఏదో ఒక అభ్యంతరం పెట్టేవారు, ఎందుకెళ్ళాలని ప్రశ్నించేవారికి ఇటువంటి ఫిర్యాదు చేసే అర్హత ఉండదు.

గతంలో అతన్ని వేపుకుతిన్న ఘటనలు మరచిపోయి నాకు అనుకూలంగా భర్త ఉండాలనుకోవటం పొరపాటు. నిజంగానే మీ పొరపాటులేదని అనుకున్నప్పుడు ఇకనుండి మీరు పెట్టుకున్న కార్యక్రమానికి అతనికోసంఎదురు చూడకుండా వెళ్ళండి.

ఒకటి రెండుసార్లు అలాచేస్తే అతను మీ దారికి వస్తాడన్నది భార్యలకు చేస్తున్న ఇస్తున్న సూచన.

## మెచ్చుకోలు అవసరం

తాను చేసే ఎంత చిన్నపనైనా దానిని భర్త మెచ్చుకోవాలని భార్య కోరుకుంటుంది. ఇల్లు చక్కదిద్దటం, రుచికర వంటచేయటం తన బాధ్యతగా భావించి సంసారంలోకి దిగిన భార్యకు తన పనుల్ని మెచ్చుకోని భర్త దొరికితే జీవితం నిరాశగా మారుతుంది.

బహుమతులు తెచ్చివ్వని, ఆశ్చర్యంలో ముంచెత్తే పనులు చెయ్యని భర్తతో జీవితం భారంగా ఉంటుంది. ఆమె బాధ్యత ఆమె నిర్వహిస్తున్నది. అటువంటప్పుడు ప్రతి విషయాన్నీ నేను ప్రత్యేకంగా ఎందుకు మెచ్చుకోవాలని భర్తభావిస్తే ఆమెకిబ్బందే. అలాగని ఈ చిన్న విషయంమీద సంసారం కాదనుకోలేరు.

కాబట్టి కేవలం మెప్పుదలకోసం పనిచెయ్యవద్దు. మీకు ఇష్టమైనవి మాత్రమే చేయండి. అతనికోసం అదనంగా చేస్తున్న విషయాలను చెయ్యవద్దు. మీరు అందిస్తున్న సహకారం, తనకోసం చేస్తున్న పనులలో ఏదో లోపం ఏర్పడిందని తెల్సుకుని కారణం అర్థం చేసుకునే యత్నం భర్త చేస్తాడు.

మీ విలువ అతనికి అర్థమయ్యేలా చేస్తే చాలు, ఆ తర్వాత అతగాడు మీ వెంటనే ఉంటాడు, మీరు చేసే ప్రతి పనినీ మెచ్చుకునితీరతారు.

## స్పష్టంగా చెప్పాలి

నలుగురిలో ఉన్నప్పుడు తనని ప్రత్యేకంగాచూడాలని భార్యలు కోరుకోవటం సహజం. అటువంటి కోరిక భర్తలకూ ఉంటుంది. నలుగురిలో తన గౌరవం పెరిగేలా భార్య ప్రవర్తన, మాటలు ఉండాలని కోరుకునే భర్తలు, పదిమందిలో ఆమెను తక్కువచేసి మాట్లాడటం తప్పన్న విషయాన్ని గుర్తుపెట్టుకోరు.

స్నేహితులు, బంధువులు, పరిచితుల మధ్య పుటుక్కున విసుక్కోవటం లేదా చిన్నబుచ్చటం అనేది చేస్తారు. కొంతమంది భర్తలది పరోక్షంగా చిన్నబుచ్చే ధోరణి, ఆమె ఫోన్ చేసినపుడు వెను వెంటనే ఫోన్ తియ్యరు. మిస్డ్ కాల్ చూసినా వెను వెంటనే ఫోన్ చెయ్యరు. కాని తాము ఫోన్ చేసిన వెంటనే ఆమె ఫోన్ తియ్యాలనుకుంటారు.

అదికూడా రెండవ, మూడవ రింగ్‌కల్లా ఫోన్ తియ్యకపోతే వారి కోపానికి హద్దుండదు. ఏమిటంత ఆలస్యం, ఏంచేస్తున్నావంటూ మాటల దాడి మొదలు పెడతారు. ఇటువంటి కోపమే పదిమందిలోనూ ప్రదర్శించి చిన్నబుచ్చుతారు. అటువంటి మాటలను, కోపాలను భరించాల్సిన అవసరంలేదు.

ఆ ప్రవర్తనకు కారణం ఏమిటో తెలుసుకోండి. ఆ విషయంమీద భర్తతో మాట్లాడి, అటువంటి చిన్నబుచ్చటాలు ఇకముందు ఏమాత్రం అంగీకారంకాదన్న విషయం స్పష్టం చెయ్యండి.

## ద్వంద్వ ప్రమాణాలు

ఇది మగవారికిమాత్రమే పరిమితమైన అంశం కాదు.అటువంటి ద్వంద్వ ప్రమాణాలు ఆడవారిలోనూ ఉంటాయి.పుట్టింటివైపు ప్రవర్తన ఒకలా ఉంటుంది. మెట్టినింటివారి వైపు ప్రవర్తన ఒకలా ఉంటుంది.

తమవైపు ద్వంద్వ ప్రమాణాలు లేకుండా చూసుకున్నప్పుడే భర్త మీద ఫిర్యాదు చేసే హక్కు భార్యకు వస్తుంది. అయితే ప్రవర్తనలో, అవతలివారి నుండి ఆశించే ప్రయోజనాలు, సహాయాల విషయంలో ద్వంద్వ ప్రమాణాలు పాటిస్తుంటే అభ్యంతరపెట్టాల్సిందే.

తన సమయం తన ఇష్టంగా భావిస్తూ, తనకు మాత్రం బాధ్యతలు అంటూ ప్రత్యేకంగా ఏవీ లేవనుకుంటూ, భార్యమాత్రం అంతా పద్ధతి ప్రకారం,తనకు అణకువగా, తన సమయానికి తగినట్టుగా అన్నిసౌకర్యాలు అమర్చితీరాలని అనుకునే భర్తల విషయంలో భార్యలు తగువిధంగా వ్యవహరించాల్సిందే.

ఇంటి బాధ్యత ఇద్దరిదీ అని ఈ తరం దంపతులు అనుకునితీరాల్సిందే. పిల్లల పెంపకంలో బాధ్యతతీసుకోవాలి. ఇద్దరి ఉద్యోగాలు,పెద్దల మద్దతులేనికుటుంబ వాతావరణంలో సర్దుబాట్లు భారీగా అవసరం.ఆ సర్దుబాటులో భాగమే ద్వంద్వ ప్రమాణాలు వదిలించుకోవటం. తన ప్రవర్తనలో మార్పు భర్తనుండి అవసరమన్న విషయం స్పష్టంచెయ్యటంలో తప్పులేదు.

## పైచేయి భావన ఉండకూడదు

సమాజం ఎంతగా మారినా మారకుండా ఉన్న అంశం పురుషుడి పైచేయి భావన. చివరిగా తన మాటే చెల్లాలనుకోవటం, ప్రతి అంశంలో రాజీ సమయంలో తొలి అడుగు ఆమెవైపునుండే పడాలన్న మగవాడి పట్టుదల ఇబ్బందులు తెస్తున్నాయి.

పొరపాట్లు అనేవి ఇద్దరిలో ఎవరైనా చేస్తారు.తప్పు చేసినవారు క్షమాపణ చెప్పాలిగాని ఎవరిది తప్పైనా ఆమెదే తప్పుగా భావించి రాజీతో దగ్గరకు చేరాలనుకోవటం తప్పు. సంసారంలో సర్దుబాట్లు ఇరువైపుల నుండి అవసరం. ఎవరో ఒకరుమాత్రమే సర్దుకుంటూపోతే సంసారరథం సరిగా సాగదు.

డి.భరద్వాజ్



Courtesy : MAJI SAHELI

# యోధుడు



ఒకలాంటి నిరుత్సాహం...
ప్రతి విషయం ఎదురొస్తున్నట్లు... అన్నీ తప్పులు తడకలన్నట్లు... భవిష్యత్తు వెలవెలబోతున్నట్లు... బతుకు దుర్భరమనిపించే పరిస్థితులు.

భార్య అనారోగ్యంతో ఆస్పత్రిలో-

కన్నకూతురు ఎవడో పదవతరగతి తప్పిన పనికిమాలిన వెధవతో ప్రేమవ్యవహారంలో పీకల్లోతు - అంతా అయోమయం. ఎటువెళ్ళాలో, ఎక్కడికెళ్ళాలో తెలియక అడుగులో అడుగులేసుకుంటూ రోడ్డుమీద నడుస్తున్నాను. ఆర్.టి.సి. క్రాస్‌రోడ్స్ దాటాను.

కొత్తగా పెట్టిన బుక్‌షాప్... దానిమీద నా దృష్టి పడింది. ఏదో ఒక ప్రకాశం.. ప్రత్యేక వాతావరణంగా తోచింది. లోపలికి వెళ్ళాలనిపించి అడుగుపెట్టాను.

లోపలకు వెళ్ళగానే ఎంట్రన్స్ పక్కన కౌంటర్ లాగుంది. అక్కడో వ్యక్తి కూర్చునివున్నాడు.

ఎవరు....?

కాదు... అతను ఇక్కడెందుకుంటాడు అనిపించింది. లోపలికి వెళుతున్నవాడిని ఆగిపోయి వెనక్కి చూశాను.

అతనే... మురారి. అనుమానం లేదు. చూసి పాతికేళ్ళు దాటిపోయింది. దవడ దృఢంగా వుంది.ఐతే కాస్త పైకి లాగేసినట్లు... బుగ్గలు పొంగినట్లు ఇంతకు ముందుకన్నా... కంటిక్రింద గాయంతాలూకు మచ్చ. మెడమీద ఒక పొడుగాటి గాటు.

కళ్ళు ఒకలాంటి ధైర్యంతో నిండివున్నాయి... మెరుస్తున్నాయి. ఇదివరకటిలాగే చెక్కుచెదరని తీక్షణత వాటిలో. పరిశీలనగా ఒకటొకటిగా గమనించడంలో పడిపోయాను. కంప్యూటర్‌లో ఏదో చెక్ చేస్తున్నాడు. చూసీచూడగానే నా చేతులను గట్టిగా పట్టుకుని దగ్గరకు తీసుకున్నాడు.

ఉలిక్కిపడ్డాను...

బలంగా కౌగిలించుకున్నాడు.

ఏదో పట్టరాని ఆనందం... కొత్త కాంతులు.. పెదవులు కదిలాయి. పొంగిన మనసులు కళ్ళల్లో నీళ్ళు నింపాయి. "అబ్బా... ఎంత కాలానికి... నా జన్మ ధన్యమయింది" బొంగురు స్వరం దురదృష్టపు సాయంకాల జ్ఞాపకాన్ని మోసుకొచ్చింది.

ఆ దుర్ఘటన జరిగి పాతికేళ్ళు గడిచిపోయినా నిన్న మొన్న జరిగినట్లే ఉంది. మనసులో స్థిరంగా నిలిచిపోయింది. అప్పట్లో కమ్యూనికేషన్ వ్యవస్థ ఇంత బలంగా లేదు. అక్కడక్కడా టెలిఫోన్ సౌకర్యమేగానీ సెల్‌ఫోన్ సదుపాయం లేదు. మనుషులమధ్య ఉత్తరాలే ఆప్యాయతలు, ఆనందాలు అందించేవి.ఎదురుచూపులు మధురమనిపించేవి.

మధ్యాహ్నం ఎండ తీక్షణంగానే ఉంది.

పైలెట్ శిక్షణలో దాడికి సంబంధించిన చివరి అంశం అయింది. మేం కూర్చున్న ట్రైనర్ ఎయిర్‌క్రాఫ్ట్ రన్‌వేను సమీపిస్తోంది. సూర్యుడు అస్తమించడానికి సిద్ధమవుతున్నాడు.

మురారి - నా శిష్యుడు.

ఫైటర్ పైలెట్‌గా నా దగ్గర శిక్షణ తీసుకుంటున్నాడు. మంచి ఉత్సాహవంతుడు. తెలివయినవాడు. శిక్షణలో ప్రతి అంశాన్నీ ఎంతో నిశితంగా పరిశీలిస్తున్నాడు. అంత ఎంజాయ్ చేస్తూ నేర్చుకోవడం చూస్తే ఎవరికైనా ముచ్చటేస్తుంది.

అలాగే గురువైన నాకు ఎంతో గర్వంగా ఉంది. అతనికి ఎంతో ఉజ్వలమైన భవిష్యత్తు ఉందనిపించి ఆనందం కలిగేది. నేను ఎవరిదగ్గరైనా ఈ శిక్షణకు సంబంధించి ప్రస్తావించాల్సివస్తే "మా మురారి... అంటూ ప్రారంభిస్తాను.

ఎయిర్‌క్రాఫ్ట్ భూమ్మీదకు దిగుతున్న సమయంలో ఏ అవరోధం కనిపించలేదు. జీవితంలోలాగే అన్నీ సవ్యంగా ఉన్నట్లే అనిపించింది.

ఒక్కసారిగా ఎందుకో, ఏమిటో...

పరిస్థితులు తలకిందులయ్యాయి.

రెప్పపాటు సమయంలో ఘోర ప్రమాదం.

సాంకేతికంగా తలెత్తిన లోపమో, ఏమో కంట్రోల్స్ ఏవీ టచ్ చేయకుండానే ఎయిర్‌క్రాఫ్ట్ పక్కకు ఒరిగిపోయింది.రెక్క బలంగా నేలకు గుద్దుకుంది.

కర్ణభేరి పగిలిపోయేంత శబ్దం... లిప్తపాటులో ఎయిర్‌క్రాఫ్ట్ పెద్ద పెద్ద కుదుపులకు లోనయి ముందుభాగం రుద్దుకుంటూపోయింది.

పొగ కమ్ముకుంది.

"సార్..." బాధతో నిండిన మూలుగు.

నేను షాక్‌నుండి తేరుకోలేదు. నోరు పెగలట్లేదు. "ప్లీజ్.. హెల్ప్..." దయనీయంగా ఉంది గొంతు.

అస్తవ్యస్తంగా పడివుంది ఎయిర్‌క్రాఫ్ట్.

బ్రెయిన్‌లో రక్తం ఎగజిమ్మినట్లయింది. కాలు ఇరుక్కుపోయింది. చేతికి బలమయిన గాయం. ఏమాత్రం కదల్లేని పరిస్థితి నాది... నా సీటులోంచి లేచేందుకే ఎంతో ప్రయాసపడుతున్నాను.

సీటు స్ట్రాప్స్ వదులు చేసుకునే ప్రయత్నంకూడా చేతకావటంలేదు. ప్రమాదం సంభవించినప్పుడు మనిషి ముందు ఆత్మరక్షణలో పడతాడు. ఆ తరువాతే

మంత్రవాది మహేశ్వర్

పక్కవాడి గురించి ఆలోచిస్తాడు. అంత పెద్ద శబ్దం తర్వాత నా కంఠస్వరం వినిపిస్తోందా అనే సంశయం కలిగింది. కాసేపటికి -

"కొన్ని క్షణాలు ఓపికపట్టు మురారీ. మనం బయటపడతాం. సహాయం అందించడానికి అంబులెన్స్, ఫైర్ టెండర్లు వస్తుండాలి"

"నేను బతకననిపిస్తోంది" నా బాధ ఎక్కువయి మూలుగు వినిపిస్తోంది.

"అలా జరగదు. ఇరుక్కుపోయాం... అందుకే కదల్లేకపోతున్నాం. కాసేపట్లో బయటపడతాం. వర్రీ కావద్దు మురారీ" చీకటిలోనే ఓదార్పు.

మసక మసగ్గా విండో దగ్గర ఏదో అలికిడి బయట. విండోమీద అతికష్టంమీద వేళ్ళతో తట్టాను. గట్టిగా... గాజు పగలకొట్టాలన్నంత బిగ్గరగా... శక్తి లేదు... ప్రయత్నమే... నిరాశ.

"శ్వాసకూడాకష్టమవుతోందిసార్. కళ్ళు మూసుకుపోతున్నాయేమిటో"

బతిమాలి బతిమాలి నా అశక్తత తెలుసుకున్నాడో ఏమో 'దేవుడా... రక్షించు' అన్నాడు చివరికి.



## అన్ని పాత్రలూ

ఈ మధ్య సినిమాల్లో గ్లామర్ పద్దుల ఖాతాను మరింత విస్తృతపరిచిన రకుల్‌ప్రీత్‌సింగ్ 'ఖాకీ'లో ఇల్లాలిగా నటించింది. ఈ మార్పు ఎలా ఉందని రకుల్‌నడిగితే- "నటిగా అన్ని పాత్రలూ చెయ్యాలి కదా" అంటూ సమాధానం ఇచ్చింది.

"ఓ నటిగా అన్ని పాత్రలలోనూ మెప్పించాలన్నది నా లక్ష్యం. నావద్దకు వచ్చిన కథలు విని, వాటిలో మంచివి, నచ్చినవి ఎంచుకుంటాను. ఈ విషయంలో నా సీనియర్లే నాకు స్ఫూర్తి.

సినిమాల్లో ప్రయోగాలు చేయడానికి ఉబలాట పడుతుంటా. ఈ విషయంలో నాతో నేనే పోటీ పడుతుంటా" అని వివరించింది.

అందరినీ కాపాడేవాడు ఆ పైవాడే మరి. ఆ తరువాత అతని మూలుగులు వినిపించలేదు. నిశ్శబ్దం... చీకటి. ఈ రెండే మనిషిని భయపెడతాయి. దీనికి తోడు చుట్టూ పొగ. ఇప్పటిదాకా మురారి మూలుగులు ఒకలాంటి ధైర్యాన్నిచ్చాయి. ఎప్పుడైతే అవి ఆగిపోయాయో ఏదో భయం నాలోనూ...

ఇంతకీ మురారి పరిస్థితి?

అచేతనంగా మారిపోయాడా... లేదా మృత్యువు గానీ... ఛీ ఛీ అలా జరగదు... జరగడానికి వీల్లేదు. గట్టిగా అరిచేశాను.

ఆ అరుపులో ఏడుపు ఉంది. నిస్సహాయత ఉంది. కదల్లేని స్థితి... సహనం చచ్చిపోయింది.

"వచ్చినవాళ్ళు ఏం చేస్తున్నారు" కోపం కుంటల్లా ఎగిసిపడింది. మగతగా కళ్ళు మూతలుపడ్డాయి. చుట్టూ లైట్లకాంతి. హడావిడి... ఎయిర్‌క్రాఫ్ట్‌ను కటర్ సహాయంతో కట్‌చేశారు కొంత భాగాన్ని. అతికష్టం మీద బయటకు లాగారు ఇద్దరిని.

"ఒకే కదా"

"కదలగలరా"

"జాగ్రత్త"

"ఎవ్విరిథింగ్ ఈజ్ ఆల్‌రైట్"

స్నేహపూరితమయిన కంఠస్వరాలు ప్రాణవాయువులా అనిపించింది.

మురారి స్పృహలో లేడు. ఏం జరుగుతోందో తెలుసుకునే స్థితి కాస్త నాకే ఉంది.

ఇరుక్కుపోయి పెట్టిన పెద్ద పెద్ద కేకలు పెద్ద శబ్దంలో కలిసిపోయాయి. అంబులెన్స్‌లోకి మురారిని ఎక్కిస్తున్నప్పుడు చూడగలిగాను. పాలిపోయి ఉంది ముఖం... జీవం లేనట్లుగా.

ఆస్పత్రిలో నా ఎక్స్‌రేలు సిద్ధమయ్యేసరికి మురారి విషయం తెలిసింది. పరిస్థితి ఏం చెప్పలేమని... వెన్ను మాత్రం బాగా దెబ్బతిందని. దాంతో నడుము క్రింది భాగం పూర్తిగా చచ్చుబడిపోయివుండవచ్చని...

డాక్టరు ముఖకవళికలనుబట్టి మురారి పరిస్థితి దారుణంగానే ఉందనిపించింది. చావు బతుకుల మధ్య కొట్టుమిట్టాడుతున్నట్లు అనిపించింది.



మర్నాడు ఉదయం పూణెలోని కృత్రిమ అవయవ కేంద్రానికి తీసుకెళ్ళడం జరిగింది మురారిని.

ఒకే ఎయిర్‌క్రాఫ్ట్‌లో ప్రయాణిస్తున్నాం. పెద్ద ప్రమాదం. మురారిని మృత్యువు సమీపంలో నిలబెడితే, నేను గాయాలతో బయటపడగలిగాను. విధి విచిత్రం అంటే ఇదే.

మురారిని మళ్ళీ చూడలేదు ఆ తరువాత. అంటే దాదాపు పాతిక సంవత్సరాలు.

ఉత్తరాలద్వారానే పలకరించుకోవడం.

ఒకసారి మురారి తన ఉత్తరంలో -

"సార్... నా చుట్టూ ఘోరమైన వైకల్యంతో జీవితాన్ని లాక్కెళ్ళిపోయేవారిని చూశాను. లోకాన్ని చూడలేని అంధులెంతోమంది గుండెధైర్యంతో జీవిస్తున్నారు. నేను చాలా అదృష్టవంతుడిననిపిస్తుంది. నేనెందుకూ పనికిరాను, బతికుండడంవల్ల ఏమిటి ప్రయోజనం అనిపించిన క్షణాలున్నాయి"

ఉత్తరంలోని ఆ వాక్యాలు చదివినప్పుడు ఏడుపొచ్చింది. మురారి మనస్తత్వాన్ని అభినందించకుండా ఉండలేకపోయాను.

ఏడాదితర్వాత...

అతణ్ణి సర్వీసునుండి తీసేశారు. చచ్చుబడిన అవయువాలకు చికిత్స తీసుకోవచ్చని, మంచి డాక్టర్ల పర్యవేక్షణకోసం అతను పూణెలోనే సెటిలయ్యాడు. మెరుగుదల చాలా నెమ్మదిగా అనిపించింది. ఐనా మురారిలో పట్టుదల సడలలేదు.

మరో ఉత్తరంలో -



## అవాస్తవాలు

తెలుగులో మహేష్‌బాబు సరసన నటిస్తున్న క్రైరా అద్వానీ చుట్టూ డేటింగ్ వార్తలు షికారు చేస్తున్నాయి. వీటిపై స్పందన ఏంటని క్రైరాను కదిలిస్తే కిసుక్కున నవ్వేసింది.

"ఇటువంటి కథలు ఆధారరహితం, అవాస్తవం. వీటిగురించి సూరజ్ పాంచోలి, నేను చర్చించుకుని నవ్వుకున్నాం. మేము ఇద్దరం కలసివున్న ఓ ఫోటోను బయటకు తెచ్చారు.

నిజానికి ఆ రోజున మాతోపాటు లంచ్‌లో ఇంకా చాలామంది ఉన్నారు. కాని, మేం ఇద్దరం కలసివున్నవి మాత్రం వచ్చాయి. తెలియకుండా ఫోటోలు తీశారు. అడిగితే ఇంకా మంచి ఫోజులు ఇచ్చేదాన్ని" అంటున్నది క్రైరా అద్వానీ.

"సార్ నాకు లోపలా బయటా స్టీల్ రాడ్స్, క్రచస్ లేకుండా నేనేం చేయలేని పరిస్థితి. నిరంతరంగా వాటి వాడకంచేతో ఏమో కండలుపట్టి భుజాలు మాత్రం బలంగా, విశాలంగా తయారయ్యాయి. 'బాహుబలి'నన్నమాట... గుండెలో ధైర్యం. సాహసం పైన దృష్టి పోవడంలేదేమిటో..."

ఈసారి బాధ కనబడలేదు. చమత్కారం కనిపించింది. ఎందులోనైనా సంతోషం వెతుక్కునే చక్కని స్వభావం. కొన్నాళ్ళకు ఉత్తరాలు క్రమక్రమంగా తగ్గిపోయాయి మా మధ్య.

ఒకసారి ఎప్పుడో వచ్చిన ఉత్తరంలో -

"ఖాళీగా కూర్చుని కవిత్వాలు రాయడం, పెయింటింగులు వేయడంతో విసుగ్గా ఉంది. జీవితంలో సాహసం లేకపోతే ఏదో వెలితిగా తోస్తోంది. మళ్ళీ ఎయిర్‌క్రాఫ్ట్ నడపలేనంటారా"

మురారిలోని బాధ నాకు అర్థమై జాగ్రత్తగా ఎంతో ఆలోచించి అతనికి ది ఫైటర్ స్పిరిట్.. అంటూ స్ఫూర్తిని ఇచ్చేలా లెటర్ రాశాను. ఉద్యోగరీత్యా ఈమధ్యకాలంలో నాకు చాలాచోట్లకు బదిలీ అయింది. ఉత్తరాలు పూర్తిగా తగ్గిపోయి,ఏదైనా పండుగలప్పుడు కార్డులు పంపించుకోవడం జరిగేది. అంతే...

మళ్ళీ ఇదుగో... ఇప్పుడే.

నా ముందు మురారి.

"జింజర్ టీ మీకు బాగా ఇష్టం కదా" అన్నాడు.

నా ఇష్టాన్ని ఇన్నేళ్ళయినా ఎంత బాగా గుర్తుంచుకున్నాడు అనిపించింది. టీ తెప్పించాడు. ఇద్దరంచాలా విశేషాలు మాట్లాడుకున్నాం. హైదరాబాద్ వచ్చి స్థిరపడి ఈ షాపు నడుపుతున్నాడన్నమాట.

"...దీనివల్ల నేను గొప్పవాడినేం అయిపోను. నా అవసరాలకు సరిపడేలా సంపాదన. నిజమే పెళ్ళి చేసుకోలేదు. పిల్లని ఇచ్చే ధైర్యం ఎవరికి ఉంటుంది అయినా...." నవ్వుతూ చెప్పాడా విషయాన్ని.

"... ... ..."

"బావగారు ఆ మధ్య సరిహద్దు కాల్పుల్లో చనిపోయారు. అక్క నా దగ్గరే ఉంటోంది. ఆమె పిల్లల్ని నా పిల్లలుగా చూసుకుంటున్నా. ఏమైనా స్వతంత్రంగా జీవిస్తున్నాను. అది చాలు" ముఖంలో తృప్తి కనిపించింది. ఆస్పత్రి నుంచి బయటకు వచ్చి అడుగులు వేయలేక వేస్తున్నప్పుడే తల్లి కన్నుమూసింది. షార్ట్ సర్క్యూట్ కారణంగా అతని షాపు కాలి బూడిదయిపోయింది... ఈ విషయాలన్నీ చెబుతున్నాడు.

ఎక్కడా క్రుంగిపోయినట్లు మాట్లాడలేదు. చిన్నప్పట్నుంచీ పైలట్ కావాలని, ఆకాశంలో విహరించాలనే కోరిక తీరలేదనుకున్నాడు.

జీవితంలో మురారి పెద్ద ఫైటే చేశాడని నాకు అనిపించింది. ఫోను రింగైంది.

అతను మాట్లాడుతున్నాడు.

అలమరల్లో అందంగా అమర్చిన పుస్తకాలవైపు నా దృష్టిమళ్ళింది. కస్టమర్స్ పుస్తకాలు చూస్తూ అటూ ఇటూ తిరుగుతున్నారు. నా చూపులు మురారి వెనగ్గా తల పైభాగంలో గోడమీద పడింది.

గోల్డ్ ఫ్రేమ్‌లో వున్న పెద్ద ఛాయాచిత్రం.

మురారికి కప్పునందిస్తున్న భారత రాష్ట్రపతి... పక్కన చిన్నగా స్పోర్ట్స్ కారు.

మురారి గమనించినట్లున్నాడు నన్ను.

"ఓ చూశారా అది. పదేళ్ళక్రితం నార్మల్ డ్రైవర్స్‌తో పాటుగా ఒక రేస్‌లో పాల్గొన్నాను. ఒక ప్రైవేట్ కార్ల కంపెనీ నాకు వీలుగా వుండేటట్లు కారును తయారు చేసి అందించింది స్వంత ఖర్చులతో... అప్పుడు ఆ కప్పు గెలుచుకున్నాను" చెబుతుంటే ఆనందానికి అతని కళ్ళు నీళ్ళతో నిండాయి.

చాలా పొంగిపోయాను. 'పెద్ద సాహసమే' మనసులో అనుకున్నాను. ఎప్పట్నుంచో చూస్తున్నాను... సాహసం అతని ఊపిరి అనిపించింది అతన్ని కలిసిన మొదటి రోజే.

"ఏమిటి... ఎలా" అని మురారీని అడగకుండా ఉండలేకపోయాను.

"మీరు రాసిన ఉత్తరం ఎంతో ఉత్తేజపూర్వకంగా అనిపించింది. దానిని ఎంతో భద్రంగా పదిలపరచుకున్నాను" అంటూ టేబుల్ డ్రాయర్‌లోంచి లామినేట్ చేసిన ఆ ఉత్తరాన్ని చూపించాడు.

నేను రాసిన ఉత్తరం....

ప్రశ్నార్థకంగానే ఉంది నా ముఖం.

"ది ఫైటర్ స్పిరిట్...యోధుడికుండే స్ఫూర్తి... ఎప్పుడూ, ఎటువంటి పరిస్థితుల్లోనూ చావదు.అది ఊపిరై నిలుస్తుంది. యోధుడు ఎప్పుడూ యోధుడే. పరిపూర్ణంగా జీవించడానికి ఒక్క జీవితం చాలు... అయితే సరిగా జీవించాలి. ధైర్యంతో జీవించాలి" అని ఉంది. అయితే -

ఆ వాక్యాలు అండర్‌లైన్ చేయబడివున్నాయి. అతనిలోని సాహస గుణాన్ని పదే పదే తట్టిలేపాయి అని చెప్పడానికి, అతని జీవితం, ఆ ఛాయాచిత్రం సాక్ష్యంగా నిలుస్తాయి.

మురారికి సెలవు చెప్పి బయటికొచ్చాను. గుండె నిండా ఒక కొత్త విశ్వాసం... నా పోరాటం నేనేచేయాలి, ఎటువంటి జంకూలేకుండా మురారిని చూశాక నాకు ఉన్నవీ సమస్యలేనా అనిపించింది. యుద్ధంలోనే కాదు, బతుకు సమరంలోనూ పరిస్థితులెంత క్లిష్టమయినవైనా ఎదుర్కోగల సాహసం చేయాలి.

చేతుల్లో... కాళ్ళల్లో... కళ్ళల్లో అన్నింటినీ మించి గుండెల్లో ఒక కొత్త శక్తి ప్రవహించడం మొదలైంది. చిత్రమేమిటంటే అతని పోరాట పటిమ చూశాక నాకు అనిపించింది నేను శిష్యుడిని... మురారి గురువు అని.

వెనక్కితిరిగి చూశాను.

మురారి షాపు గుమ్మం దగ్గర క్రచస్‌తో నిలబడివున్నాడు, నాకేసి చూసి చేయి ఊపుతూ.

నాలాగానే అనుష్క కూడా నిజాయితీగా వ్యవహరిస్తుంది. అందుకే మేమిద్దరం ఒక్కటి కాగలిగాం. జీవితాంతం ప్రేమను కొనసాగిస్తామని మాకు మేము వాగ్దానం చేసుకున్నాం.

-విరాట్‌కోహ్లీ, క్రికెటర్



# ఒక చిన్నమాట





డాక్టర్ జె.భాగ్యలక్ష్మి
E-mail: jbhagyalakshmi43@yahoo.in

గుజరాత్ ఎన్నికల విషయమై ముందు ఎన్నడూ లేనంత ఆత్రుత ప్రజలకున్నా,రాహుల్‌గాంధీ దేశంలో పురాతనమైన,గొప్ప చరిత్రగల కాంగ్రెస్ పార్టీకి అధ్యక్షుడు కావటం, ముందు ముందు పార్టీని ఎలా నడిపిస్తారు, కాంగ్రెస్ భవిష్యత్తు ఏమిటి అనే విషయాలు ప్రజల ఆసక్తిని రేకెత్తిస్తున్నాయి.

పార్లమెంట్‌లోను, ఇతరత్రా రాహుల్‌గాంధీ మాటలు ఆయన ప్రవర్తన రాజకీయాలపట్ల ఆయనకు ఆసక్తి లేదనే భావానికి తావు కల్పించాయి. భవిష్యత్తుకు ఆశగా ఆయనను చిత్రించాలని పార్టీ ప్రయత్నించినా ఆయన పదవులకు దూరంగానే ఉంటూ తనకున్న ప్రాముఖ్యతను ఎవరూ ఊహించనిరీతిలో చాటుకొంటూనేవచ్చారు.

మన్మోహన్‌సింగ్ ప్రభుత్వం తీసుకొన్న నిర్ణయాలు బహిరంగంగా విమర్శించటం, తేలిగ్గా తీసెయ్యటం జరిగింది. పత్రికా విలేకర్లు, మీడియా వ్యక్తుల సమావేశంలో ఆయన ఉపన్యాసానికి ఎదురుచూస్తున్నప్పుడు హఠాత్తుగా సభలో ప్రవేశించి ఏ విషయమై చర్చ జరుగుతోందో ఆ కాగితాలు చింపి అది ఎంత వ్యర్థమో తెలియజెప్పారు.

ప్రజాహితంకోసం ఆయన వివాహంకూడా మానేసి దేశసేవకు అంకితమయ్యారని కాంగ్రెస్ సభ్యులు కొందరు ప్రశంసిస్తుంటారు.

నిజానికి దేశం ఆ త్యాగం కోరుకోలేదు. చాలా సరళంగా, అమాయకంగా మాట్లాడే రాహుల్‌ను ఎవరూ కుటిలనీతిని అవలంబిస్తున్నట్టుగాని, వ్యూహకారుడు అనిగాని, ప్రజాహితం పట్టనివాడనిగాని నిందించలేదు. పరిణతి లేదు, అనుభవం లేదు,గొప్ప బాధ్యతలకు తగునా అనిమాత్రమే ప్రశ్నించారు.

రాహుల్‌గాంధీ కాంగ్రెస్‌పార్టీ అధ్యక్షునిగా ఎన్నికయ్యారు. అధ్యక్ష పదవికి ఎన్నిక కావటానికి అవసరమైన ప్రక్రియలన్నీ జరిగాయి.

89 సెట్ల నామినేషన్లు దాఖలయ్యాయి. అన్నీ రాహుల్‌గాంధీవే. పార్టీకి చెందిన "సెంట్రల్ ఎలక్షన్ కమిటీ" అన్ని పత్రాలు పరిశీలించి, నామినేషన్లు వెనక్కి తీసుకునే తారీఖుకూడా ప్రకటించి అది అధిగమించిన తర్వాతే రాహుల్‌గాంధీ అధ్యక్షపదవికి ఎన్నికైనట్లు ప్రకటించింది.

అన్నీ ప్రజాస్వామ్య పద్ధతిలోనే జరిగాయి. కానీ ఇదీ ఒక ఎన్నికేనా అని జర్నలిస్టులు, మీడియా వ్యక్తులు ప్రత్యక్షంగా, మరికొందరు పరోక్షంగా, ప్రైవేటుగా అడిగారు. ఒక జర్నలిస్టుకు సమాధానమిస్తూ కాంగ్రెస్ సీనియర్ నాయకుడు మణిశంకర్ అయ్యర్ ఇచ్చిన సమాధానానికి అందరూ అవాక్కయ్యారు.

"జహాంగీర్ తర్వాత షాజహాన్ వచ్చాడు. అప్పుడు ఎన్నికలు జరిగాయా? షాజహాన్ తర్వాత ఔరంగజేబు నాయకుడవుతాడని అవగాహన ఉంది" అప్పుడూ ఎన్నికలు జరగలేదనేది ఆయన వ్యాఖ్య.

విమర్శలు చుట్టుముట్టగానే ఏదోవిధంగా సమర్థించుకోటానికి ప్రయత్నించి విఫలమయ్యారు. అప్పటికే అన్ని దిక్కులనుండి విమర్శలు వెల్లువెత్తాయి.

ఈ విమర్శలు ఎన్నుకొన్న విధానంకంటే, వారసత్వ పద్ధతికంటే మిన్నగా ఈయన మొగలాయి చక్రవర్తుల వారసత్వాన్ని ప్రజాస్వామ్య వ్యవస్థలో ఉదాహరణగానో, నమూనాగానో చూపటమేమిటని, ఇప్పటికే ఉన్న విమర్శలను మరింత ఉధృతంచేయటం ఎందుకని, ఇందులో ఏమైనా వ్యూహముందా అని చాలామంది ఆలోచించసాగారు.

గుజరాత్‌లో ఎన్నికల సమయం. పోటీ గట్టిగా ఉంది. ఎన్నికలు క్లిష్టంగా ఉన్నాయి. ఎదురుదెబ్బలు కొట్టటానికి ఎదుటి పార్టీకి కాంగ్రెస్ మంచి అవకాశమిచ్చినట్లయింది. అది చాలదన్నట్టు వెనువెంటనే మరో టీవీ ఛానెల్‌తో మాట్లాడుతూ, "మోడీ నీచ్ కిస్మ్ కే ఆద్మీ" అని మణిశంకరే అన్నారు.

"కిస్మ్"కు వర్గమనే అర్థమూ ఉంది. దానినికూడా మోడీ గొప్ప ఎన్నికల విషయంగా వాడుకొని "బాధితుని"లా "తనవారి"ముందు మనోభావాలు పంచుకొని ఎవరేమన్నా తన లక్ష్యం 'దేశ సేవే' అని చాటి చెప్పారు. మణిశంకర్ అయ్యర్‌ని మోడీకి క్షమాపణ చెప్పమని రాహుల్‌గాంధీ నిర్దేశించారు.

ఇదివరకు డిప్లొమేటుగాను, రాజీవ్‌గాంధీకి సన్నిహితమైన సలహాదారుగాను ఎన్నో చిక్కుముడులు విప్పి, ఎన్నో వ్యూహాలు రూపొందించి-

మేధావిగా, బహుభాషాకోవిదునిగా పేరుపొందిన మణిశంకర్ అయ్యర్ తన మాటకు అటువంటి అర్థమున్నట్టే తనకు తెలీదని, హిందీ తన మాతృభాష కాదని, ఇంగ్లీషులో ఆలోచించి హిందీలో మాట్లాడానని చెప్పటం విని ఆయనను తెలిసినవారెవరూ తమ చెవులను నమ్మలేకపోయారు.

ఒత్తిడి పెరగటంతో ఎన్నికల దృష్ట్యా మణిశంకర్‌ను రాహుల్‌గాంధీ పార్టీనుండి తొలగించారు. కాంగ్రెస్ అధ్యక్షునిగా ఖాయమైన క్షణంలో ఇటువంటి కీలక నిర్ణయం తీసుకోవటం ఆయన ముందు ముందు ఎలా వ్యవహరిస్తారో సూచిస్తుందని కాంగ్రెస్ సభ్యులు ప్రశంసిస్తుండగా, ఇదంతా ఒక వ్యూహం ప్రకారమే జరిగిందని నమ్మేవారూ లేకపోలేదు.

నేషనల్ హెరాల్డ్‌కు సంబంధించినవి సాంకేతికమే. ఇప్పుడు రాహుల్‌గాంధీ పబ్లిక్‌లో, సభలలో పైచేయిగా, వాక్ప్రవాహంతో ప్రశ్నలు సంధిస్తూ ఆత్మస్థైర్యంతో కనిపిస్తున్నారు. రాహుల్‌కు ఎంతో భవిష్యత్తు ఉంది.అది మనదేశ భవిష్యత్తుతో ఎంత ముడిపడివుందో ఇప్పుడు ఎవరూ చెప్పలేరు.

కాంగ్రెస్ పార్టీని వ్యవస్థీకరించి, కొత్త ప్రాణంపోసి ముందుకు తీసుకురావటం సాధారణమైన పనికాదు. రెండు రాష్ట్రాల ఎన్నికల ఫలితాలు కొంత ప్రభావం చూపిస్తాయి. నెహ్రూకు ఇష్టమైన "హామీలు నిలుపుకోవాలి. ఎన్నో మైళ్ళు నడవాలి" అనే మాటలు రాహుల్‌గాంధీకి వర్తిస్తాయి.



# సౌకర్యంలోనే సౌందర్యం

ఏడేళ్ళ సుదీర్ఘ ప్రయాణం సాగించాక శ్రద్ధాకపూర్ చిత్ర పరిశ్రమలో తన స్థానాన్ని సుస్థిరపరుచుకోగలిగింది. 'తీన్‌పత్తి'తో 2010లో కెరీర్‌కు శ్రీకారం చుట్టింది.

'ఆషికి 2', 'ఎబిసిడి2', 'బాఘీ' వంటి హిట్లు జతచేసుకుని, బయోపిక్‌లతో బిజీ అయింది. ఫ్యాషన్, అందాల గురించిన కబుర్లెన్నో చెప్పింది. ఆమెతో ఇంటర్వ్యూ విశేషాలు :

**మీరు ఎటువంటి దుస్తుల్లో సౌకర్యంగా ఫీలవుతారు?**

నాకు భారతీయ, పాశ్చాత్య దుస్తులు రెండూ ఇష్టమే. అయితే నాకంటూ కొన్ని ఫేవరెట్స్ ఉన్నాయి. అన్నింటికంటే ఎక్కువగా నా ట్రాక్ ప్యాంట్లు, టీ-షర్టులతో సౌకర్యంగా ఫీలవుతుంటా.

**మీ దృష్టిలో ఫ్యాషన్ అంటే?**

ఎంత ఎక్కువ కంఫర్ట్‌గా ఫీలవుతామో అదే ఫ్యాషన్ కాగలదు. ఏ దుస్తులు ధరించినా మనలో పై ఫీలింగ్ రాకూడదు. ఫ్యాషన్ అనో, ట్రెండ్‌అనో మనకు నప్పనివాటిని గుడ్డిగా అనుకరించకూడదు. స్వంత ఫ్యాషన్‌ను సృష్టించుకోగలగాలి.

**ఏవైనా దుస్తులపట్ల ప్రత్యేకంగా ఫీలవుతారా?**

పెళ్ళి కానివ్వండి, గణపతి ఉత్సవాలు, ఆడిషన్ మొదలైనవాటికి నేను ధరించే సల్వార్ కమీజ్ ఒకటి ఉంది. కుట్లు ఊడిపోయి, ఇక తీసేయాలి అన్న స్టేజ్ వచ్చాక కూడా ధరిస్తూనే వుంటా. ఎప్పుడోకప్పుడు తీసేస్తాలెండి. ఈ విషయంలో కొంచెం క్రేజీ.

**ఏళ్ళ తరబడి దాచిపెట్టుకునే దుస్తులున్నాయా?**

ఉన్నాయి.మా అమ్మ, నాన్నో, అన్నయ్యో ఏదో ఒక సందర్భంలో బహూకరించిన దుస్తులను ఏళ్ళతరబడి దాచిపెట్టుకుని,ఆపైన వార్‌డ్రోబ్‌లో భాగం చేస్తుంటా.



**మీకు బాగా నచ్చి, గుర్తుండిపోయే పండుగలు జ్ఞాపకాలున్నాయా?**

మా 'నానా'స్ ప్రదేశంలోని గణపతి పూజ నాకు చాలా ఇష్టం. నేనక్కడే పెరిగాను. దాంతో ఈ పండుగ జ్ఞాపకాలెన్నో వుంటాయి. కొద్దిరోజులు వంశస్తులందరూ ఓ చోట గడపడం అనేది చాలా మంచి విషయం. బోల్డన్ని పదార్థాలు తయారు చేసుకుంటూ, నవ్వులతో ఎంతో సంతోషంగా గడిపేస్తుంటాం.

**ఫిట్‌నెస్ ఎలా మేనేజ్ చేస్తుంటారు?**

నా ఫిట్‌నెస్ రొటీన్ అవసరాన్నిబట్టి మారిపోతుంటుంది.

నేను ఈ సంవత్సరం ఆరోగ్యవంతమయిన ఆహారం తినడానికి, పండుగలు, ప్రత్యేకసందర్భాల్లో సైతం ఆరోగ్యపూరితంగా ఉండేందుకు ప్రయత్నిస్తున్నాను.

ఎంతలా అంటే చివరకు గణపతి ఉత్సవాల్లో చేసే ఉండ్రాళ్ళు తినాలన్నా సరే నా ట్రైనర్ సలహా తీసుకున్నాను.

**మీ అందమైన చర్మరహస్యం?**

నిజాయితీగా చెప్పాలంటే ఎటువంటి రహస్యమూ లేదు. మైల్డ్ ఫేస్ వాష్‌తో సింపుల్‌గా ముఖం కడుక్కుని బాగా మాయిశ్చరైజర్ రాస్తుంటా. ప్రతి ఒక్కరూ అనుసరించగల సింపుల్ కార్యక్రమం ఇది. ఇకపోతే నేను ఎక్కువగా మంచినీళ్ళు తాగుతాను.

**మీరు ఇష్టపడే తీపిపదార్థాలు?**

నాకు జిలేబీ అంటే చాలా ఇష్టం. కేసర్ జిలేబి బాగా నచ్చుతుంది. ఏదైనా తగు మాత్రంగా తిని, ఆపైన క్యాలరీలు కరిగించేస్తుంటా.

**చాలా బ్రాండ్లని ఎండార్స్‌చేసే మీరు ప్రత్యేకంగా మీకు వాటితో సాన్నిహిత్యం ఉంటుందా?**

ఈ అసోసియేషన్ అనేది ప్రత్యేకమైనది. ఇవి అందానికి మించి అప్పియరెన్స్ గురించి తెలియజెప్తాయి.

**నటిగా, గాయనిగా పని ఎలా బ్యాలెన్స్ చేస్తారు?**

మనకు నచ్చిన పనులు చేయాలనుకుంటే అన్నింటికీ సమయం వుంటుంది. ప్లాన్ చేసుకుంటే సమయపాలన ఉంటుంది అని చెప్పింది శ్రద్ధాకపూర్.

అయినపూరి సుజాత



సీరియల్

# అలా ఇలా



## పుట్టగంటి గోపీకృష్ణ

"కళ్ళున్న ఎవరికైనా తెలుస్తుంది" అన్నాడు రమేష్.

"మరి నాకు తెలియటంలేదే?" అన్నాడు మురారి.

"అదే నీ దురదృష్టం. నిజమైన ప్రేమను కనుక్కోవటం అంత తేలిక కాదు. ఇష్టంలేని అమ్మాయి వెంటపడిన ఏ మగాడూ బాగుపడిన సంఘటన చరిత్రలో లేదు" అన్నాడు రమేష్. ఇంతలో రెండు కాఫీకప్పులు తెచ్చి వీళ్ళిద్దరికీ ఇచ్చి వెళ్ళింది పనమ్మాయి.

"ఏది ఏమయినా ముదిరితే బాగోవు..." చేతిలోని కండెని పక్కనపెడుతూ అన్నాడు మురారి.

అతను మాట్లాడుతున్నది దేనిగురించో అర్థం కాలేదు రమేష్‌కి. "ఏంటీ?" అన్నాడు.

"కండెగురించిలే..." అని, కాఫీతాగుతూ మాటలు కొనసాగించాడు మురారి. "నేనంటే ఈషికకి ఇష్టం లేదని కూడా అర్థమైందా?"

"నన్ను అడుగుతున్నావు సరే! నీకు అర్థంకాలేదా?" తనుకూడా కాఫీ సిప్‌చేసి అన్నాడు రమేష్.

"అర్థమయిందనుకో... కానీ ఏమి చెయ్యమంటావ్? మా తాతయ్య బలవంతంమీద ప్రయత్నాలు చెయ్యక తప్పటంలేదు."

"మీ తాతయ్య ఓల్డ్ జనరేషన్. అలానే మాట్లాడతాడు. అలాకాక మరోరకంగా మాట్లాడే ఛాన్సే లేదు. అయినా నీకైనా తెలియాలిగా! ఆ అమ్మాయి నుంచి నీకు ఒక్కటంటే ఒక్కటయినా ప్రేమసంకేతం అందిందా?" "ప్రేమసంకేతం అంటే?"

"అంటే... నాకు తెలిసిన ఒక అబ్బాయికి తన ప్రేమికురాలు ఎక్కడో అరకిలోమీటర్ దూరంలో ఉండగానే అలౌకిక పరిమళం ఒకటి చుట్టుముడుతుందంట. నా సంగతి తీసుకో...

మీ చెల్లి కనపడగానే కళ్ళుమూసుకుపోతాయి. పగటి కలల్లోకి జారుకుంటాను. మరి నీకు అలాంటి సంకేతం ఏమైనా కనిపించిందా?"

లేదన్నట్లు నిరుత్సాహంగా తలడ్డంగా ఊపాడు మురారి. ఇంతలో అతనికి మరో ఆలోచనవచ్చింది.

"మరలా అయితే మృదులని చూడగానేకూడా నాకేమీ సంకేతాలు కనపడటంలేదుకదా" అని తనఅనుమానం వెలిబుచ్చాడు.

ఏం చెప్పాలో అర్థంకాలేదు రమేష్‌కి. "అదీ నిజమే! కొన్నాళ్ళు పరిశీలించు. ఎవర్ని చూస్తే సంకేతం దొరుకుతుందో వాళ్ళే నీకు తగిన భాగస్వామి" అన్నాడు.

"నువ్వంటుంటే ఒక విషయం తడుతోంది. మొన్న వేపచెట్టు ఎక్కి కింద పడినపుడు మృదులకి దగ్గరయ్యాను కదా!... అప్పుడు పగలే మెరుపులు మెరిసినట్లయింది.

కానీ, ఏఆడపిల్ల దగ్గరకొచ్చినా అలానే ఉంటుందేమో అనుకున్నాను..."

"అలా ఎందుకవుతుంది. నువ్వు నిజంగా ప్రేమించిన అమ్మాయి అయితేనే అలా జరుగుతుంది"

"కానీ అలా జరిగింది ఒక్కసారే కదా!...



(18) జరిగిన కథ

వ్యాఘ్రం బృందాన్ని పరామర్శించటానికి వచ్చిన కాంతారావు వారిని చూసి వెటకారంగా నవ్వి వ్యాఘ్రాన్ని వేళాకోళమాడతాడు.

ఈలోగా మారువేషంలో వున్న కిరణ్ కాంతారావుకి ఎదురుపడేసరికి -

'నిన్ను ఎక్కడో చూసినట్లు ఉంది' అని అంటాడు కాంతారావు.

కాంతారావు విషయం గ్రహిస్తాడని మేల్కొన్న వ్యాఘ్రం అతను దుబాయ్ నించి వచ్చాడని చెబుతాడు.

అయినా అనుమానం తీరని కాంతారావు అక్కడ అతను ఏపని చేస్తాడు తదితర వివరాలన్నింటినీ గుచ్చిగుచ్చి అడుగుతాడు. అన్నిటికీ ఓపిగ్గా సమాధానాలిస్తాడు ఆదిత్య.

అనుమాన నివృత్తికోసం తన ఇంటికి వెళ్ళి పొగాకుని తీసుకురమ్మని కిరణ్‌ని కోరతాడు కాంతారావు.వేగంగా కాంతారావు ఇంటికి వెళ్ళిన కిరణ్‌కి కాంతారావు కూతురు గౌరి నవ్వుతూ అతడిని ఆహ్వానిస్తుంది. ఇక చదవండి.



నిజంగా ప్రేమసంకేతం అంటే ఎప్పుడూ జరగాలి"

"అదీపాయింటే!... ఇంకొక సారి పరీక్షించుకో. నీకే తెలుస్తుంది..."

"థ్యాంక్స్ రమేష్. నాకొక మార్గం చూపించావు" కాఫీ తాగటం ముగించి మంచి కప్పు పక్కనపెడుతూ అన్నాడు మురారి.

"కాబోయే బామ్మర్దిని. ఆమాత్రం నీమీద కన్సర్న్ లేకపోతే ఎలా?" అన్నాడు రమేష్ తను కూడా కాఫీ తాగటం ముగించి. అంతే!!!... ఎప్పటినుంచో ఈ అవకాశంకోసం ఎదురుచూస్తున్నట్లు టైగర్ ఒక్క ఎగురు ఎగిరి రమేష్ మూతిని క్లీన్‌చేసి, తనకి కూడా ఆ కాఫీరుచి నచ్చినట్లు నాలుకతో మూతి నాక్కుంది. మురారి అదేమీ పట్టనట్లు,

"త్వరగా వెళ్ళకపోతే ఉడికించిన ఉలవలన్నీ ఎద్దులకే పెడతారు. తింటానికి భలే టేస్ట్ ఉంటాయి" అంటూ హడావుడిగా అవతలకి వెళ్ళిపోయాడు.

రమేష్ మొహం ఆముదం తాగినట్లు వికారంగా మారింది.రుచిగా ఉందని ఆబగా తాగిన కాఫీ వాంతిఅయి బైటకువెళ్ళిపోతే బాగుండనిపిస్తోంది.

కోపంతో అటూ ఇటూ చూసి దగ్గర్లో ఎవరూ లేకపోవటంతో దొరికిన కర్రను తీసుకుని టైగర్‌మీద విజృంభించాలనుకున్నాడు.కానీఅతను చేతిలోకి కర్రతీసుకోగానే టైగర్‌వాలకంకూడా మారిపోయింది. ఊపుతున్న తోకను నిటారుగాచేసి నోటిని కొద్దిగా తెరిచి కోరపళ్ళను ప్రదర్శిస్తూ...

గుర్రుమని శబ్దం చేసింది. రమేష్‌కి కర్రని పక్కన పడెయ్యక తప్పలేదు. అతను కర్రని పడెయ్యగానే టైగర్ తిరిగి విగరస్‌గా తోక ఊపుతూ తన ఆనందాన్ని తిరిగి ప్రదర్శించటం మొదలుపెట్టింది.

ఏమీ చెయ్యలేని అసహాయత్వంతో తననుతాను తిట్టుకుని ఆదిత్యకి ఫోన్ చేశాడు రమేష్.

"ఏంట్రా వెధవా? ఫోన్ చెయ్యటానికి ఎంతసేపు?" అంటూ కోప్పడ్డాడు ఆదిత్య.



## వింటర్ కేర్

శీతాకాలం జాగ్రత్తల గురించి 'చందమామ' అందాల కాజల్ అగర్వాల్ సవివరంగా చెప్పుకొచ్చింది. "ఈ సీజన్‌లో శరీరాన్ని తగినంత హైడ్రేట్ చేయడం ముఖ్యం.

కాబట్టి మంచినీళ్ళు బాగా తాగుతా. తాజా పండ్లు, కూరగాయలు తింటుంటా.

చలికాలంకంటే వేసవిలో క్యాలరీలు కరిగించడం సులువని నమ్ముతాను. శీతాకాలంలో వర్కవుట్లు ఎక్కువ చేయాల్సివుంటుంది.

చర్మం పొడిబారకుండా పడుకునేముందు నైట్‌క్రీమ్ అప్లయ్ చేస్తుంటాను.

జుట్టుకు వారానికి ఒకసారి నూనె రాసి, కండిషనింగ్ చేస్తుంటా. గుడ్డు కలిపిన హెయిర్ ప్యాక్స్ నాకు బాగా నూటవుతాయి. విటమిన్ 'ఇ' క్యాప్స్యూల్స్ వాడతాను" అని తెలిపింది.

"నీకలాగే ఉంటుంది బాబూ! ఇక్కడ ఇంటినిండా క్యారెక్టర్లే... ఎవరెవరో అర్థంకావటానికే అర్థరోజు పట్టింది..." అన్నాడు రమేష్.

"ఇంట్లో ఎంతమంది ఉంటే నీకెందుకు? అందర్లోకి నీకు కావలసింది నీ సౌందర్యేగా?"

"నాకు కావలసింది సౌందర్యే! కానీ నన్ను ఇష్టపడుతున్న క్యారెక్టర్ ఇక్కడ మరొకటి ఉంది"

"కొంపతీసి మరో ట్రయాంగిల్ లవ్‌స్టోరీనా?"

"కాదులే!... టైగర్ అని ఈ ఇంటికుక్క..."

"కుక్కా?"

"కుక్కా?... అని తీసిపారెయ్యకు. దానికి నచ్చితేనే మిగిలినవారికి నచ్చినట్లంట"

"అయితే నాలుగు బిస్కెట్ ప్యాకెట్లు కొంటే నీ ప్రాబ్లమ్ సాల్వ్ అయ్యుండేదే?..."

"ఇది బిస్కెట్లు తినే కుక్కకాదులే" అని తన బాధ అంతకంటే చెప్పలేక గొంతులోనే ఆపుకున్నాడు రమేష్.

"పాయింటుకిరా! నిన్ను రిపోర్ట్ చేయమంది అక్కడి విషయాలు. నీ బాధలు కాదు" విసుగ్గా అన్నాడు ఆదిత్య.

"ప్రస్తుతం ఇంటిల్లిపాదీ బయలుదేరి వరసిద్ధి మామిడితోటకి వెళ్తున్నాం..."

"అక్కడకెందుకు?"

"భోంచెయ్యటానికి"

"ఎగతాళా?"

ఈలోపు ఆడవాళ్ళందరూ తయారయి బయలుదేరారు. అందరికీ సరిపడే వాహనం ఏదీ లేదుకాబట్టీ, వాళ్ళ మామిడితోట ఊరికి దగ్గరేకాబట్టీ నడుచుకుంటూనే బయలుదేరారు.

తనతోపాటు నడవమని పిలుస్తున్న సౌందర్యకి ఫోన్ మాట్లాడటం అయ్యాక వస్తున్నానని సైగచేసి, కొద్దిగా వెనుకగా నడుస్తూ ఫోన్లో మాట్లాడుతున్నాడు రమేష్. "ఎగతాళి కాదు. మేమందరం ఊరేగింపుగా అక్కడికే వెళ్తున్నాం"

"ఇక చెప్పక్కర్లా?"

"ఏం?"

"మీరు నాకు కనిపిస్తున్నారు కాబట్టి... నా ఊహక పరిమళం నాకు వచ్చేసింది కాబట్టి"

"ఆ!... అన్నట్లు ఉరేయ్... పరిమళం అంటే గుర్తొచ్చింది.మృదుల తనని ప్రేమిస్తోందని ఆ మురారిని కన్విన్స్ చేయటానికి ప్రయత్నించాను. వాడు మరి నాకు సంకేతం ఏదంటున్నాడు?"

"ఏం సంకేతం?"

"అదే! ప్రేమసంకేతం"

"అది అందరికీ ఎందుకు వస్తుంది?"

"నేనే వాడిని కన్విన్స్ చెయ్యటానికి ఆ విషయంలో కొద్దిగా ప్రోత్సహించాను. ఇప్పుడు వాడికి మృదులని పట్టుకున్నప్పుడల్లా మెరుపులు మెరవాలంట. అప్పుడే వాడి ప్రేమసంకేతాన్ని వాడు నమ్ముతాడంట"

"ఒకటి చెయ్యమంటే ఇంకోటి చేస్తావ్!... సరే! ఆలోచిద్దాంలే..." సాలోచనగా అన్నాడు ఆదిత్య ఫోన్‌పెట్టేస్తూ. గుంపుగా సాగుతోంది ఊరేగింపు. చంకలో పుంజుని పెట్టుకుని వీళ్ళతోపాటునడుస్తున్నాడురామ్మూర్తి.టైగర్ మాత్రం రమేష్ అడుగులో అడుగువేసి వెంటాడుతోంది.

కాబోయే మామగారిని కాస్త కాకాపట్టమన్నట్లు సైగచేసింది సౌందర్య. ఈ ఐడియా కూడా బానే ఉందనుకున్నాడు రమేష్. తలవంచుకుని మౌనంగా నడుస్తున్న అతన్ని పలకరించాడు రమేష్. "ఏంట్సార్! మీతోపాటు ఈ కోడిపుంజు ఎందుకు?"

"ఇది పుంజుకాదు, తెల్ల నెమలి..." అన్నాడు రామ్మూర్తి రమేష్‌వైపు ఎగాదిగా చూసి.

"మీరు ఎగతాళి చేస్తున్నారు. కోడిని పట్టుకుని నెమలి అంటారేంటండీ?" తేలిగ్గా తీసుకుంటూ అన్నాడు రమేష్.

"ఇంకోసారి దీన్ని కోడి అనవద్దు..." సౌమ్యంగా చెప్పాడు రామ్మూర్తి.

"అంటే ఏమవుతుంది సార్?"

"నేను ఒక్క సైగ చేస్తాను"

"చేస్తే?"

"నీ అడుగులో అడుగు వేస్తూ నడుస్తుందే టైగర్...నీ పిక్కలో ఒక ముక్కని తిని పండుగ చేసుకుంటుంది" అన్నాడు రామ్మూర్తి.

"వద్దులెండి. దీన్ని నెమలని ఒప్పుకుంటున్నాను"

"ఇది నెమలి కాదు, తెల్లనెమలి..." మళ్ళీ చెప్పాడు రామ్మూర్తి.

"రెంటికీ తేడా ఏంటండీ?" అని దీనంగా అడిగాడు రమేష్.

"నీకు కోడిపందాల గురించి తెలియదా?"

"తెలియదు సార్"

"అయితే చెప్తాను. విను..." అంటూ చెప్పసాగాడు రామ్మూర్తి. మిగిలిన గుంపంతా వ్యూహం మార్చిన సైనికుల్లా చకచకా వీరికి దూరంగా జరిగిపోయారు. ఒక్కసారిగా అందరూ తనని ఒంటరిని ఎందుకు చేశారో రమేష్‌కి అర్థంకాలేదు.

ఆఖరికి సౌందర్య కూడా 'ఖర్మ..' అన్నట్లు తల కొట్టుకుని మిగిలినవారితో పాటు వీరిద్దరికీ దూరంగా జరిగింది. "కోడిపుంజు పౌరుషానికి పెట్టింది పేరు. రెండు కోడిపుంజులను ఒకదాని ఎదురుగా ఒకటి వదిలితే అవి తీవ్రంగా కొట్టుకుంటాయి. ఏదో ఒకటి ఓటమిని అంగీకరించి పారిపోయేవరకూ పోరు ఆగదు. గెలిచిన పుంజు ఎవరిదైతే వాడు గెలుస్తాడు... వాటిని డింకీపందాలంటారు"చెప్పాడు రామ్మూర్తి.

"ఇలా పందాలు పెట్టటం నేరం అంట కదండీ" అమాయకంగాఅడిగాడు రమేష్.

"నేను చేసిన డింకీ పందాలు కాదు ఇప్పుడు జరిగేది. వాటి కాళ్ళకి కత్తులు కడతారు. నిమిషాల్లో ఏదో ఒకపుంజు తీవ్రగాయాలతో చనిపోతుంది. అది జంతు హింస కిందకి వస్తుంది కాబట్టి ప్రభుత్వం వద్దంటుంది.



అర్ధనగ్న అమ్మాయివైపు మగాళ్ళు కోరికతో చూస్తున్న సన్నివేశాలు తప్పుడు సందేశం ఇస్తాయి. అటువంటి పొరపాటు సన్నివేశాలు నేను తీశాను.

-కరణ్‌జోహార్, దర్శకుడు

కానీ మనం ఆగుతామా? ఆగం... ఏదో ఒక దారిలో పండక్కి ఈ పోటీలు జరపందే పండగ పూర్తయినట్లు లెక్కకాదు"

"మరి ఇంతకుముందు నేను పుంజంటే మీరు నెమలన్నారు"

"మళ్ళీ అదేమాట మాట్లాడతావ్! ఇది నెమలి కాదు, తెల్ల నెమలి" అన్నాడు. ఆ తేడా ఏంటో అర్థం కాక తెల్లమొహం వేశాడు రమేష్.

"ఇవన్నీ పుంజుల్లో రకాలు. నెమలి, డేగ, కాకి, కాకి కువల, రసంగి, పువల, సేతువ, పచ్చకాకి, నల్ల చవల, నెమలి డేగ, కాకి డేగ, కాకి కువల, తెల్ల నెమలి, కొక్కి రాయి... ఇన్నిరకాల పుంజాలుంటాయి. ఏ పుంజు ఏ పుంజుమీద గెలుస్తుందో,

ఏ పుంజుని ఏ ముహూర్తాన బరిలోకి దింపితే గెలుస్తుందో... తెలిపేది 'కుక్కుటశాస్త్రం'. దీనిని చెప్పటానికి నిపుణులు ఉంటారు"

"ఓయమ్మో! ఇన్ని రకాలా?" ఆశ్చర్యం వెలిబుచ్చాడు రమేష్. మిగిలిన కుటుంబసభ్యులు చేస్తున్న రహస్య సంజ్ఞలు అతనికి అర్థంకావటం లేదు. వాళ్ళందరూ మామిడితోటవైపు వెళ్ళే దారిలోకి మలుపు తిరిగారు.

రామ్మూర్తిమాత్రం వేరేదారిలోకి తిరిగాడు. తనెటు వెళ్ళాలో తెలియక ఆగిపోయాడు రమేష్.

"ఏంటబ్బాయ్ ఆగిపోయావ్! నీకు కూడా బాగా ఇంట్రెస్ట్ ఉన్నట్లుంది. రా!!... పందాలు చూద్దువుగాని" అన్నాడు రామ్మూర్తి.

ఆఖరికి టైగర్‌కూడా ఆ మాట వినవద్దన్నట్లు రమేష్‌చొక్కా పట్టుకుని మిగిలినవారు వెళుతున్న వైపు వెళ్దామన్నట్లు లాగింది.

దానిమీద కోపంతో ఉన్న రమేష్ దాన్ని విదిలించి కొట్టాడు. రామ్మూర్తితో వెళ్తే అన్నా దానిపీడ విరగడవుతుందేమోనని అనుకున్నాడు కానీ, అది అయిష్టంగా అయినా రమేష్‌ని అనుసరించటం మానలేదు.

"మీకు మంచి కాలక్షేపం" రామ్మూర్తితో నడుస్తూ అన్నాడు రమేష్. అతను అందరి మాటా కాదని తనతో రావటంతో రామ్మూర్తికి అతనిమీద మంచి అభిప్రాయం కలిగింది. "అబ్బాయ్! నీ ఉద్యోగం ఎక్కడ?" అని అడిగాడు రామ్మూర్తి.

చెప్పాడు రమేష్.

"జీతం ఎంత వస్తుందేమిటి?"

"ఇలాంటి కోళ్ళని మందలు మందలుగా పెంచుకోగల్గినంత..." చెప్పాడు రమేష్.

"అదే అబ్బాయ్! రూపాయల్లో ఎంత అని అడిగా?" అన్నాడు రామ్మూర్తి.

"నెలకి లక్ష" నడక ఆపి అతనివైపు తిరిగి, నిజంగా కోళ్ళపందాలు ఆపటానికి పోలీసులు వస్తారని ఎదురుచూసే కొత్త జర్నలిస్టుని అమాయకంగా చూసే ఆర్గనైజర్లా చూశాడు రామ్మూర్తి.

"ఈ ఒక్క కోడిమీద పెట్టిన పెట్టుబడి ఎంతో తెలుసా? రెండు లక్షలు... నెలకి దీని తిండి ఖర్చు మూడువేలు" నింపాదిగా చెప్పాడు.



## జాగ్రత్త పెరిగింది

పెళ్ళి తర్వాత వ్యక్తిగతమైన మార్పులు లేవు కాని వృత్తిపరంగా మారాల్సివచ్చిందంటున్నది శ్రీమతి సమంత.

"కథలు ఎంపికచేసుకోవడంలో ఇంతకు ముందుకంటే ఎక్కువ జాగ్రత్తగా వ్యవహారిస్తున్నాను. నిజం చెప్పాలంటే ఇంతకుముందుకూడా కాస్తంత చాదస్తం ఎక్కువే వుండేది.

అవకాశాలు ఎక్కువే వుండేవి కాబట్టి అంతగా నచ్చనివాటిని పక్కనపెట్టేదాన్ని. ఏవోఒక తప్పులు వెతికేదాన్ని. ఇప్పుడా ధోరణి మరింత ఎక్కువ అయింది" అంటూ ఫ్రాంక్‌గా చెప్పింది.

"ఇప్పుడు చెప్పు నీ జీతంతో ఎన్ని కోళ్ళు మేపగలవ్?" అడిగాడు రామ్మూర్తి.

"సార్! కోళ్ళు మేపటానికి ఆస్తంతా హారతి కర్పూరంలా వెలిగించారంటే ఏంటో అనుకున్నా... ఈ బుజ్జిముండకి అంత ఖర్చా?"

"నాలుగు బియ్యంగింజలు వేస్తే తిని పెరగటానికి ఇది గుడ్లుపెట్టే పెట్టకాదు, పందెంకోడి. బాదంపప్పు, జీడిపప్పు, పిస్తాపప్పు తప్ప మరోటి పెట్టం. దాహం అయితే నీళ్ళు తాగదు. పచ్చిగుడ్డు తాపిస్తాం. స్నాక్స్ కింద మిరియాలపొడీ, అశ్వగంధీ... తింటుంది.

డిన్నర్ 50 గ్రాముల మాంసంతో ముగుస్తుంది. పోటీ పడటానికిగానూ తర్ఫీదు ఇవ్వటానికి వేరే మనుషులు ఉంటారు. రోజూ వ్యాయామంకింద 30 నిమిషాలు నీళ్ళలో ఈత కొట్టిస్తారు.

అప్పుడు కాని రెక్క బలవదు. అలా అని మరీ ఎక్కువ బరువుంటే ఎగరలేవు. అందుకని ఆముదం రాసి వేడినీళ్ళతో మసాజ్ చేస్తారు"

"అర్థమైంది సార్! ఇది మీలాంటి..." అని కాస్త ఆగి, 'ఒళ్ళు బలిసినవాళ్ళు...' అన్నమాట బయటకు అనకుండా, "...వారు మాత్రమే ఎంజాయ్ చేయగల హాబీ..." అన్నాడు. ఇంతలో వాళ్ళు చేరవలసిన చోటుకి చేరారు. ఒక పెద్ద రావిచెట్టుకింద గుంపులు గుంపులుగా పోగయివున్నారు జనాలు.

ఒక పెద్దమనిషి గుంపులో నుండి బయటపడి వీళ్ళకి ఎదురొచ్చాడు. అతని చంకలో చచ్చిపోయిన పుంజు ఉంది. దాని శరీరమంతా రక్తసిక్తమైవుంది.

"ఏం వెంకయ్య మావా? నీ డేగపని పుస్సేనా"

"పోయి పోయి సేతువమీద పోటీకి దించానురా! నీలిగి ఎలబారింది..." విసుగ్గా చెప్పాడు.

"ముహూర్తం చూడలా?"

"ఎందుకు చూడలా? ఆ పంతులు ముందు ఒక మాట చెప్తాడు. తరువాత మరోమాట చెప్తాడు..." అనుకుంటూ వెళ్ళిపోయాడతను.

రామ్మూర్తి తన చేతిలోని కోడిని రమేష్‌కి అప్పచెప్పి, ఆ గుంపుని ఛేదించుకుని గబగబా లోపలకి వెళ్ళిపోయాడు. రమేష్‌మాత్రం ఆ పని చెయ్యలేక అక్కడే ఉండిపోయాడు.

టైగర్‌కూడా రమేష్‌తోపాటు ఉండిపోయింది. ఇంతలో అతని భుజంమీదచెయ్యిపడింది. తనని ఇక్కడ పలకరించేవాళ్ళెవరా అని వెనక్కితిరిగి చూశాడు. అక్కడ ఒక మాసిపోయిన బనియన్, అడ్డపంచె ధరించి మొహంనిండా గుబురుమీసాలతో మోటుగా ఉన్న ఒక పల్లెటూరి యువకుడు కనిపించాడు. అతని చంకలో కూడా ఒక పుంజు ఉంది.

రమేష్ "ఎవరు నువ్వు..." అనేలోపు అతనే, "ఏంట్రోయ్ ఏంచేస్తున్నావ్?" అన్నాడు గుసగుసగా. అతను దగ్గరకు జరగటంతో అతనిదగ్గర ఏదో పిచ్చివాసన గుప్పునవచ్చింది. ముక్కు మూసుకుని, దూరం జరిగి... ఎగాదిగా చూశాడు రమేష్.

టైగర్ కూడా గుర్రుమంది.

కిరణ్‌కి అప్పుడర్థమయింది, రమేష్ తనని గుర్తుపట్టలేదని.

"ఉరేయ్! నేనురా... కిరణ్‌ని" అన్నాడు.

పరీక్షగా చూస్తే ఎదుటిమనిషిలో ఎక్కడో కిరణ్ పోలికలు కనిపిస్తున్నాయి. కానీ గొంతుమాత్రం ఢోకా లేకుండా పోల్చుకోగలగటంతో-

"ఏంట్రా? నీకేమైంది? ఈ అవతారం ఏమిటి?" అన్నాడు గొంతులో బాధ ధ్వనిస్తుంటే. నిట్టూర్చాడు

క్రోధాన్ని గెంటివేయి. అహంకారాన్ని అణగదొక్కు. దుర్గుణాలను దులిపివేయి. సద్గుణాలకు స్వాగతం పలుకు.



కిరణ్. "ప్రేమకష్టాలు..."అని సింపుల్‌గా చెప్పాడు.

"ప్రేమకోసం ఈ దరిద్రపు వేషం వెయ్యమని సలహా ఇచ్చిన సన్నాసి ఎవడు?"

"మన ఆదిత్యే! సరే... నా సంగతి పక్కనపెట్టు. ఇక్కడ నువ్వేంటి? నీ చంకలో ఆ కోడేంటి?"

"ఇది కోడికాదు తెల్లనెమలి" చెప్పాడు రమేష్.

"అది సరేలేవో! ఆ మాటకొస్తే నా చేతిలోది నల్ల కాకి. సరేకానీ, నువ్వేంటి ఇక్కడ?"

"నీచేత ఈ వేషంవేసిన సన్నాసే నాచేత ఈ పనులు చేయిస్తున్నాడు"

"ఆదిత్యా?"

"అవును"

"అంటే... నీవికూడా ప్రేమకష్టాలేనా?"

"ఒకరకంగా! నాతో వచ్చిన రామ్మూర్తి కూతురు సౌందర్య. ఆమెతో ప్రాబ్లమ్ లేదు.ఫ్యామిలీవాళ్ళే నన్నుచూసి డిసైడ్‌చేస్తామని ఈ ఊరు పిలిపించారు. మరి నీ సంగతి?" అన్నాడు.

"అక్కడ గూండాలా ఉన్నాడే! అతని పేరు కాంతారావు. అతని కూతురే గౌరి. ఆమెని ప్రేమించిన ఖర్మానికిఇలాఇక్కడ ఇరుక్కుపోయాను"

"నీకు అసలు ప్రేమమీద నమ్మకం లేదుగా?" అన్నాడు రమేష్.

"ఉండేదికాదు,ఇప్పుడు ఉంది"

"ఆ అమ్మాయికి నీకంటేమంచి సంబంధం వస్తుందా? నిన్నుకాదన టానికి కారణం ఏమిటి?"

"తాగుబోతునంట..."

"ప్రేమించాక ఇక తాగటం ఎందుకు? తాగకుండానే మత్తెక్కుతుందిగా..."

## సులువుగా, స్మూత్‌గా

ఇంతకు ముందే అజయ్ దేవగణ్‌తో కలిసి పని చేసిన ఇలియానా ఇంకోమారు అతని సరసన నటించడం తన అదృష్టం అంటూ ఆనందపడిపోతున్నది. 'రెయిడ్'లో వీళ్ళిద్దరూ కలిసి నటిస్తున్నారు. "అజయ్‌తో మళ్ళీ షూటింగ్ చేయడం గొప్పగా వుంది. షూటింగ్ దాదాపు పూర్తయిపోయింది. తనతోపని సులువుగా, స్మూత్‌గాసాగుతుంది.

ఇంకా చెప్పాలంటే ఆయనతో కలిసి పని చేస్తున్నప్పుడు తనో సూపర్‌స్టార్ అన్న విషయం స్ఫురణకే రాదు. *1980*ల నాటి చిత్రం.

ఇంత మంచి ప్రాజెక్టులో భాగం అయినందుకు గొప్పగా ఉంది" అని తెలిపింది ఇలియానా.

"భలేవాడివే! దేని దారి దానిదే..." అంటూ జేబులో నుండి చిన్నబాటిల్ తీస్తూ అన్నాడు కిరణ్.

అందులోని ద్రవాన్ని ఒక గుటకవేసి రమేష్‌కి ఆఫర్ చేశాడు. రమేష్ వద్దనలేకపోయాడు. బాటిల్ అందుకున్నాడు. టైగర్ రమేష్ కాళ్ళచుట్టూ తిరుగుతూ తోక ఆపకుండా ఊపుతోంది.

రమేష్ ఒక గుక్కవేసి సీసా తిరిగి ఇచ్చేశాడు. అంతే! టైగర్ ఎగిరి రమేష్ మూతి క్లీన్ చేసింది. ఆ తరువాత కూడా అది డ్రింక్ టేస్ట్ నచ్చినట్లు తోక ఊపుతూనేవుంది. "ఏంటా పని? అది ఏం చేస్తోంది?" ఆశ్చర్యంగా అడిగాడు కిరణ్.

"నా ఖర్మ. ఇది నేను ఎప్పుడు చేసుకున్న ప్రారబ్ధమో. దానికి నేను నచ్చాను. తనకి తాను నాకు కేర్ టేకర్‌గా ప్రకటించుకుంది. నన్ను వదలటంలేదు"

"ఒక కుక్కని వదిలించుకోలేకపోయావా?"

"దాని సంగతి నీకు తెలియదు"

"ఏంటి తెలిసేది? నేనయితే ఒక్క గంటలో వదిలించుకుంటాను" అన్నాడు కిరణ్.

"ఎలా?"

"కాస్త మందు పట్టించి నీతోపాటు తీసుకువెళ్ళి అడవిలో వదిలేసిరా!..."

"ఈ పనేదో బానే ఉన్నట్లుందే!..." అని రమేష్ అంటుండగానే కాంతారావు పొలికేక పెట్టాడు,

"ఎక్కడ చచ్చావురా కిరణ్..." అంటూ.

కిరణ్ చంకలోని కోడితోసహా పరుగెత్తాడు. ఈసారి గుంపు అతనికి దారిచ్చింది.

"ఏంది కాంతారావు మామా! నీ నల్లకాకిని ఎవడికో ఇచ్చావేంటి?" అన్నాడొకడు.

"ఆడెవరనుకుంటున్నారు. చూడ్డానికి కాస్త అసహ్యంగా ఉన్నా దుబాయ్‌లో డేగలకి ట్రైనింగ్ ఇచ్చేవాడు..." చెప్పాడు కాంతారావ్.

అతను తనకిచ్చిన పొగాక్కాడ వాసనింకా మనసులో మెదులుతూనే ఉన్నా, అతనిచేత తన కోళ్ళకి ట్రైనింగ్ ఇప్పిస్తే తిరుగుండదని భావించి వ్యాఘ్రాన్ని అడిగి ఇతన్ని తనతో తెచ్చుకున్నాడు అతను.

"డేగలు కాదు, గద్దలు..." అతని మాటని సరి చేశాడు కిరణ్.

"ఏదో ఒకటిలే...ఉత్తిమాటలేనా?ఏమన్నా ట్రైనింగ్ కూడా ఇచ్చావా?" కిరణ్ చంకలోని నల్లకాకిని తన చేతుల్లోకి తీసుకుంటూ అన్నాడు కాంతారావు.

"మీరే చూస్తారుగా" ఎటూ కాకుండా అన్నాడు కిరణ్.ఇంతలో రామ్మూర్తి పిలవటంతో రమేష్ కూడా చంకలోని తెల్లనెమలిని అతనికి అందించాడు.

ఒక పంతులువచ్చి చేతిలో ఉన్న పుస్తకం పరిశీలించి కోడి చెవిలో ఏదో మంత్రం చెప్పి, "ఇదే సరైన సమయం... వదలండి" అన్నాడు.

కత్తులు కట్టే కుర్రాడొచ్చి రెండు కోళ్ళకీ కత్తులు కట్టి వెళ్ళాడు. కాంతారావ్, రామ్మూర్తీ ఒకరి కోడిని ఒకరికి చూపించుకుని బరిలోకి వదిలారు.

హోరాహోరీ సమరం మొదలైంది. రెండు కోళ్ళూ ఎగిరెగిరి తన్నుకుంటున్నాయి.తాను పుట్టిందే ఎదుటి కోడిని ఓడించటానికన్నట్లు శక్తినంతా క్రోడీకరించుకుని పోటీపడుతున్నాయి అవి రెండూ. ఒక నిమిషం గడిచేటప్పటికి కాంతారావు నల్ల కాకి కొద్దిగా నీరసించింది. రామ్మూర్తికంటే అతని పక్కన ఉన్న పంతులు ఎక్కువ గంతులు పెడుతున్నాడు.

కాంతారావు టైమవుట్ తీసుకున్నాడు. తన పుంజుని చంకనేసుకుని, కోపంగా కిరణ్ వైపు తిరిగి, "ఇదేనంట్రా!... నీ గద్దల ట్రైనింగ్. నిన్ను నమ్ముకుని పందెం కాసినందుకు బాగా బుద్ధి చెప్పేటట్టున్నావే... కాస్త బయటకి తీసుకెళ్ళి గాలికి తిప్పుకురా..." అని నల్లకాకిని కిరణ్‌కి ఇచ్చాడు.

కిరణ్ జనం మధ్యనుంచి బయటపడి ఇవతలకి తీసుకువచ్చాడు దాన్ని. దాని పరిస్థితి చూస్తుంటే ఏ నిమిషమైనా గుడ్లు తేలేసేలా ఉంది.పాపం దెబ్బలు కూడా బానే తగిలాయి. దాన్ని ఆ పరిస్థితుల్లోచూస్తుంటే మనసు వికలమైపోయింది అతనికి.

అతనికి బాధొచ్చినా, ఆనందం వచ్చినా చేసేది ఒకటే! అందుకే జేబులో చెయ్యిపెట్టి బాటిల్ బయటకు తీశాడు. అందులో ఒకే ఒక గుక్క ఉంది. అది కూడా అయిపోయిన తర్వాత తన పరిస్థితి మళ్ళీ మొదటికొస్తుంది. చెట్ల మీద దాచే తెల్లటి డ్రింక్ దొంగతనం చేయక తప్పదు. బాటిల్ ఎత్తబోతుంటే సగం కళ్ళు తేలేసిన నల్ల కాకి కనిపించింది.

**ఇంకా ఉంది**



కారులో ప్రయాణించేటప్పుడు సీటుబెల్ట్‌ని మీ క్షేమంకోసం పెట్టుకోండి. ట్రాఫిక్ పోలీసు కేసు రాస్తాడని భయపడి పెట్టుకోకండి.

-ఒమర్ అబ్దుల్లా, కాశ్మీర్ మాజీ సి.ఎమ్.

# అంతా రాజకీయమే

## 1 తనది కాని వ్యవహారంలోకి

భాషాపరంగా ఆంధ్రప్రదేశ్‌లో భాగం, పాలనాపరంగా పాండిచ్చేరీలో వున్న భాగం యానాం. పాండిచ్చేరిలో భాగంగా వున్నందున ఎంతో లబ్ధి పొందుతున్నామని అక్కడి ప్రజలు భావిస్తుంటే అక్కడి ఎమ్.ఎల్.ఎ.మాత్రం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ అంశాలమీద అతిగా స్పందిస్తూ యానాం ప్రజలను పక్కదోవపట్టిస్తున్నాడు.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఇటీవల కాపులకు ఐదు శాతం రిజర్వేషన్లు కల్పించే నిర్ణయం తీసుకుంది. బి.సిల కోటా తగ్గించకుండా తీసుకున్న నిర్ణయం ఇది. తమకు నష్టం కలిగించని నిర్ణయం కాబట్టే బి.సి. సంఘాలు ఆందోళన చెయ్యటంలేదు.

అయితే యానాంనుండి ఎన్నికై పాండిచ్చేరి ప్రభుత్వంలో మంత్రిగా వున్న మల్లాడి కృష్ణారావు కాకినాడ కలెక్టరేట్ ముందు ధర్నాకు కూర్చుని తనకు సంబంధంలేని వ్యవహారాలలో తలదూర్చాడు.

యానాం వ్యవహారాలలో ఎ.పి. గవర్నమెంట్ ఎంతో మర్యాదగా వ్యవహరిస్తున్నది.

ఆ విషయం మరచిపోయి తన రాజకీయ స్వప్రయోజనాలకోసం ఆంధ్రప్రదేశ్ వ్యవహారాలలో తలదూర్చటంద్వారా మల్లాది కృష్ణారావు కొత్త రాజకీయ సాంప్రదాయం ప్రారంభిస్తున్నాడు.

ఏది ఏమైనప్పటికీ ఇది ఆయనకు, పాండిచ్చేరి ప్రభుత్వానికి కూడా అంత మంచిది కాదు. ◆

## 2 అర్థంలేని బెదిరింపు

ఇటీవల జరిగిన యు.పి. స్థానికసంస్థల ఎన్నికల్లో రెండవ స్థానంలో నిలిచి,రెండు మేయర్ స్థానాలను కైవసం చేసుకున్నది బి.ఎస్.పి.

దీంతో 'లైమ్‌లైట్'లో నిలవాలనుకుంటున్న బి.ఎస్.పి. అధినేత మాయావతి డిశంబర్ మొదటి వారంలో 'నేను బౌద్ధంలోకి మారతా' అంటూ ఒక బెదిరింపు ప్రకటనచేసింది. మతం వ్యక్తిగతమైనదని, ఎవరికి ఇష్టం వచ్చిన మతంవారు స్వీకరించే అవకాశాన్ని రాజ్యాంగం కల్పిస్తున్నది.

అటువంటి అవకాశాన్ని రాజకీయ ఆయుధంగా మలచుకోవాలని మాయావతి ఆలోచిస్తున్నది.

బలహీనపడుతున్న తన కుల సమీకరణ రాజకీయాన్ని తిరిగి కూడగట్టుకునేందుకు ఇటువంటి బెదిరింపు రాజకీయాలను హిందూసమాజంమీదికి విసరటం ఏ రాజకీయ నేతకు అంత మంచిది కాదు.ఏ రాజకీయ పార్టీకైనా రాజకీయ పోరాటాలు రాజకీయ సిద్ధాంతాలమీదే జరగాలి. ◆

## 3 చెదిరిన లక్ష్యం

తెలంగాణ ప్రభుత్వం ప్రతిష్ఠాత్మకంగా తీసుకున్న ప్రాజెక్టులు మిషన్ కాకతీయ, మిషన్ భగీరథ. ఎంత వేగంగా వాటిని లక్ష్యంవైపు నడిపించాలనుకుంటున్నప్పటికీ అవి ఎంతకీ స్పీడ్ అందుకోవటంలేదు.

లక్ష్యాన్ని వాస్తవ ఆధారితంగా సవరించుకుందామన్న ఆలోచన ప్రభుత్వానికి రావటంలేదు.

ఫలితంగా సంవత్సరానికి 9,500 చెరువుల మరమ్మతు అనే లక్ష్యంలో ఏడువేలు మించి సాగటంలేదు. వెరసి మూడేళ్ళలో 6000 చెరువులు లక్ష్యంలోకి రాకుండాపోయాయి.

తమ బిల్లుల చెల్లింపు జరగటం లేదంటూ ఆందోళన చేస్తున్నారు కాంట్రాక్టర్లు.

ఆ ఆందోళన ముదరకుండా వుండేందుకు కొత్త కాంట్రాక్టులు అన్నీ మీకే ఇస్తాం అనే తాయిలం విసిరేందుకు ఐదువేల చెరువుల చిట్టా తయారుచేస్తున్నారు అధికారులు. ◆

## 4 నాదే ఇష్టం

అమరావతిలో ప్రతి ఇటుక అమరిక నేను ఊహించినట్టే జరగాలి అనే ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడి ఆలోచన చివరికి అన్ని వర్గాలకు నచ్చడంలేదు. నగరం మొత్తం ఒక్కసారిగా డిజైన్ చెయ్యటం సాధ్యమా!

నగరంలోని ప్రతి బిల్డింగ్ ఫలానా పద్ధతిలో వుండాలనటం ఎలా కుదురుతుంది.

రాజుల కాలంలో హంపీ నగరం నిర్మాణం అయింది. అప్పుడు వారికున్న పట్టు వేరు.

అది రాజరికపు కాలం. నేడున్నది ప్రజాస్వామ్యం. పాలకులకు ప్రజలు ఇచ్చేది ఐదేళ్ళ కాలమే. ఆలోచనలు, పథకాలు అన్నీ ఆ ఐదు సంవత్సరాలలోపే వుండాలిగాని, ఆ తర్వాత వచ్చేవారికి ఎటువంటి అవకాశం ఇవ్వను.

అంతా నేనే గీసి వెళతాను అంటే ఎలా!

రాబోయే ఐదు సంవత్సరాలలో రాజకీయంగానే కాదు, ఆర్కిటెక్చరల్‌గా కూడా ఎన్నైనా మార్పులు రావచ్చు.

అవన్నీ కాదని ఇప్పుడే అన్ని డిజైన్లు పూర్తిచేయిస్తానంటే చివరికి 2019 ఎన్నికలనాటికి తయారయ్యేది మరో 'బాహుబలి' సెట్టింగ్ మాత్రమే.

ఆ సెట్టింగ్‌లతో కూడిన భవిష్యనగరం ప్రచారంలో వాడుకుంటామంటే అది మీ ఇష్టం. కాని అది ఎన్నటికీ ప్రజల ఇష్టం కానేరదు. ◆

## 5 స్వామిభక్తి

రాజకీయంలో ప్రత్యర్థికి అవకాశం ఇవ్వకూడదన్నది నీతిసూత్రం. కానీ రాజకీయాలలో చాలాకాలంగా వున్నా ఒకనాడు విదేశాంగ శాఖ అధికారిగా పనిచేసిన మణిశంకర్ అయ్యర్ మాత్రం తానెంతమాత్రం 'మణి'గా వ్యవహరించక, కాంగ్రెస్‌పార్టీకి ఒక 'రాయి'గా తయారయ్యాడు.

నెహ్రూ కుటుంబంపట్ల విధేయత, భక్తిగా వుండటం ఆయనకి ఇష్టం.

కాని ఆ 'స్వామి భక్తి' ప్రదర్శనకు ప్రత్యర్థుల మీద అర్థంలేని రాళ్ళు విసురుతానంటే అవన్నీ ఎదురువచ్చి తనకే తగులుతాయి.

2014లో ఒకసారి నరేంద్రమోడీని 'చాయ్‌వాలా' అని ఈసడించి ఎ.ఐ.సి.సి. సమావేశాల ముందు టీదుకాణం పెట్టుకో అంటూ ఎద్దేవా చేశాడు.

నరేంద్రమోడీ ప్రజల ఆదరణతో ప్రధానమంత్రి అయ్యాడు. మూడేళ్ళ తర్వాత మళ్ళీ ఇప్పుడు నరేంద్రమోడీని 'నీచమైనవాడు' అని మరో రాయి విసిరాడు. అది మోడీకి తగులుతుందో లేదో కాని తిరిగివచ్చి తనకే తగిలింది.

గుజరాత్‌లో పార్టీకి నష్టం కలిగించే 'రాయి' విసిరిన 'మణి'ని పార్టీ ప్రాథమిక సభ్యత్వాన్ని, తాత్కాలికంగా రద్దుచేశాడు రాహుల్‌గాంధీ. ◆

## 6 మాటవరసకు కూడా

జనాభాలో సగం జనాభా మహిళలు. మహిళా సాధికారత నేడు బాగా వినిపిస్తున్న పేరు. అయితే ఆ విషయంలో తెలంగాణ సి.ఎమ్. కె.సి.ఆర్‌కి అంతగా నమ్మకం వున్నట్టులేదు.కొత్త రాష్ట్రం ఏర్పడి, మూడున్నర ఏళ్ళు గడుస్తున్నా ఆయన మంత్రివర్గంలో ఒక్క మహిళా లేదు.

మహిళలమీద ఆయనకు చిన్నచూపో లేక వారి సమర్థత మీద నమ్మకం కరువవటమో తెలియదు కాని మహిళలను తనతో సమంగా కూర్చోపెట్టుకోరు. పైగా ఉద్యమ సమయంలో నా సోదరి వంటిది అంటూ తన పక్కన కూర్చోపెట్టుకున్న సినీనటి విజయశాంతిపట్ల చూపించిన గౌరవం ఏపాటిదో మనందరికీ తెలిసిందే.

కాబట్టి, కె.సి.ఆర్. ప్రభుత్వం ఘనంగా నిర్వహించామని చెప్పుకునే గ్లోబల్ ఎంటర్‌ప్రెన్యూర్ సదస్సులో మహిళా ప్రత్యేక సెక్షన్‌కి తన కొడుకు కె.టి.ఆర్‌ని కూర్చోపెట్టాల్సివచ్చింది.

అదొక ఎబ్బెట్టుగా అనిపించినా, కె.సి.ఆర్‌కి మహిళాశక్తిమీద అంతకన్నా నమ్మకంలేదని మనకి మనమే సర్ది చెప్పుకోవాల్సివస్తోంది.

# కదిలే బొమ్మల కబుర్లు

## ఎలా ఆడుతున్నాయి?

- బాక్సాఫీస్ చాలా అంటే చాలా డల్‌గా వుంది. వాస్తవానికి అన్ని థియేటర్లలో ఏదో ఒక సినిమా వుంది. కానీ వందల్లో, మహా అయితే వేలల్లో తప్ప పెద్దగా కలెక్షన్లు కురుస్తున్న జాడలేదు.
- అసలు చాలా సినిమాలు థియేటర్లకు ఎదురుకట్టి ఆడించుకున్నట్లు కనిపిస్తోంది తప్ప, ప్రేక్షకులు అటు వెళ్తున్న జాడలేదు.
- 'సప్తగిరి ఎల్ఎల్‌బి', 'మళ్ళీరావా' సినిమాలు ఓ మోస్తరు కలెక్షన్లను కళ్ళ చూశాయి కానీ, విడుదలైన మూడు రోజుల తరువాత మాత్రం అలా అలా ఖర్చులు రాబట్టుకుంటున్నాయంతే.
- డిశంబరు ఆఖరు వారం నుంచి పెద్ద, మీడియం సినిమాల దాడి మొదలవుతోంది. అక్కడి నుంచి ఫిబ్రవరి రెండోవారం వరకు బాక్సాఫీస్‌కు ఇక పండుగే పండుగ. ◆



## మంచి అవకాశాలు

'ఎక్కడికి పోతావు చిన్నవాడా' ఫేమ్ నందితా శ్వేత మొదటి సినిమాలో ప్రశంసలు, అవార్డులు అందుకున్నది కాని, అవకాశాలుమాత్రం అంతగా అచ్చిరాలేదు. కోలీవుడ్ వెళ్ళిపోయి, అక్కడ చేసిన ప్రయత్నాలు బాగానే ఫలించాయి.

కొన్ని సినిమాల్లో నటించింది. మళ్ళీ ఇన్నాళ్ళకు నందితా శ్వేత తెలుగు ఛాన్స్ దక్కించుకున్నది. రెండు సినిమాలకు సరేననేసింది కూడా.

ప్రస్తుతం తెలుగులో అవకాశాలు బాగా వస్తున్నాయని, కథలు బావుండడంతో రెండు సినిమాలకు సంతకాలు చేశానని చెప్తోంది. ఏహో ఒకటిలే- ఆదిలోనే డాంబికాలు ప్రదర్శిస్తే ఎలా...? ◆





## హైట్స్ అంటే భయం

చిత్రసీమలో ఎప్పటికప్పుడు లౌక్యంగా వ్యవహరిస్తూ సాగిపోతున్న తళుకులాడి తమన్నాకు ఎత్తయిన ప్రదేశాలంటే అమిత భయం అట. ఈ విషయాన్ని తనే స్వయంగా చెప్పుకున్నది.

"విదేశాలకు విహారంకోసం కాని, షూటింగ్‌కోసం కాని వెళ్ళినప్పుడు ఎత్తయిన ప్రదేశాలనుంచి చూడాలంటే నాకు చాలా భయం.

పారాచూట్ ఎక్కాలన్నా భయమే. వాహనంలో కొండ ఎక్కాల్సివచ్చినా భయపడిపోతుంటా" అంటున్నది కెరీర్ హైట్స్ ఆస్వాదించే తమ్ముఎత్తుల గురించి భయపడుతున్నది. ◆

## సూపర్ గాళ్ అంటారు

నటనలో ముంబయిలో శిక్షణ తీసుకున్న నైరాషా తెలుగులో 'ఇ.ఈ' అంటున్నది. టీవీ సీరియల్స్‌లో నటించిన నైరాషాకు ఇది తొలిచిత్రం.

"ఈ సినిమాలో నా పాత్ర పేరు హాసిని. నటిగా ప్రతిభ చూపడానికి పూర్తిగా అవకాశమున్న సినిమా. హాసిని పాత్రలో మంచితనం, కోపం, గర్వం, గ్లామర్, ప్రేమ అన్నీ మిళితమై వుంటాయి.

సినిమా చూశాక ప్రేక్షకులు నన్ను సూపర్‌గాళ్ అంటూ ప్రశంసిస్తారన్న నమ్మకం ఉంది.

బాలీవుడ్‌లో గాడ్‌ఫాదర్లు లేకపోతే అవకాశాలు రావడం కష్టం" అని చెప్పింది. ◆



## దర్శకుడిగా చూస్తున్నా

తండ్రితో కలిసి 'శభాష్‌నాయుడు' సినిమా చేస్తున్న శృతీహాసన్ నాన్న కమల్‌హాసన్‌లో ఓ దర్శకుడిని చూస్తున్నానంటూ కళ్ళు కాంతులీనేలా నవ్వుతూ చెప్పింది.

"'శభాష్‌నాయుడు' సెట్‌లో నాన్నను ఓ దర్శకుడిగానూ చూస్తున్నా. ఆయనను ఇలా చూస్తూ, ప్రతిక్షణం స్ఫూర్తి పొందుతున్నాను. నేను నటిగా ఈ చిత్రంసెట్‌లోనేఎక్కువ విషయాలు నేర్చుకున్నాను.

నాన్న నన్ను కూతురిగా కాకుండా ఓ నటిగా చూస్తున్నారు కాబట్టి ఆయనతో కలిసి పనిచేయడం సులువైంది. నేను నా స్వంత ప్రతిభను ఇప్పటిదాకా చూపగలిగాను.అందుకే ప్రేక్షకులు కమల్‌వేరు, శృతి వేరు అని భావిస్తున్నారు" అని చెప్పుకొచ్చింది. ◆





## నాకే ఎక్కువ

మహిళలకు సంబంధించి ఉన్నతంగా మాట్లాడే విషయంలో బంగరు తీగ సోనమ్‌కపూర్ సర్వదా ముందుంటుంది. ఇప్పుడదే క్రమంలో నాలుగేళ్ళనాటి 'రాంఝనా' సినిమాను స్మరించుకున్నది. ఈ సినిమాలో హీరో ధనుష్‌కంటే తనకే ఎక్కువ పారితోషికం ఇచ్చారంటూ స్వీయగొప్పతనాన్ని చెప్పుకున్నది.

అప్పట్లో ధనుష్ ఇదే సినిమాతో బాలీవుడ్‌కు పరిచయం అయి, అవార్డులు దక్కించుకున్నాడు. పారితోషిక తారతమ్యాల గురించి సోనమ్ ప్రస్తావిస్తూ, పాత సంగతి పేర్కొన్నది.

"నా చిత్రాలు బాక్సాఫీసు వద్ద ఎలా ఆడతాయో నాకు బాగా తెలుసు. 'రాంఝనా'కు ముందు నా సినిమాలన్నీ విజయం సాధించాయి. నా పారితోషికాన్ని ఎంత తీసుకోవాలో నాకు తెలుసు" అని చెప్పింది. ఇప్పుడీ పాత పారితోషికాల గోల ఎందుకట...? ◆

## మై ఫిట్‌నెస్

ఈ సీజన్‌కు సంబంధించి తన వర్కౌట్లు, ఆహార విధానాలను వరువాల బొమ్మ పాయల్‌ఘోష్ ఇలా వివరించింది.

"వారంలో కనీసం నాలుగురోజులయినా ఎనిమిది నుంచి పదికిలోమీటర్లదాకా బ్రిస్క్‌వాక్ చేస్తుంటా. బ్యాడ్మింటన్, బాస్కెట్‌బాల్‌వంటి ఆటలూ ఆడతాను. ఔట్‌డోర్ వెయిట్ ట్రైనింగ్ బాగా ఎంజాయ్ చేస్తాను. ఇన్ని జాగ్రత్తలు తీసుకోనిపక్షంలో ఈ సీజన్‌లో కొవ్వు పేరుకుపోయే అవకాశాలు ఎక్కువగా ఉంటాయి. చేపలు, చికెన్ ఎక్కువగా తింటుంటా.

సీజనల్ కూరగాయలూ బాగా తీసుకుంటా. రోజుకు నాలుగైదు లీటర్ల నీరు, రెండు మూడుసార్లు గ్రీన్ టీ తాగుతాను" అని చెప్పింది. ◆

## పుకార్లు సబబేనా...?

తారలన్నతర్వాత ఎప్పుడోకప్పుడు ఏదోఒక పుకారులో ఇరుక్కుంటూనే ఉంటుంటారు. సదరురూమర్లు శృతిమించితే ఎవరైనా నొచ్చుకుంటారు. కలర్స్ స్వాతి ఇప్పుడలాగే నొచ్చుకుంటున్నది.

"నా కెరీర్‌లో నాకు చాలామందితో లింకులుపెట్టి పుకార్లు సృష్టించారు. ఎవరితో ఏ కాస్త సన్నిహితంగా వున్నా,వారందరితోనూ ప్రేమలో ఉన్నానంటూ వార్తల దుమారం లేపారు. కలిసి నటించిన చాలామంది సహనటులతో ప్రేమలో పడ్డానని అన్నారు.

సినీపరిశ్రమలో ఉన్నంతమాత్రాన తప్పుపడితే ఎలా? మా అందరికీ కుటుంబాలున్నాయి. ఇటువంటి వార్తలవల్ల ఎంత బాధపడాల్సి వస్తుందో ఆలోచించరా" అంటూ రుసరుసలాడింది. ◆





## నచ్చితీరుతుంది

'కబాలీ' ఫేమ్ ధన్సిక తనకు 'మేళా' సినిమా ఎంతో ప్రత్యేకం అంటున్నది.

2006లో ముంబయిలో జరిగిన వాస్తవ సంఘటన ఆధారంగా ఈ సినిమా తీస్తున్నారు.

'ఇది విభిన్నమైన కథ. నా కెరీర్‌లో ఎంతో ముఖ్యమైన చిత్రం. ప్రేమ, హాస్యం, భావోద్వేగాలువంటివన్నీ మిళితమైన సినిమా. సినిమా, నా పాత్ర ప్రేక్షకులకు తప్పకుండా నచ్చుతాయని ఆశిస్తున్నాను'' అని తెలిపింది. ఈమాత్రం ఆశాభావం ఉండితీరాలన్న సూక్ష్మం ఆమెకు తెలియదా! ఏంటి? ◆



## మారిపోవచ్చు

కథల ఎంపికలో ఎంత జాగ్రత్తగా ఉన్నా ఒక్కోసారి బోల్తాపడక తప్పదనేది హెబ్బాపటేల్ అభిప్రాయం. "కథ విన్నప్పుడు చాలా బాగా అనిపిస్తుంది. కాని, అదితెరపైకివచ్చాక తేలిపోయినట్లుంటుంది.

కథ ఎంత బాగున్నా దాన్ని దర్శకుడు బాగా చిత్రీకరించాలి కదా. ఇటువంటి అనుభవాలు నాకు ఎదురయ్యాయి. కథ విని ఒప్పుకున్నాక, సినిమా విడుదలయ్యాక 'అసలెందుకు దీన్ని ఒప్పుకున్నాను' అనిపించిన సందర్భాలున్నాయి.

అంటే కథనచ్చినా, అది తెరపైకి వచ్చేసరికీ అలా ఉంటుందన్న నమ్మకం ఏమీలేదు. ప్రతిసారీ కాకపోయినా ఒక్కోసారి అలాజరుగుతుంటుంది"అంటూ మనస్సులోని మాటను వెల్లడించింది. ◆



## బలం బ్రెయినే!

పరిశ్రమలోకి వచ్చి పదిహేనేళ్ళయినా చేతిలో అరడజను సినిమాలు ఉంచుకోగలిగిన త్రిష హార్డ్ వర్క్ చేస్తూ, తమను తాము నమ్మితే సక్సెస్ సాధించగలరంటూ నవతరం తారలకు సలహా ఇస్తున్నది.

"ప్రతిదీ మనం అనుకున్నట్లు జరగదు. ఒక్కోసారి అలా జరగకపోవడం కూడా మంచిదే. నేనుకనుక షూటింగ్ స్పాట్‌లో నొచ్చుకుంటే నా వ్యానిటీ వ్యాన్‌లోకి వెళ్ళిపోయి మౌనంగా కూర్చుంటాను.

నా బలం ఏమిటీ అని ఎవరడిగినా నా బ్రెయినే అని టక్కున సమాధానం చెప్పేయగలను'' అంటూ సరదా సరదాగా కబుర్లు చెప్పింది. ◆



## భావోద్వేగాలకు భాష లేదు

దక్షిణాదిలోనే కెరీర్ ఆరంభించి ఉత్తరాదిని ఊపేయాలనుకున్న అదితీరావ్‌హైదరీకి మళ్ళీ దక్షిణాది గాలి మళ్ళినట్లుంది. 'చెలియా'లో మనోహర రూపంతో మత్తెక్కించిన అదితీరావ్ బాలీవుడ్‌లో 'పద్మావతి', 'ఔర్ దేవదాస్' చిత్రాల్లో నటిస్తున్నది.

ఇప్పుడు తెలుగు చిత్రాలకు సై అంటున్నది. 'సుధీర్‌బాబు' చిత్రంలో పనిచేస్తున్నది.వెంకటేష్‌సరసనా ఛాన్స్‌కొట్టేసిందని వినికిడి.

దక్షిణాది పరుగుగురించి ఆమెను కదిలిస్తే, సినిమాలఎంపికలో తనకు భాషాభేదాలులేవంటున్నది.

"కథలు భావోద్వేగాలను చూపుతాయి. ఈ భావోద్వేగాలకు భాషతో నిమిత్తం లేదు.నేను భాషహద్దులు విధించుకోను. గొప్ప దర్శకులతో పనిచేయాలన్నది నా కోరిక'' అంటూ సమాధానం ఇచ్చింది.

# చివరి రోజుల్లో...

>> డే అండ్ నైట్ మ్యాచ్‌లు, రంగుదుస్తులు, రంగుబంతులు... అలా మొత్తం వాతావరణం మారిపోయింది. దానితోపాటే టీ.వీ. కామెంటేటర్స్ కూడా సెలబ్రిటీలయ్యారు. వారి రూపం, డ్రెస్, మాటలు, వారి వ్యక్తిగత జీవితాలు వగైరాలన్నింటిమీదికీ దృష్టి మళ్ళింది. నేడు ఇంతమంది మాజీ ఆటగాళ్ళు క్రికెట్ కామెంటరీలు చెపుతున్నారంటే వారందరికీ స్ఫూర్తి రిచి బెనాడ్.

బాల్యంలో ఆసక్తి రేకెత్తిన అంశంమీదే జీవితమంతా మక్కువ పెంచుకుని, ఎంత వయసు పెరిగినా ఆ అంశంతో అనుబంధం తెంచుకోకుండా జీవితం గడపటం అందరికీ సాధ్యం కాదు. ఎవరో కొందరికే సాధ్యమవుతుందనుకుంటే ఆ కొందరిలో ఒకడవుతాడు రిచి బెనాడ్.

క్రికెట్ క్రీడతో పరిచయం వున్నవారికి రిచిబెనాడ్ తెలియకుండా వుండడు. ఆటగాడిగా పాతతరం వారికి,వ్యాఖ్యాతగా ఈ తరంవారికి బాగా పరిచయం వున్నవాడే. ఆయన ఆటతో ఆ తరాన్ని అలరిస్తే,తన ప్రత్యేకమైన గొంతు మాటలతో టీవీ, రేడియో వ్యాఖ్యాతగా గొప్ప పేరు సంపాదించుకున్నాడు.

క్రికెట్ చరిత్రలో తొలిసారిగా 200 వికెట్లు, 2000 పరుగులు చేసిన ఆటగాడు రిచి బెనాడ్. 1950ల్లో క్రికెట్ పోటీల్లో ఆస్ట్రేలియా ప్రభ బాగా తగ్గిన సమయంలో జట్టులోకి ప్రవేశించి, తన తోటి ఆల్ రౌండర్ ఎలెన్ డేవిడ్‌సన్‌తో కలిసి పాతప్రతిష్ఠను జట్టుకు తిరిగి తెచ్చిన ఆటగాడు.

1950ల ప్రారంభంలో టెస్ట్ జట్టులోకి వచ్చిన రిచి బెనాడ్ 1958 నాటికి ఆస్ట్రేలియా జట్టుకు కెప్టెన్ అయ్యాడు.నాటి నుండి టెస్ట్ పోటీలకు గుడ్‌బై చెప్పినా 1964 వరకు కెప్టెన్‌గానే వున్నాడు.చాలామంది క్రికెట్ ప్లేయర్స్‌కి ఆట ఆడే రోజుల్లో తమ భవిష్యత్తు ఏమి టనే దానిమీద ఆలోచన వుండేది కాదు.

యూనివర్సిటీ ఆట ఆడి జాతీయ టీమ్‌లోకి వచ్చిన వారికి ఏదో ఒక ఉద్యోగం వుండేది. కాని కేవలం క్రికెట్ టాలెంట్ మాత్రమే వుండి విద్యార్హత అంతగా లేనివారి పరిస్థితి జాతీయజట్టులో స్థానం కోల్పోగానే ఇబ్బందులు మొదలయ్యేవి.

ఇప్పటిలాగా క్రికెట్‌కి స్పాన్సర్స్ లేరు. టీ.వీ. ద్వారా అంత ప్రచారం లేదు. మోడల్స్‌గా పనిచేసి డబ్బు చేసుకునే అవకాశం లేదు. అందువల్ల ఆటగాళ్ళ జీవితం ఆడటం ఆగిపోగానే,తర్వాత ఏమిటన్న ప్రశ్న ఎదురయ్యేది. ఈ ప్రమాదం ముందుగానే పసిగట్టిన మొదటి ఆటగాడు రిచి బెనాడ్.

క్రికెటర్‌గా తనకున్న పరిజ్ఞానం పంచుకునేందుకు రెండే మార్గాలు. ఒకటి కోచింగ్ ఇవ్వటం, రెండు కామెంట్రీ చెప్పటం.

వాటిలో కామెంట్రీని ఎంచుకున్నాడు. ఆటగాడిగా చివరిదశకు చేరుతున్న సమయానికి ముందే ఇంగ్లండ్‌లో కామెంటేటర్‌కి శిక్షణ ఇచ్చే కేంద్రంలో చేరి అందులోని మెలుకువలు నేర్చుకున్నాడు.



రిచి బెనాడ్
(1930-2015)

ప్రారంభంలో స్థానిక పోటీలకు కామెంట్రీ చెప్పిన రిచి బెనాడ్‌కి ఆ తర్వాత క్రమంగా స్థాయి పెరిగింది. క్రికెట్ ట్రెండ్ మారింది. టెస్ట్ మ్యాచ్‌లకు పోటీగా ఒన్‌డే మ్యాచ్‌లు వచ్చాయి.

డే అండ్ నైట్ మ్యాచ్‌లు, రంగు దుస్తులు, రంగు బంతులు... అలా మొత్తం వాతావరణం మారి పోయింది. దానితోపాటే టీ.వీ. కామెంటేటర్స్ కూడా సెలబ్రిటీలయ్యారు.

వారి రూపం, డ్రెస్, మాటలు, వారి వ్యక్తిగత జీవితాలు వగైరాలన్నింటి మీదికీ దృష్టి మళ్ళింది. నేడు ఇంతమంది మాజీ ఆటగాళ్ళు క్రికెట్ కామెంటరీలు చెపుతున్నారంటే వారందరికీస్ఫూర్తి రిచి బెనాడ్.

1930 అక్టోబర్ 6న పుట్టిన రిచి బెనాడ్ తన 22వ ఏట జనవరి 25, 1952న తొలి టెస్ట్ మ్యాచ్‌ని వెస్ట్ ఇండీస్‌తో ఆడాడు.

నాటినుండి పన్నెండేళ్ళపాటు ఆస్ట్రేలియా జట్టుకు సేవలు అందించిన రిచి బెనాడ్ 1964 ఫిబ్రవరి 12న చిట్టచివరి మ్యాచ్ దక్షిణాఫ్రికాతో ఆడి ముగించాడు. లెగ్ స్పిన్ బౌలర్‌గా, లోయర్ ఆర్డర్ బ్యాట్స్‌మన్‌గా మంచిగుర్తింపు పొందిన ఆల్ రౌండర్ రిచిబెనాడ్. కామెంటరీ చెప్పటంలోకూడా ఆల్ రౌండర్ అనిపించుకున్నాడు.

2005 వరకు అటు బిబిసి ఇటు చానల్ 9లో రిచి బెనాడ్ లేకుండా కామెంటరీ బాక్స్‌లు లేవు.

2005 తర్వాత క్రమంగా తన కామెంటరీ బాధ్యతనుండి తప్పుకుని కేవలం ఎక్స్‌పర్ట్‌గా నాలుగు మాటలు మాట్లాడతానంటూ కొత్త కాంట్రాక్ట్ కుదుర్చుకున్నాడు. ఐతే తానింతవరకు సరిగా చెయ్యనిపని భార్యతో సమయం గడపటం.

కాబట్టి నేను సముద్రతీరంలో కట్టుకున్న ఇంటిలో తన తల్లి, భార్యతో వుండబోతున్నానని ప్రకటించాడు. తన క్రికెట్ ఎదుగుదలలో పాత్ర పోషించిన తల్లి ఆమె 104 ఏళ్ళ వయసులో 2008లో మరణించినప్పుడు కొంచెం డిప్రెషన్‌లోకి వెళ్ళాడు.

అప్పటికి రిచి బెనాడ్ వయసు 78 ఏళ్ళు. ఆ తర్వాత మూడేళ్ళకు కారు నడుపుతున్న రిచి బెనాడ్ స్టీరింగ్ మీద కంట్రోల్ కోల్పోయి గోడకుకొట్టి, భుజం ఎముక విరగ్గొట్టుకున్నాడు. దానినుండి కోలుకోవటానికి చాలాకాలం పట్టింది. తొలి పోటీ ఆడేవారికి సీనియర్ ఆటగాడిచేత దేశ క్యాప్ ఇప్పించటం సాంప్రదాయం.

అలా నేటి ఆస్ట్రేలియా బౌలర్ స్టార్క్‌లో ఆస్ట్రేలియా క్యాప్ ఇస్తూ రిచి బినాడ్ తాను క్యాప్ అందుకున్న రోజును గుర్తుతెచ్చుకుని కన్నీరు పెట్టుకున్నాడు. తొలి క్యాప్‌ని ఎవరూ మరచిపోలేరు. దానిని జాగ్రత్తగా దాచుకుంటారు. రిచి బెనాడ్ క్యాప్ ఎక్కడోపోయింది. అది గుర్తుకువచ్చి కన్నీళ్ళు వచ్చాయి అన్నారు.

ఆ విషయం గమనించిన క్రికెట్ ఆస్ట్రేలియా వారు తిరిగి రిచి బెనాడ్‌కి ఆస్ట్రేలియా క్యాప్ అందించాలని, నిర్ణయించారు. నిబంధనలను పక్కనపెట్టి రిచి బెనాడ్‌కి మరోమారు టెస్ట్ క్యాప్ ఇవ్వటానికి క్రికెట్ ఆస్ట్రేలియా సంఘం అంగీకరించింది.

క్యాప్‌ని సిద్ధంచేశారు. అయితే ఆ క్యాప్ అందించేందుకు తగిన సందర్భం వుండాలనుకున్నారు. ఎలా పడితే అలా కాక ఒక సంబరంగా, బెనాడ్ సంతోషపడేలా ఇవ్వాలనుకున్నారు.

అందుకోసం ఆస్ట్రేలియాలో ప్రపంచ కప్ పోటీలు 2015ని తగిన సమయంగా నిర్ణయించారు. ఇక మిగిలింది బెనాడ్‌కి క్యాప్ ఇవ్వటం. ఆయన ఆ క్యాప్ అందుకుంటూ పొందే ఉద్వేగాన్ని రికార్డు చెయ్యటానికి అంతా సిద్ధంచేసింది చానల్ 9.

కాని సరిగ్గా వీరుపెట్టుకున్న ముహూర్తానికి రిచి బెనాడ్ రాలేకపోయాడు. ఆ సమయానికల్లా అంతగా పాడయింది అతని ఆరోగ్యం.

అంతకుముందు సంవత్సరకాలంగా రిచిబెనాడ్ బాధపడుతున్న చర్మ క్యాన్సర్ ముదిరింది.

ఆసుపత్రిపాలయ్యాడు. చర్మ క్యాన్సర్‌తో బాధపడుతూ, తన 'టెస్ట్ క్యాప్' మరోసారి అందుకోకుండానే ఏప్రిల్ 10, 2015 రాత్రి నిద్రలోనే ఆయన గొంతు మూగబోయింది.

# ఈ శీర్షిక మీదే

## ఉత్తమ ప్రశ్న-సమాధానం

▸ ఆర్.ప్రశాంతి, విజయనగరం

**'ప'రుగులు' పెట్టించేది?**

సై'రన్'.

▸ పి.వి.రమణకుమార్, చిలకలూరిపేట

**పూర్వం ఊరి చుట్టూ పొలాలుండేవి మరిప్పుడు?**

స్థలాలు.

▸ బి.మాన్‌సింగ్ నాయక్, కారంపూడి

**మద్యం?**

లిమిట్‌లో వుంటే 'కిక్కు', లిమిట్ దాటితే 'కక్కు'.

ఉత్తమ ప్రశ్నకు ₹500 ప్రతి ప్రశ్నకు ₹300 బహుమతి

▸ హిరణ్యమూర్తి, హైదరాబాద్

**నా ఆస్తిని చూసి ప్రేమిస్తున్నావా?**

కాదు ఆ ఆస్తి వెనుక ఎవరూ లేరని తెలిసి.

▸ బి.మాన్‌సింగ్ నాయక్, కారంపూడి

**నేటి చదువరి- ఏదీ చక్కగా పలకలేకపోవడానికి కారణం?**

'పలక' లేని చదువు కాబట్టి.

▸ బి.సూర్యనారాయణ, విశాఖపట్నం

**'అనాథ' కామెంట్ ప్లీజ్?**

'అ'మ్మ 'నా'న్నలను 'ద'గ్గరకు చేరనియ్యనివాడు.

▸ ఆర్.ప్రశాంతి, విజయనగరం

**వెర్రి వెంగళప్ప?**

పిడికిలి 'బిగించమంటే' స్క్రూడ్రైవర్ అడిగేవాడు.

▸ డి.వి.చంద్రశేఖర్, కర్నూలు

**బాల్యంనుండి రిటైరయ్యేదాకా బడికి వెళ్ళేవాడు?**

ఉపాధ్యాయుడు.

## ఈ కార్టూన్ మీదే




## B హ్యాపీ

"నాన్నా నాకు ప్రతి రాత్రీ అందమైన కలలు వస్తున్నాయి" అని వచ్చాడు కొడుకు.

"సహజమేరా... అటువంటివన్నీ పెళ్ళయ్యేవరకే" అంటూ టీ.వీ. ఆన్‌చేశాడు తండ్రి.

పోలీసుస్టేషన్‌లోకి ఒక కానిస్టేబుల్ రెండు విస్కీ బాటిల్స్ తెస్తూ సి.ఐకి దొరికిపోయాడు.

మహాస్ట్రిక్ట్ అని చెప్పుకునే ఆ సి.ఐ. ఆ విషయం మీద యాక్షన్ తీసుకుంటానని కేకలేసేసరికి "కోప్పడకండి సార్... ఒకటి మీకు, ఒకటి నాకు" అన్నాడు కానిస్టేబుల్. ఐనా సి.ఐ. ఆపకపోయేసరికి "రెండూ మీకే" అన్నాడు కానిస్టేబుల్.

వెంటనే సి.ఐ. ముఖంలో కోపం పోయింది.

"సరేపో నీ డ్యూటీ మర్యాదగా చేసుకో" అంటూ అక్కడనుండి కానిస్టేబుల్‌ని పంపించేశాడు.

"ఈ డ్రైవర్‌ని తీసెయ్యండి... ఇవ్వాళ మూడు సార్లు యాక్సిడెంట్ చెయ్యబోయాడు. అదే జరిగితే నా ప్రాణాలుపోయుండేవి" అంటూ కోపంగా లోపలికి వచ్చింది కాంతం.

"పోనీలేవే... మరో ఛాన్స్ ఇచ్చి చూద్దాం" అన్నాడు ఆఫీసర్ తన మామూలు పద్ధతిలో.

"ఎలాంటి మొగుడు కావాలి" అడిగింది తల్లి.

"ఎలక్షన్స్ అప్పుడు ఓటర్‌ని చూసుకునే అభ్యర్థిలా నన్ను చూసుకునేవాడు కావాలే" అంది కూతురు.

"ఏడిచినట్టుంది నీ కోరిక... ఎన్నికల తర్వాత పరిస్థితి ఆలోచించుకో" హెచ్చరించింది తల్లి.

భార్య వేధింపులతో విసిగిపోయిన ఒక ఫ్రెంచ్ ఆర్టిస్ట్ "ఇదంతా పురుష ప్రపంచం అంటారు... కాని ఉత్త అబద్ధం... పెళ్ళి తర్వాత ఆయన ఎలా చూసుకుంటున్నాడని అమ్మాయిని అడుగుతారు.

ప్రసవించినప్పుడు అమ్మాయి ఆరోగ్యం గురించి వాకబుచేసి బాధపడతారు.

అతను చచ్చిపోతే ఆమెకు తగినంత మిగిల్చి వెళ్ళాడాలేదా అని చూస్తారు" అంటూ వాపోయాడు.

ఆఫీసులో లేడీ కొలీగ్ ఒక గోడకు ఆనుకుని ఎంతసేపటికీ అక్కడనుండి కదలకపోవటం చూసిన వెంకట్రావు "ఏమైందండీ" అని అడిగాడు.

"మీకు పెళ్ళయిందా!" అని ఎదురుప్రశ్నవేసింది ఆమె. అయిందన్నాడు వెంకట్రావు.

"హమ్మయ్య... అయితే నా జాకెట్ వెనక హుక్ ఊడింది. కొంచెంపెడుదురూ" అని తను ఎదుర్కొంటున్న ఇబ్బంది చెప్పింది ఆవిడ.

ఒక ఆడిటోరియంలో జరుగుతున్న మహిళా మండలి సమావేశంలో ఆడవాళ్ళంతా చేరారు.

భర్తను కోల్పోయి మూడునెలల తర్వాత మండలికి వచ్చిన లీలను "ఇకనుండి మాలాగా బెంగవుండదే నీకు... మొగుడు ఎక్కడున్నాడు... ఏం చేస్తున్నాడోనని ఆలోచించాల్సిన పని లేదు..." అంటూ ఓదార్చారు మిగిలిన సభ్యురాళ్ళు.

ఇద్దరు అమ్మాయిలు చిత్రకళ, చిత్రకారులు గురించి మాట్లాడుకుంటున్నారు.

"నేను నిన్న రామారావు గదిలో నగ్నంగా నిలబడ్డా తెలుసా?" చెప్పింది కాంచన.

"నువ్వు మోడల్‌వి కాదు కదే..." అడిగింది జమున.

"అవును రామారావు మాత్రం చిత్రకారుడు కాదు కదా..." అంది కూల్ కాంచన.

గొప్పవారిగా కావటానికి ప్రయత్నించాలి కానీ ఇతరుల పతనంద్వారా కాకుండా తన కృషిద్వారా సాధించాలి.

Ajay
TOOTHPASTE

SINCE 1985
CELEBRATING EXCELLENCE IN ORAL CARE

# నూతన సంవత్సర ప్రారంభం
# లవంగ శక్తి సహితం

అజయ్ టూత్ పేస్ట్ తరపునుంచి
2018 నూతన సంవత్సరానికి హృదయపూర్వక శుభాకాంక్షలు.



అజయ్ - 1985 నుండి టూత్‌బ్రష్ కేటగిరీలో మీకు నమ్మకమైన మరియు నచ్చిన బ్రాండ్‌గా నెలకొని ఉంది. ఈ నమ్మకం మరియు సురక్షణల బంధాన్ని ముందుకు కొనసాగిస్తూ అజయ్ సమర్పిస్తున్నారు 'కొత్త అజయ్ టూత్‌పేస్ట్. ఇందులో లవంగ తైలపు ప్రకృతిసహజమైన ఔషధీ గుణాలు మిమ్మల్నీ మరియు మీ పూర్తి పరివారాన్నీ దంత సమస్యల నుంచి పూర్తిగా కాపాడి మరియు తాజా శ్వాసను అందచేస్తాయి. లవంగపు ప్రకృతిసహజమైన శక్తితో నిండిన కొత్త అజయ్ టూత్‌పేస్ట్ వాడండి మరియు చిగుళ్లను ఆరోగ్యంగా మరియు దంతాలను పటిష్టంగా చేసుకోండి.

- కేవిటీల నుండి సురక్షణ
- క్రిములతో పోరాడుతుంది
- ఆరోగ్యమైన చిగుళ్లు
- పంటి నొప్పిని తగ్గించటంలో సహాయం
- నోటి దుర్వాసనను నిరోధిస్తుంది










For any trade enquiry please feel free to call us at 044-28221270, 42333921 or write to ajaychennai@yahoo.in

